

అత్యున్నతమైన
ఫ్రెంచి కాఫీ
Brooke Bond
Café
BRAND
French coffee
NETT WEIGHT WHEN PACKED 100 gms.
BROOKE BOND INDIA PRIVATE LIMITED
COIMBATORE
CODE NO. C-L
ప్రత్యేకముగా రుచి ఎంచువారలకు సరిపడునట్లుగా బ్లెండు చేయబడి, అప్పటికప్పుడు గింజలను వేయించి పొడి చేయబడి, సువాసన వెలికి పోకుండ ఉండులాగున, బ్రూక్ బాండ్ కేఫే బ్రాండు ఫ్రెంచి కాఫీ సెలోఫేన్ సంచులలో మీకంద జేయబడుచున్నది. శ్రేష్ఠమయిన చక్కటి రుచికల్గిన ఫ్రెంచి కాఫీ కావలెనంటే, బ్రూక్ బాండ్ మీదే ఆధారపడండి. మీరు కొనుటకు అత్యంత శ్రేష్ఠమైనది ఇది ఒక్కటే.
బ్రూక్ బాండ్
కేఫే బ్రాండ్ ఫ్రెంచి కాఫీ

# ఉత్తరాలు

## ముఖచిత్రం

అమోఘమైన, అందమైన ముఖచిత్రంతో "ఆత్మబంధువు" (రామారావు అన్నయ్య)ను ఎన్నిసార్లు చూచినా తనివితీరలేదు.

కె. వి. లత (తెనాలి)

## వ్యాసం

"దేశవాళీ బయస్కోపు" అన్న శీర్షికలో, "ఈ రోజుల్లో సెనగపప్పు లిట్టర్లలోను, బట్టలు మీటర్లలోను కొలుస్తున్నారు" అని వ్రాశారు. సెనగపప్పు గ్రాములు, కిలోగ్రాములతో అమ్ముతారని మాకు తెలుసునుగాని, లిట్టర్లలో అమ్మడం ఎక్కడా వినలేదే? ఒకవేళ ఎక్కడేనా అమ్ముతున్నారేమో చెప్పగలరా?

ఎమ్. కె. ఆర్. పంతులు (వేములవాడ)

## చదువు[లావు

అసలింతకీ "చదువు[లావు" శీర్షికలో ఆ కుర్రాడికి చదువు[లావు ఏమవుతాడో చెప్తారా?

జి. వి. ప్రసాద్ (విజయనగరం)

## సరాగమాల

రంగారావుగారూ! కొన్ని తప్పులు ఉన్నాయి. మంచి మనసులో అది గ్రహించలేదు. ఏమిటంటే ....

'ఆహా .... ఆంధ్రభోజా!" అను పాటలోని, వస్త్ర స్వరములు సినిమాలో కలవు, రికార్డులో లేవు. శ్రీ శ్రీ గారు వ్రాసిన 'త్యాగం ఇదియేనా' .... అను పాటలోని మొదట "ఆగవోయీ! ఆగవోయీ" అను చరణములు సినిమాలో కలవు. కాని రికార్డులో లేక ప్రారంభము "త్యాగం ఇదియేనా" అని అయినది. దాశరధిగారు వ్రాసిన "నన్ను వదలి నీవు పోలేవులే" పాట ప్రారంభములో సుశీల రెండుసార్లు, ఘంటసాలగారు రెండుసార్లు సినిమాలో పాడిరి. రికార్డులో ఒక్కసారే ఉన్నది. ఆపాటలో చివర చరణములు "నిన్ను వదలి నేను పోలేనులే, నీవులేని నేను లేను లేనులే" అన్న చరణములు సినిమాలో రెండుసార్లు రికార్డులో ఒకసారి పాడిరి.

పెమ్మరాజు నారాయణమూర్తి (అమలాపురం)

* * *

ఒక చిత్రంలో 7 పాటలుంటే, మూడు ప్లేట్లలో 6 పాటలను రికార్డుచేసి నాల్గవ ప్లేటులో ఒకప్రక్క 7 వ పాటను మరియొకవైపు, యింతకుమునుపు రికార్డుచేసిన ఆ పాటలలో ఏదేని ఒకదానిని యెంచి రికార్డు చేస్తారు. అంతేగాని ఖాళీగా వదలరు. నేనిలాంటి రికార్డులను చాలా చూసియున్నాను. ఇక గుడివాడ నాగేశ్వరరావుగారి (29—6—62) సందేహం తీరిందనుకుంటా?

పి. యువరాజ్ సింగ్ (పాకాల)

* * *

శ్రీ వి. ఎ. కె. రంగారావు నిర్వహిస్తున్న "సరాగమాల" శీర్షిక మనోరంజకంగా ఉంది. కేవలం సినిమాలకే 'సెన్సారింగ్' పెట్టి జుగుప్సాకరమైన రికార్డులని ప్రజాబాహుళ్యంలోనికి వదలడంవల్ల ప్రయోజనం లేకపోవడాన్ని ఆయన చక్కగా నిరసించారు. వద్దనుకున్నా మన చెవులను హోరెత్తించే ఈ అశ్లీలపు హాస్యపు రికార్డులను సెన్సార్ చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

పి. గోపాలకృష్ణరావు (పార్వతీపురము)

* * *

"సరాగమాల"లో రంగారావుగారు — బెజవాడ రాజరత్నాన్ని గుర్తుకు తెచ్చి అనాటి "దేవత"లో ఆమె పాడిన మధురమైన పాటల్ని జ్ఞాపకం చేసినందుకు సంతోషం. "దేవత" విడుదలై సుమారు 20 సంవత్సరాలు కావస్తున్నా, అందులో రాజరత్నం, సూర్యకుమారి, నాగయ్య మొదలగువారు పాడిన పాటలు ఈనాటికీ, ఏనాటికీకూడా సంగీతప్రియుల హృదయాల్లో శాశ్వతంగా ఉండిపోతాయి. కాని రంగారావుగారూ, "కోయిలరో! ఏది నీ ప్రేమగీతి" అన్నపాట "గృహలక్ష్మి"లో కాంచనమాలతో కలిసిపాడింది అని వ్రాశారు. నాకు జ్ఞాపకమున్నంతవరకూ ఇది సోలో పాట. "కోయిలరో" పాట "మళ్ళీపెళ్ళి"లో కాంచనమాల, వై. వి. రావుగార్ల యుగళగీతం అని నాకు జ్ఞాపకం. "మళ్ళీపెళ్ళి"లో ఆమె పాడిన మధురమైనపాట "చెలి! కుంకుమమే పావనమే" ప్రతి రోజూ ఈ పాట వినటంకోసమే "మళ్ళీ పెళ్ళి"కి వెళ్ళి పిచ్చెత్తిపోయిన వాళ్ళున్నారు మావాళ్ళలో. ఆరోజుల్లో శ్రోతలను ఉర్రూతలూగించిన రాజరత్నం ఈనాడు తెరమరుగున పడటం శోచనీయం. "జగదేకవీరుని కథ"లో "వరించి వచ్చిన మానవ వీరుడు" పాట పాడినవాళ్ళలో ఈమె ఒకతె.

యస్. బాలకృష్ణారావు (ఖరగ్‌పూర్)

* * *

నాదొక చిన్న సందేహము. "కొండవీటి దొంగ" చిత్రంలో "కొమ్ములు దిరిగిన మగవారు మా కొంగు తగులితే పోలేరు" అన్న రికార్డు అదే వరుసతో, అదే సాహిత్యముతో "భట్టి విక్రమార్క"లో వినిపించారు. ఈ విధముగా ఒకే రికార్డు రెండు సినిమాలలో వినిపించవచ్చునా. నా సందేహము తీరుస్తారని ఆశిస్తున్నా.

భీమవరపు రావు (బొబ్బిలి)

## సలహాలు

మీ వారపత్రికలో "ఉత్తరాలు", "వనితావాణి" ఈ రెండు శీర్షికలే కాకుండా "ప్రశ్నోత్తరములు" అనే మరో శీర్షికు ప్రవేశపెట్టి....తద్వారా....మరి కొంత ఔత్సాహిక పాఠక మహాశయులకు, తమ తమ నామ ధేయంబులను మీ పత్రికలో అచ్చు వేయింపించుకొనేందుకు అవకాశం కల్పించెదరని ఆశిస్తాను. దీని పరమార్థంమాత్రం........పేరు వేయించుకొనటానికికాదని గుర్తిస్తే సంతోషిస్తాను.

బి. వి. ఆర్. జె. రావ్ (బొబ్బిలి)

* * *

అసంఖ్యాకంగా వస్తూ, కథాసాహిత్యపు విలువల్ని కూనీ చేస్తున్న వ్రాతలు వ్రాసేవాళ్ళకు వేసేవాళ్ళకీ తెలిసేటందుకు "కథా సాహిత్యంలో పాలకుడిపాట్లు" అనే శీర్షిక ప్రవేశపెట్టి, పాఠకుల అభిప్రాయాలూ, విమర్శలూ, ఉదాహరణలతోకూడిన సూచనలూ ప్రచురిస్తామని ప్రకటించరాదూ....

వి. ఎస్. ప్రసాద్ (తెనాలి)

* * *

## సీరియల్ కథ

పత్రికలో వస్తున్న సిరాజీగారి "విశీ విడని చిక్కులు" చక్కగా ఉంది. అందులో రచయిత చక్కని శిల్పంతోగూడిన శైలి గమనించతగ్గది.

టి. వెంకటేశ్వర్లు, (పోర్టు—నోవో)

## కథలు

హల్లో—బమిక్ హల్లో మిష్టర్ టంబుగుండూ! డోంట్‌ఫియర్. ఐ యాం ఆల్సో హియర్. రష్యా నాయకుడు కృశ్చేవ్; మన నాయకుడు కీ. శే. గాంధీ; హాలీవుడ్ హీరో యూల్‌బర్నర్‌లది కూడా మన డిటోయే.

మిష్టర్ వామన్ (నారాయణపురం)

* * *

గుండుద్వయం కూల్‌డ్రింకులు త్రాగడానికి ప్రక్కనేవున్న డ్రింక్ షాపులోనికి వెళ్ళినట్లు లోన అమర్చబడిన అద్దములలో వాళ్ళ గుండ్ల ప్రతిబింబాలను చూచి గాబరాపడి బయటకు వచ్చేసినట్లును వ్రాశారు.

కాని తిరుపతిలో అసలు అద్దములు అమర్చబడియున్న కూల్‌డ్రింక్ షాపులేదు—గుండు తన్మయత్వంలో ఆవిషయాన్నే విస్మరించుచున్నట్లున్నారు—చక్కని కథ అందించిన రచయితకు నా అభినందనలు.

శ్రీధర్ (విశాఖ)

* * *

"గుండుకథ" చదివి మేము నవ్వలేక చచ్చిపోయాం! "టంబు"గారు చాలా హాస్యంగా వ్రాశారు.

కుమారి భాగవతుల రాజ్యలక్ష్మి, (నండూరు)

* * *

"గుండుకథ" చాల ఆకర్షించింది. ప్రస్తుతము (ఈ 20 వ శతాబ్దములో) చాలమంది విద్యార్థులు పరీక్ష ప్యాసుఅయితే శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధికో, శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి సన్నిధికో వెడలి, అచట కేశఖండన టిక్కెట్టుకొని మొన్నగా గుండు గీయించుకురావటము పరిపాటి. ఈ ఇతివృత్తమునే ఊతగాగొని, చక్కని కథను వాస్తవికముగా కనులకు కట్టేటట్లుగా రచించి ఆంధ్రసచిత్రవారపత్రిక చదువరుల కందించిన టంబు గారికి నా హృదయపూర్వకాభివందనము అర్పించుచున్నాను.

డి. వి. నరసింహామూర్తి (చక్రధర్‌పూరు)

* * *

నే చెపుతున్నాగా గుండేమిటి! అందంగా ఉండకపోవడమేమిటి టంబూ! ఏమైనా బాగా వ్రాశావ్, కొట్టేవ్‌చాన్సు! నేనూ వెళతానులే ఓగుండేసుకోడానికి.

ఓ ఉడ్‌బి గుండు (ఇందుపల్లి)

* * *

"గుండు" కథలో గుండు వర్ణన చదువుతుంటే గుండులేనివాళ్ళుకూడా గుండు చేయించుకోవాలని బుద్ధిపుడుతోంది.

భట్ల పెనుమర్తి శర్మ (విజయవాడ)

* * *

"మార్కిక" కథలో "మా మేనత్త—అంటే—మేనమామ భార్య" అని ఉంది. మేనత్త అంటే తండ్రి సోదరేకాని మేనమామభార్య కాదని రచయితగారికి తెలీదా?

వై. మురళీధర్ (మద్రాసు) ★

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!




# PHILLIPS ఫిలిప్స్ సైకిళ్ళు
## మీకై నిర్మితమైనవి

సొగసై కంటికి నదరైన ఫిలిప్స్ సైకిలు నేటి మీవంటి వుత్సాహవంతులైన యువకుల కొరకై నిర్మితమైనది. ఎట్టి మోటు వాడుకకైనను తట్టుకొన జాలు పట్టుగా అసలైన పదును చేయబడిన ఉక్కుతో దృఢముగా నిర్మింపబడినది.

డెబ్బై ఏండ్లుగా ప్రపంచ ఖ్యాతి నొందిన ఫిలిప్స్ సైకిళ్ళు, యిప్పుడు టి. ఐ. సైకిల్స్ వారి అత్యాధునికమైన కర్మాగారంలో, ఖచ్చితమైన పద్ధతులలో తయారుచేయబడుచున్నవి.

**టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా** అంబత్తూరు — మద్రాసు

RENOWNED THE WORLD OVER PHILLIPS

NVT/TIC/PH/1604

ఆంధ్రసచిత్రవార

# పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 20—7—62
సంపుటము : 54 సంచిక : 46
శుభ॥ సం॥ ఆషాఢ మాసం॥ బహుళ తదియ

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★




బం, జరీ పిక్చర్స్ వారి రాబోయే చిత్రంలో 'శారద'

## మనలోమాట

శ్రీ ఎగ్గోని శ్యామసుందర్ గారి ఊరు గుత్తి అని 13-7-62 సంచికలో చెప్పాము. కొందరు పాఠకులు, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో తరచు బొమ్మలు వేసే తక్కిన చిత్రకారులు ఎక్కడెక్కడ ఉంటున్నారో తెలుపవలసిందని వ్రాశారు. బాపు, శంకర్, 'రేఖ' నరాగం, దేవిక, వీరందరిదీ మద్రాసు. సత్యమూర్తిది హైదరాబాదు. సెలవులకి మాత్రం రామచంద్రపురం వెడుతూ ఉంటారు.

* * *

'చిత్రవ్యక్తులు' శీర్షికలో శ్రీ సుకుమార్ ఇప్పుడిప్పుడే పేరు తెచ్చుకుంటున్న వారిని గురించి వ్రాయాలని నిశ్చయించారు కాని సినిమాలలో బాగా కీర్తి సంపాదించుకున్న కొందరు చిత్ర వ్యక్తులనుకూడా పాఠకులకు పరిచయం చెయ్యవచ్చు!

## లోకంపోకడ



"ప్రొఫెషనల్ కాలేజీలలో సీటు సంపాదించటమంత తేలికైనపని మరొకటిలేదురా భాయ్—నిన్నటిదాకా అనవసరంగా దిగులుపడిచచ్చానుగాని! ఇంతకీ సీటుకేమిటో చెప్పమంటావా? మంత్రిగారి బంధువు అమ్మాయితో నిన్న నా పెళ్ళి నిశ్చయమైంది. ఈవేళ సీటు దానంతట అదే వచ్చింది."

## విషయానుక్రమణిక

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.




రాసుకోవండి "హేజలైన్' స్నో" ముడతలు, మొటిమలు, మచ్చలు మాయమయి పోతాయి.

"హేజలైన్' స్నో" వంటి రంగును మెరుగుపరిచేవాటిలో అతి మృదువయినది. మెత్తనిది... జిడ్డులేనిది పోయిన గోరిపేది. ఇది మీ చర్మాన్ని పట్టులా మెత్తగా వుంచి, మీ వంటి రంగును ప్రకాశవంతంగానూ, కాంతి వంతంగానూ చేస్తుంది. ఉదయం... సాయంత్రం... రాత్రిపూటకూడా "హేజలైన్' స్నో" ఉపయోగించండి. మీవంటి రంగును ఇది కాపాడుతుంది, దీని మీద పౌడరు బాగా పడుతుంది. మీ చర్మాన్ని ఇది మెత్తగానూ, మృదువుగానూ, తెల్లగానూ వుంచుతుంది. "హేజలైన్' స్నో" —తర తరాలుగా సుందరాంగుల సౌందర్య సాధనం.

"హేజలైన్' స్నో" బర్రోస్ వెల్కం ఉత్పత్తి

SWY-7-TEL

# మొదటి జీతము

## మాలతి



లెక్చరర్ కుశాలరావు క్లాసులో పాఠం చెప్పుతున్నాడు. 'పిరియడ్' మొదలయి అరగంటయింది. ఇంకో అరగంట ఓపిక పడితేగాని బయటపడలేమని కొంతమంది బాధగా మూలుగుతున్నారు. వెనక బెంచీల్లో వాళ్ళు పకిలించారు. ముందు బెంచీల్లోవాళ్ళు తమముందు కూచున్న అమ్మాయిల జడల్లోని కుసుమ సౌరభాన్ని ఆఘ్రాణిస్తూ వారు అనుభవిస్తున్న బాధను తాత్కాలికంగా మరచిపోవటానికి ప్రయత్నిస్తున్నారు. మరి కొంతమంది మెల్లిగా మాట్లాడుకోవడం మొదలు పెట్టారు.

క్లాసులో సగంమందికి పైగా అవహానంతో బాధపడుతున్నా కుశాలరావులో మాత్రం మార్పేమి కనబడలేదు. అనర్గళంగా సాగిపోతున్నది లెక్చర్.

—53 వ పేజీ చూడండి


నడిసముద్రంలో చేపలవేటకు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పథకం
కేరళ పరిస్థితిని చక్కబెట్టేందుకు దేశీయాంగ మంత్రి ప్రయత్నం!
చారలగుఱ్ఱం-గాడిదల సంకరజాతి సంతానం-మనిలా వార్త
సి. పి. ఐ
సిపి ఐ మాటేమిటి? రష్యా ఎలుగు బంటుకు-భారత దేశపు గాడిదలకు కలిగిన మిశ్రమ సంతతి కాదా?
పశ్చిమబెంగాల్‌లో శ్రీ పి.సి.సేన్ కీ॥ శే॥ బి.సి. రాయ్‌కి వారసుడుగా వచ్చారు
బిసి రాయ్ పాదరక్షలు
OOMMEN

# (ప్రి)నీతి చంద్రిక ***



## సుకుమార్

(గత సంచిక తరవాయి)

తెల్లవారింది. పదకొండో నెంబరు చెట్టుకింద నించొనివున్నాను. పరుగెత్తుకుంటూ ఫలానావచ్చి, "అర్జెంటు, పరుగెత్తండి......లాభంలేదు......... ఇంకా స్పీడు......అవతల ఎవడో ట్రై చేస్తున్నాడు......మనం ముందు వెళ్ళాలి లేకపోతే ఛాన్సు.... పో.....తుంది......" అంటూ పరిగెత్తించాడు.

"క్లైమాక్సుసీను అనుకోండి.....కెమేరావంకగా తిప్పి షాట్లు తియ్యండి......ఐపోతుంది, క్విక్......క్విక్...... డండండండండాం ........ ఇవి బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్‌లెండి...." అని ఏదో చెప్పుకుపోతున్నాడు. ఇద్దరం మొత్తానికి చేరుకున్నాం. అదో పెద్ద దివ్యభవంతి. డ్రీమ్ సీక్వెన్స్‌లోవచ్చే టాపులేని స్తంభాలూ, మెరిసే నక్షత్రాలూ, పువ్వులూ........బెలూన్లు అన్నీ ఉన్నాయి. నిర్మాత గంభీరంగా ఎత్తుగా ఉన్నాడు. "కమాన్ డైరెక్టర్" అని నాకు సీటు ఇచ్చాడు. "టేక్ ది సిగరెట్" అన్నాడు......'బాయ్, ఒవల్టిన్' అన్నాడు. అన్నిఅయ్యాక, "నువ్వు చాలా ఇంటలిజెంటువి. నీకు కారులేదా?.....ఐతే నా కారు తీసుకో.....ఫర్వాలేదు—అది అంత పాడుగుందని భయపడకు—టర్నింగ్‌ల్లో కాస్త కష్టం! అంతే. ఈ సూట్లన్నీ నీకోసం కుట్టించినవే" అన్నాడతను. ఓ సూటుకేసుకొన్నాను — నేనే మారిపోయాను—తెల్లగా అంత ఎత్తున వున్నాను—నోట్లో సిగరెట్టు పెట్టుకుని, ఆ కార్లోంచి వెళ్తూఉంటే పాండీబజార్లో అందరూ నాకు సలాంలు కొట్టేవాళ్ళే—కారు నేనే డ్రైవింగ్.......జోరుగా నడవగా నడవగా అది వెళ్ళి ఠాంమని చెట్టుకొట్టుకుంది. పెద్ద శబ్దం అయింది. కేకవేశాను—

చటుక్కున కళ్ళు విప్పాను—ఏముంది?పార్కు బెంచీమీదే ఉన్నాను! 'డ్రీమ్ సీక్వెన్స్' అనుకున్నాను. ఎట్లావుంది సస్పెన్సు?.......సరి, మళ్ళీ అట్లాగే నిద్రపోయాను. ఎవరో తట్టినట్టయి లేచాను—ఫలానా!

"ఏవిటిసార్ మీరూ—పదకొండో నెంబరూలేదు, ఏమీలేదు, నా లక్ అంతా పాడుచేశారుగదండీ—వెంట వెంట ఇంకా నిద్రేమిటి—రాత్రి బాగా హెవీ భోజనం పడినట్టుంది—చూశారా, సూర్యభగవాన్లు ఎట్లా కాల్‌షీటు ఇచ్చాడో—అవుట్‌డోర్‌కు ప్రశస్తమైన ఎండ!.........లెండి" అన్నాడు.

నేను లేచాను. బాగా పొద్దెక్కిపోయింది.

"లేదు, తెల్లవారుజామున ఇట్లావచ్చి కూచున్నాను—నిద్రపట్టింది......అంతే" అన్నాను నీరసంగా.

"కాస్త కొళాయిదగ్గర మొహం కడగండి—కాఫీ తాగుదాం" అన్నాడు ఫలానా. ఆమాట వినగానే ఎక్కడలేని శక్తీ వచ్చింది—గబగబాలేచి వెళ్ళి మొహం కడుక్కున్నాను. ఫలానా నాకు రెండు ఇడ్లీ, కాఫీ ఇప్పించాడు. అతనూ తాగాడు. తప్పకుండా ఈ పిక్చర్లో ఫలానాకు పెద్దవేషం ఇవ్వాలనుకున్నాను. ఇద్దరం బయల్దేరాం.......

ఫలానా ఒక చిన్న హోటలుకు తీసుకెళ్ళాడు. "ఇందులోనే వుంటున్నారు—ఉండండి......అట్లా వెళ్ళండి......కొత్త నిర్మాతగారెవరు అని అడగండి చెప్తారు...భయంలేదు.....ధైర్యే సాహసే లక్ష్మీ — డొబుకొట్టండి, లేకపోతే నెగ్గలేం. ఖచ్చితంగా అన్ని విషయాలూ మాట్లాడనీయండి. జాగ్రత్త.... ష........" అన్నాడు ఫలానా. నేను వెళ్ళబోతూ వుంటే, ఆపి మళ్ళీ అన్నాడు: "నేను చెప్పానివిమాత్రం చెప్పకండి. మీరే ఎక్కడో విన్నట్టు చెప్పండి...... వెళ్ళండి"

నేను వెళ్ళి అడిగాను ఒకతన్ని. "నేనే కొత్త నిర్మాతను......ఏం కావాలి......వేషాలు ఇంకా ఏం అనుకోలేదు, నెలాఖరుకు కనిపించండి......ఏవో చిన్నవేషాలుంటాయి" అని తొరతొరగా అనేసి వెళ్ళిపోతున్నాడు

"వేషంకోసం కాదండీ—నాపేరు మహేశ[illegible], చిత్రదర్శకుడిని" అన్నాను.

నిర్మాత నాకేసి వో క్షణం అదోలాచూసి రమ్మన్నాడు. నన్ను చాలా విషయాలు అడిగాడు. అన్నింటికీ సమాధానాలు చెప్పాను.

63 — వ పేజీ చూడండి



## సెట్టుమీద:

# శుభోదయ వారి 'వారసత్వం'

"మాంగల్యం తంతునా...." అని ప్రారంభించారు పురోహితులు. 'ట్రాలీ' వెనకనుంచి ముందుకు వచ్చింది—జమీందారు వల్లభరాయుడు సీతకూ, సైకిలుషాపు యజమాని సంజీవి—రాజ్యానికీ మంగళసూత్రాలు కట్టేశారు. కెమెరా 'గుమ్మం' వేపు 'పాన్' ఐంది— గుమ్మంలోంచి వస్తున్న రఘు—ఒక్కసారి నిశ్చేష్టుడయిపోయాడు.

"వల్లభరాయుడుగారూ" అని గర్జించాడు రఘు.

ఈ కేకతో ఎక్కడివక్కడ ఆగిపోయాయి. వివాహం చూడవచ్చిన అమ్మలక్కలూ, అయ్యలూ ఎవరికి వారు నిశ్శబ్దం అవలంబించారు—

"రా నాయనా, రా ! మంచి సమయానికి వచ్చావు" అన్నాడు ఆప్యాయంగా, అమాయకంగా వల్లభరాయుడు.

"నేను రాకపోయినా బావుండేది" అన్నాడు రఘు నిస్పృహతో.

"అదేమిటి నాయనా, అలా అంటున్నావు—ఏమైంది ?" అన్నాడు ఆత్రుతగా వల్లభరాయుడు.

"ఈ వయస్సులో ఒక కన్నెపిల్లను కట్టుకుని, ఆమె గొంతు కోశారు. ఇంకేం చెయ్యాలి ?" అన్నాడు కోపంగా రఘు.

ఇంతలో రఘు తండ్రి చిట్టిబాబుకు కోపం వచ్చింది—

"ఏమిట్రా అది ? నిన్నెవరు రమ్మన్నారు ?" అని గద్దించాడు అతను.

"ఇదంతా నువ్వే చేశావు" అన్నాడు రఘు.

"రఘూ, తొందరపడుతున్నావు నాయనా" అన్నాడు శాంతపరుస్తూ వల్లభరాయుడు.

రఘుకు ఆవేశం వచ్చింది—"ఇద్దరు వృద్ధులు కలిసి ఇంత ఘోరం చేస్తూవుంటే చూస్తూ ఊరుకుంటానా ? మీ యిద్దర్నీ ఇప్పుడే ఇక్కడే.."

"ఆగు !" అన్నది వెంటనే పెళ్లికుమార్తె సీత. "అనవసరంగా నా భర్తను నిందించే హక్కు నీ కెవరిచ్చారు ?"

ఈమాటతో రఘు మళ్లీ నిశ్చేష్టుడయినాడు. 'ఆఁ' అనుకున్నాడతను. ఎవరికోసం తాను ఆవేశం తెచ్చుకున్నాడో—ఎవరి సుఖంకోసం తాను ఇంతటి మాట లన్నాడో—ఆమే, తనపై తిరగబడింది. వృద్ధ జమీందారు డబ్బుకోసం కక్కుర్తిపడి, ఈ వివాహాన్ని జరిపించారు ! .... వచ్చిన దారినే రఘు వెళ్లిపోయాడు !

శుభోదయవారు నిర్మిస్తున్న 'వారసత్వం' చిత్రంలోని ఈ వివాహ ఘట్టంలో రఘుగా రామారావు, సంజీవిగా రేలంగి, రాజ్యంగా బాలసరస్వతి, సీతగా గిరిజ, వల్లభరాయుడిగా కొత్త నటుడు నారాయణస్వామి నటించారు.

సీనులో ఈ పెళ్లిసెట్టు కోలాహలంగా ఉన్నది. షూటింగులో పాల్గొంటున్న జనంకంటె షూటింగు చూడవచ్చిన జనం అధికంగా ఉన్నట్టున్నారు. మొత్తానికి అంతా హడావిడిగానే ఉంది. నలుగు రైదుగురు 'గెస్టు' లను పోగేసుకుని, బయట కూచుని అల్లు రామలింగయ్య, రాజాబాబు సరదాగా నవ్విస్తున్నారు. ఈ చిత్రంలో రేలంగికి రామలింగయ్యా, శివరామకృష్ణయ్యకు రాజబాబూ అసిస్టెంట్లు. రాజాబాబు కొత్తగా వస్తున్న హాస్యనటుడు. ఇటీవల వచ్చిన 'స్వర్ణగౌరి' చిత్రంతో అతనికి మంచిపేరు వచ్చింది.

"నేను మూడు ముళ్లూ వేసివచ్చేనా— ఒక్క ముడే వేశానా ?" అన్నాడు రేలంగి, షాట్ అయిన తర్వాత.

"ఎన్నిముళ్లు వేసినా, పెళ్లి జరిగిపోయిన తర్వాత—ఇంక మనం చేసేదేంలేదు—" అన్నాడు దర్శకుడు తాపీ చాణక్య. ఈ వివాహ దృశ్యంలో పాల్గొన్నవారిలో హేమలత, వంగర కూడా ఉన్నారు. అసలు, ఆస్తికోసం అని ఈ వివాహాన్ని ఏర్పాటు చేసినది చిట్టిబాబు !—ఈ పాత్ర ధరిస్తున్నది డాక్టర్ శివరామకృష్ణయ్య .... ఈ ఘట్టానికి ముందు వెనకల 'కథ' ఏమిటో ఇప్పుడు మనకు తెలియకూడదు. అది వెండితెర మీద చూసి ఆనందించవలసినది !



'మహామంత్రి తిమ్మరుసు'లో విజయలక్ష్మి.

తర్వాత 'బ్రేక్' అన్నారు. అందరూ, సెట్లోంచి బయటకొచ్చారు. కాస్త ప్రకృతి గాలి పీల్చుకోటానికని కొందరూ, కాఫీ పీల్చటానికని ఇంకొందరూ, సిగరెట్లు పీల్చటానికని మరికొందరూనూ.

ఈ చిత్రంలో అసలు విలన్ పాత్రను రాజనాల ధరిస్తున్నాడు. ఉదాత్తమైన పాత్రను గుమ్మడీ, అతని భార్యగా నిర్మలా నటిస్తున్నారు. ఈ చిత్రంలోని నాయిక అంజలీదేవి !!



రేలంగి చూస్తున్నది స్క్రిప్టా ? ఫొటోనా ? రాజ్యలక్ష్మీవారి సెట్టు మీద అతనూ, నిర్మాత దూండీ, దర్శకుడు మధుసూదనరావు, కాంతారావు. ఫోటో: యూస.

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# స్లోన్స్ బామ్ వాడి నొప్పిని వెంటనే పోగొట్టుకోండి




స్నాయువుల బెణుకులు, మెడ పట్టులు మరియు వీపు నొప్పులు, కీళ్ల ఉబ్బులు నాడీవ్యాధి మరియు నడుమునొప్పి మొదలగు నొప్పులకు నొప్పిగా ఉన్నచోట్లల్లా కొంచెము స్లోన్స్ బామ్ రాయండి. తక్షణమే దాని ఉపశమనము కూర్చే వేడి లోపలికి వ్యాపించి నొప్పిగా ఉన్న చోటుకు శుభ్రపరచే రక్తము క్రొత్తగా ప్రవహించుటలో సహాకరించును. వెంటనే ఉపశమనము కలిగించే ఒక స్లోన్స్ బామ్ సీసాను ఎల్లప్పుడూ యింట్లో ఉంచుకోండి.

**వాతరోగము * బెణుకులు * స్నాయువుల నొప్పులకు**

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపింపబడినది)



ఈ చిత్రంలో కొంతమంది కొత్త నటీనటులు కనిపిస్తారు. వారిలో నారాయణస్వామి, రాధాకుమారి ముఖ్యులు. ఈ చిత్ర రచయిత కూడా కొత్తవాడే. ఆయనపేరు బరంపురం కొల్నాడి. ఇదివరకు 'అత్తా ఒకింటి కోడలే' చిత్రానికి కథను వ్రాసినది ఈయనే. ఈ చిత్రానికి కథా, మాటలూ కూడా ఆయనే రాస్తున్నాడు.

## వారసత్వం

ఇప్పటికి ఏడు పాటలు రికార్డయిపోయినై. ఈ పాటలను ఆరుద్రా, వార్ల చిరంజీవి రచించారు. ఇంకొక్క పాట మాత్రమే 'రికార్డు' కావలసి ఉన్నది. ఈ చిత్ర సంగీత దర్శకుడు : ఘంటసాల వెంకటేశ్వరరావు. కెమెరా : ఎస్. ఎస్. వర్మ, కళ : అమ్మయప్పన్. దర్శకుడు : తాపీ చాణక్య. నిర్మాతలు : రంగా అండ్ శాస్త్రి. ఇప్పటికి దాదాపు పన్నెండు రీళ్లయిన ఈ చిత్రాన్ని, ఆంధ్రలో గౌతమీవారు విడుదల చేస్తారు. ★

'సు'



శ్రీ కృష్ణసాయి ఫిలింస్ వారి "మాయా మోహిని" లో లీలావతి.

# కాశ్మీర్ బోకె టాల్కు‌తో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి




అత్యద్భుతమైన, నాణ్యమైన కాశ్మీర్ బుకె కాన్కలు ఒక సౌందర్య టాల్కు... ఒక బేబీ పౌడరు

పూల గుచ్చంలోనికి చొచ్చినట్లుగావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్కు యొక్క చల్లని, పూలరేకు వంటి మెత్తదనాన్ని అనుభవిస్తే. వొళ్లు అంతా రాసుకొనండి, నవ వసంతపు ఘుమఘుమలతో రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా సౌఖ్యంగా వుంచండి! కాశ్మీర్ బుకె ప్రతి యితర ప్రత్యేక బేబీ పౌడరువలె మెత్తగా, సున్నితంగా వుంటుంది. మీ ఇద్దరూ ఉపయోగించగల ఒకే పౌడరు అందు బాటులో వుండటం ఎంత మేలు!

# కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కుం పౌడరు

CB-8-19 TEL.

# సరాగమాల

## వి ఎ కె రంగారావు

ఈమధ్యనే నాలుగైదు హెచ్. ఎం. వి. బేసిక్ రికార్డులు విడుదలైనవి. బేసిక్ రికార్డులంటే సినిమాలలోవి కాక వేరే పాటలన్నమాట. వీటినే సాధారణంగా ప్రైవేటు రికార్డులని అంటారు. ఈ పాటలు పాడేవారు కొలంబియా కంపెనీకి కొంతమంది, హెచ్. ఎం. వి. కి కొంతమంది ఉంటారు. శ్రీనివాస్, లీల, జానకి, సుశీల, మాధవపెద్ది, జమునారాణి, వసంతకుమారి మొదలైనవారు కొలంబియావారి సొత్తు. ఘంటసాల, రాణి, జిక్కి, అప్పారావు, బి. గోపాలం, పిఠాపురం, బాలసరస్వతి వీరందరు హెచ్. ఎం. వి. గాయకులు. వీరు ఆకంపెనీకి వారు ఈ కంపెనీకి పాడటానికి వీలులేదు. అంటే ప్రైవేటుపాటల విషయంలో మాత్రమే. సినిమాలకు వీరు పాడిన పాటలు కూడ సర్వసాధారణంగా ఆ యా కంపెనీలే విడుదల చేస్తారు. మరి వేరే గత్యంతరం లేనప్పుడు వేరే కంపెనీ రికార్డులలో విడుదలకావటం జరుగుతుంది.

ఇక పాటలగురించి ఆలోచిద్దాం. కె. అప్పారావు పాడిన "మల్లెపూలతోటలో కమ్మని వాసనలో" వింటానికి సురసురభిళభరితంగా కమ్మగా, హాయిగా ఉంది. సాహిత్యం వి. హనుమంతరావుది. అప్పారావు కంఠం గత రెండు సంవత్సరాలలో చాలా కుదుటబడి, ఒక విశిష్టతని సంపాదించుకున్నది. వసంతకాలాన్నున్న సౌరభాన్నంతా తమకంఠంలో సంతరించుకొని ఈపాట పాడినట్లనిపిస్తున్నది. ఈ పాటకు బి. గోపాలం ఏర్పరచిన వరస తమాషాగా, అక్కడక్కడ పాశ్చాత్యపోకడలతో వినసొంపుగా ఉంది.

దీనివెనుక జిక్కిపాడిన "కన్ను కన్ను కలపరా" అనే "రోకలి రోలు" పాట (రాక్ అండ్ రోల్ అని పాఠాంతరము) వరస దీని కాపీ లేకపోయినా వాద్య రచనంతా సర్కస్‌బ్యాండులాగ ఉంది. పల్లవి సాహిత్యం కూడ "కన్నూ కన్నూ కలపరా మనసు నాపై నిలపరా" అంటూ ఎబ్బెట్టనిపిస్తున్నది. ఇంకా నయం. యతి ప్రాసలకోసం ప్రయాసపడి "వేడినీళ్ళు తోలపరా, కందిపప్పు వేపరా" అనలేదు. చరణాల రచన కొంత నయం. జిక్కివంటి పేరుపొందిన గాయకురాలిచేత ఇటువంటిపాట పాడించటానికి కారణం దురూహ్యం. ఈ రికార్డు నంబరు ఎన్. 96209. జిక్కి పాడిన పాటకోసం కాకపోయినా, అప్పారావు పాటకోసమైనా తప్పక కొనవలసిన రికార్డు.

ఈవిడత రికార్డులలో మొదటిమార్కు సంపాదించుకునేపాట బి. గోపాలం, రాణి పాడిన "చల్లగాలిలో" అనే ద్వైతగీతం. ఈపాట వరసకు, రచనలో కొంతవరకు మాతృక తమిళచిత్రం "పార్తాల్ పసితీరుమ్"లో విశ్వనాధన్—రామ్మూర్తి—కన్నదాసన్ సంయుక్తకృషి "కొడి అసైందదుమ్" అనే పాట. ఈ చిత్రమే "పవిత్రప్రేమ" అనే పేరుతో తెలుగులో విడుదలైనా, చిత్రం విజయవంతంగా పోలేదని ఆచిత్రంలో పాటలు రికార్డులుగా ఇవ్వటం మానివేశారు. ఆచిత్రంలో పైపాటకు అనిసెట్టి చక్కని సాహిత్యం వ్రాశారుకూడాను. "పవిత్రప్రేమ" చూసి, ఆపాట నచ్చినవారు తప్పక రాణి గోపాలం పాడిన యుగళగీతం అనుకొంటారు. వడ్డాది సాహిత్యం చల్లగా "చల్లగాలిలో లతలు ఊగెనా, లతలు ఊగగా, గాలి వీసెనా" అనే చక్కని ప్రశ్నల పరంపరతో సాగిపోతుంది. పల్లవిని మొదట నీకీలాగ అన్నపుడు ఇరువురు గాయకులు అన్న "ఓహొ" "ఆహా" సరదాగా సరసాలాడుకుంటున్నట్టు ఉన్నాయి. రాణి గంధర్వలోక సామ్రాజ్ఞిగా, సప్తస్వరసాధిత శోభితవాణిగా, లలితసంగీతరాణిగా పాడా రీపాట. శ్రుతి వేరవటంవలన కాబోలు గోపాలం అందుకుని పాడినట్లుంది. వింటానికి బాగానేవున్నా, వారు స్వంత శ్రుతిలో పాడితే దొర్లేటటువంటి సున్నితమైన సంగతులకు ఇందు అవకాశం లేకపోయింది.

రెండవప్రక్క పిఠాపురంచేత పాడించిన "ఆహాహా వినవా చెలి" అనేపాట. "జబ్ ప్యార్ కిసీసే హోతాహై" అన్న హిందీపాటకు తెలుగు దిగుమతి. ఇటువంటి పాటలు ఎందుకు రికార్డుచేస్తారో అర్థంకాదు. మాతృకపాట పాడినది రఫీ. వారికున్న "రేంజ్" మన వాళ్లకు లేదు. రమ్మన్నా రాదు. ఇక వాద్యరచన సంగీతమంటారా, శంకర్, జైకిషన్ అరవై వాద్యాలతో చేసిన పాటకు సరిగా పదోవంతు, ఆరు వాద్యాలతో చేస్తే వెలితి కనపడదా? ఈ తెరవెనుకభాగోతం తెలియనివాళ్ళు ఆ వెలితిని గ్రహించి, కారణం తెలుసుకోలేక, పిఠాపురం బాగా పాడలేదనవచ్చును. అది పొరపాటే అవుతుంది. పిఠాపురం ఇటువంటి పాటలు పాడబూనడంకూడా పొరపాటే అని కొందరు, వారి అభిమానులే అంటారు. ఆలోచించిచూస్తే నిజమేననిపిస్తుంది. వారు పదేళ్ళక్రిందట పాడిన పాటలు "ప్రభో మరల పలుకవేలా", "కలిమికొరకు పడజాలని వెతపడి అన్యుల కొనియాడకురా", "పాపపుణ్యములు రెండేరా, నినుబాయక వెంటాడేవి" విన్నవారెవరైనా ఈనాటికైనా మరచిపోయారా? "వినవే చెలి" పదినెలల తరువాత ఎవరైనా గుర్తుంచుకుంటారా! అసలు పై పాటలతో సరిపోలిస్తే, సంగీత సాహిత్య గానాలలో ఇదీ ఒక పాటేనా అను ప్రశ్న వస్తుంది. ఈ పాటకు ఎ. వేణుగోపాల్ వ్రాసిన మాటలు అంతంతమాత్రంగానే ఉన్నాయి. పై రికార్డు నంబరు ఎన్. 96217.

బస్వేశ్వర్, ఎస్. సరళ పాడిన "ఆకాశవీధిలో" అన్నది, ఆధునిక ప్రేమగీతమట (అలా అని రికార్డుపై వేయకపోతే వినేవారికి తెలియదేమో అభియం కాబోలు) రికార్డు వచ్చింది. అనుకుంటే ములుకుట్ల ఎంత నైపుణ్యంతో కలాన్ని నడపగలరో ఈపాట సాహిత్యం నిరూపిస్తున్నది. కాని, లాభమేమిటి! దీనికి పురుషోత్తం కూర్చిన వరస ఫక్తు అనుకరణ కాకపోయినా "మేఘమాల"ను దృష్టిలో ఉంచుకొని చేసినట్లు ఉంది. బస్వేశ్వర్ కంఠం కిషోర్‌కుమార్ పాటల తర్జుమాలకు ఫరవాలేదు. కాని, వీరిగాత్రంలోగాని, సరళకంఠంతోగాని "మేఘమాల"వంటి బరువైన పాట పాడటానికి అనువైన నిండుతనంలేదు. రాజేశ్వరరావు "మేఘమాల"లో వినిపించిన దరువులు, గతులు వినిపించాలని అయిదారు వాద్యాలతో సంగీత దర్శకులు పురుషోత్తం చేసిన వ్యర్థప్రయత్నం వింటుంటే హాస్యాస్పదంగాఉంది.

ఈ పాటకు మరొకప్రక్క విశ్వనాథన్ — రామ్మూర్తి కృతికి అనుకరణ. "ప్రాయశ్చిత్తం" లోని "మధురప్రేమ" ఇంతకు వేయిరెట్లు నయం. అంటే దానిని వ్రాసినది అనిసెట్టి, పాడినది ఘంటసాల. దీనికి వడ్డాది సాహిత్యం, ఎవరో ఎస్. పాపారావుదట, గాత్రం. వినాలనివుంటే, వినాలనుకుంటే మీకు బాగా తెలిసిన డీలర్ (విని కొనకపోయినా, ముఖం చిట్లించనివాడని పాఠాంతరం) దగ్గర వినండి. నంబరు ఎన్. 96212.

మరొక రెండు విశ్వనాధన్ రామ్మూర్తి పాటలను అనుకరించిన పాటలు రాణిపాడిన "హాయి చల్లని వెన్నెల్లో" రాణి, రవిప్రసాద్‌పాడిన "నాలోని ఆశలన్ని, నీకోసమేనోయి" అనే యుగళగీతం. దీని నంబరు ఎన్. 96216. రాణి పాడినపాట వింటుంటే నిజంగా వేగావతీతీరంలో ఇసుకతిన్నెలపై వెన్నెల విహారం చేస్తున్నట్లే అనిపించింది. చరణాలు పాడుతూ "చల్లని" వదిలేసి, "హాయి వెన్నెల్లో" అని యెత్తుకోడంలో ఎంత హాయి ఉందని! ప్రవహిస్తున్న నదిలోని అలలకు మిలమిలలు నేర్పుతున్న చంద్రకిరణాలంత. వేణుగోపాల్ సాహిత్యం కొంత జానపద ఫక్కీలో నడిచింది.

యుగళగీతంలో పాడిన రవిప్రసాద్‌ది ఒక క్రొత్త కంఠం. ఇంతకుముందు కన్నడ "శ్రీశైల మహాత్మ్యం"లో సంగీతదర్శకులు టి. ఎ. కల్యాణం ఆధ్వర్యాన నారదునిపాట అపూర్వమైన హిందుస్థానీ సంగతులు వేసి పాడారు. వీరి కంఠంలో ఇదమిద్ధమని చెప్పటానికి వీలులేని ఒక ఆకర్షణశక్తి ఉంది. ఇక రాణిసంగతి చెప్పనే అవసరంలేదు. ఎండవేళల్లో వచ్చరెక్కలుచూపే లావణ్యలాఘవం వీరి కంఠంలో తొణికిసలాడుతున్నది. వీ రిద్దరి గాత్రాల కలయిక పాల్, మురిపాల వెన్నెలమల్లె, మరుమల్లెజోల.

★




## ప్రపంచ ప్రముఖులు — 7

[వార్తలకు కారకులు వ్యక్తులు. వ్యక్తులను వ్యాఖ్యానిస్తే వార్తలను వ్యాఖ్యానించినట్లే. 'ప్రపంచ ప్రముఖులు' శీర్షిక ఒకవిధంగా అంతర్జాతీయ రాజకీయాల సమీక్ష అవుతుంది.]

ఒక మేధావి రాజకీయాలలో పెద్ద పదవి ఆక్రమించటం విశేషమే. సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి తత్వవేత్త భారతదేశానికి రాష్ట్రపతి అవటం మరింత విశేషం. తత్వవేత్తలు రాజులు అవాలన్న ప్లేటో సిద్ధాంతం నేటికి ఫలించినట్లు వార్తాపత్రికలలో వ్రాశారు.

మేధావులు రాజకీయ నాయకులుగా రాణిస్తారా? అన్న ప్రశ్న అటుంచి, మన రాష్ట్రపతి అధికారం యొక్క పరిమితులు ఏవి? అన్న ప్రశ్న పరిశీలించవచ్చు. ఇటీవల ఈ విషయంపైన తీవ్రమైన చర్చ కొంత జరిగింది. రాష్ట్రపతి అధికారం ఇంచుమించు బ్రిటిష్ రాజు (లేక రాణి) అధికారంతో పోల్చదగిందని ప్రధానమంత్రి నెహ్రూ తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

పదవిని ఆక్రమించే వ్యక్తినిబట్టి అభిప్రాయాలు మారవచ్చు. కాని ఆధునిక యుగంలో భారతీయ తాత్విక సంప్రదాయాలను పాశ్చాత్యలోకానికి పరిచయం చేసిన వారిలో అగ్రగణ్యుడైన శ్రీ రాధాకృష్ణన్ నిశ్చయంగా ఈ పదవికి అలంకరణవంటివారే.

★

# హాయివాతా ప్రణయగాథ

మూలం: లాంగ్ ఫెలో

అనుసరణ: పి. గణపతిశాస్త్రి



### జరిగిన కథ

జాబిల్లి చిన్నారి భార్య నోకోమిస్ ముద్దులకూతురు వినోనా. పడమటిగాలి అనే తుంటరివాడు ఆమెను మోసగించి మటుమాయమవుతాడు. వినోనా హాయవాతాను కని దిగులుతో మరణిస్తుంది. నోకోమిస్ మనుమణ్ణి చేరదీస్తుంది. హాయవాతా క్రమక్రమంగా పెరిగి పెద్దవాడయి ఎందరెందరో వీరులను ఓడిస్తాడు.

అంత పరాక్రమశాలి అయినా తన తల్లిదండ్రు లెవరో తెలియక హాయవాతా మనోవ్యాధికి లోనవుతాడు. నోకోమిస్ జరిగిన కథ అంతా పూసగుచ్చినట్టు చెబుతుంది. హాయవాతా పడమటిగాలితో యుద్ధంచేసి ఓడిస్తాడు పడమటిగాలి వినోనాకు తాను చేసిన ద్రోహానికి పరితపించి తన రాజ్యాన్ని కొడుక్కి అప్పగిస్తాడు. హాయవాతా కొంతకాలం తండ్రిదగ్గర ఉండి అటుతరవాత నికోమిస్ భవంతికి ప్రయాణమవుతాడు. దారిలో అతనికి ఇయాగూ కనిపించి మకోరియో బాణాల సంగతి చెబుతాడు. వాటిని తెచ్చుకునేందుకు హాయవాతా దకోటా దేశానికి వెడతాడు. మకోరియో కుమార్తె మిన్నెహాహా హాయవాతాను తొలిచూపులోనే వరిస్తుంది. అతడూ ఆమెను ప్రేమిస్తాడు. హాయవాతా తన ప్రాణం కాపాడాడని తండ్రిని నమ్మించి కొంతకాలం తమ భవంతిలోనే అతడికి ఆతిథ్యం లభింపజేస్తుంది. ప్రేమ పాశంలో చిక్కుకున్నా హాయవాతా తాను వచ్చిన పని మర్చిపోడు. కావలసిందేదో కోరుకోమని మకోరియో అడిగినప్పుడు హాయవాతా బాణాలు కావాలంటాడు. ఈ సమాధానం మిన్నెహాహాకు కోపహేతువవుతుంది.

---

ఆ మరునాడుదయమే లేచి, హాయవాతా తిరిగి ఇంటికి ప్రయాణమయినాడు. మకోరియోదగ్గిర సవినయంగా సెలవు తీసుకొన్నాడు. కనుచూపుమేరలో ఎక్కడయినా మిన్నెహాహా కనబడుతుందేమో అని నాలుగువైపుల బాగా పరకాయించి చూశాడు. కాని ఎక్కడ ఆమె అడుగులజాడే వినబడలేదు. 'ఇక ఈనాటితో మిన్నెహాహాఋణం తీరిపోయిందేమో' అని ఉసూరుమని నిట్టూర్పు విడిచిపెట్టాడు హాయవాతా.

అయినా నోకోమిస్‌ని కలుసుకోవాలన్న తహతహతో పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఆ మరునాటి సాయంత్రానికే తనఇంటికి చేరుకున్నాడు. ఇయాగూ అల్లంత దూరంలోనే ముమ్ముందుగా అతని రాక పసికట్టి నోకోమిస్‌కి తెలియజేశాడు. ఆమె ఎంతో ఆప్యాయతతో హాయవాతా కెదురుగా వెళ్లి గాటంగా గుండెకద్దుకుని వలవలా విలపించింది:

'నాయనా! నువ్వు మళ్లీ నాకంట పడతావనుకోలేదు సుమా! ఇయాగూ నీ సాహస కృత్యాలన్నీ కళ్లకి కట్టినట్టు వర్ణించి చెప్పాడు. చాలా సంతోషించాను. కాని ఏం

—49 పేజీ చూడండి




## స్నేహం

స్నేహితుడు ఆత్మబంధువు కంటె మిన్నని చెబుతున్నారు పెద్దలు. శ్రీమతి ఎస్. రంగారాణి గారు ఎంతో అనుభవమున్నట్లు స్నేహరూపక పుష్పం ఎల్లకాలములందు ఆనందసౌందర్యాలతో వికసించునని వచించారు. ఎంత చక్కటి పోలిక!

వ్యాసంలో "పయోముఖ విషకుంభంలా త్యజించాలని" వ్రాశారు. ఈ వాక్యం ఎంతో ఆకర్షించింది నన్ను. "స్నేహం" విషయమున గల యదార్థతను వక్కాణించినందుకు వారికి నా హృదయపూర్వక అభివందనములు.

ఈ వ్యాసం చదివినను వారల మనో ప్రవృత్తులు మారవని తలంతును.

కాకుమాను కామేశ్వరమ్మ (పాలవ్రరు)

* * *

ఎస్. రంగారాణిగారి స్నేహం వ్యాసం చదివాక ఈ క్రింది అంశాలను వారు సరిగా చేర్చలేదేమో నని అనుమానం కలిగినది.

1. ఏ ఇద్దరు మానవులుకూడా నిజంగా ఏ ఒక్క అంశంమీద కూడ పరిపూర్ణ ఏకాభిప్రాయం కలిగివుండరు. అయినప్పటికీ ఒకరిక్షేమం ఒకరు లేక ఒకరి పురోభివృద్ధి ఒకరు కోరుకున్నంతకాలమూ వారు స్నేహితులే. అని గాంధిగారి అభిప్రాయ మనుకుంటాను. 2. బాంధవ్యము అంతటితో ఆగదు. నిజమైన బాంధవ్యమునకు లక్షణము ఒకరి తప్పులు ఒకరు క్షమించుకొనుటయే అని శంకరాచార్యుల అభిప్రాయము. అయితే అట్టి బంధువులు బహు కొద్ది. అందరికీ బంధువు లన దగిన తల్లి, దైవము, కూడ ఈ కాలములో అచ్చటచ్చట విపరీతముగనే ఉన్నట్లు తోచుచున్నది. ఉత్త రక్తసంబంధము బాంధవ్యము కాదు.

శం. మాణిక్యాంబ (బొంబాయి)

* * *

బంధువులకన్న స్నేహితులు చాలా ఆత్మీయులు. చెరువు నిండుగా ఉన్నప్పుడు కప్పలు చేరినట్లు బంధువులు సంపద ఉంటేనే చేరుతారు.

పి. పెద్దపాప (నారాయణపురంమెట్ట)

* * *

చెడి చెల్లెలింటికి వెళ్ళేకంటే స్నేహితునింటికి వెళ్తే మంచిదని అని సామెతే ఉన్నది. బంధువులు చాలామంది అనుమానపడ్తారు. మాకు కూడ ఎక్కడకు వెళ్ళినా స్నేహితు లౌతారు. ఇప్పటికీ ఉత్తరాలు వ్రాసుకుంటూనే ఉంటాం. మద్రాసులో మా స్నేహితులు, నేనూ ఫోటోలుకూడ తీయించుకున్నాం. నేను స్కూల్లో చదువుతుండగా నాకొక స్నేహితురాలు ఉండేది. అమేనా ప్రాణస్నేహితురాలు. వాళ్ళింటికి రమ్మని ఎన్ని ఉత్తరాలైనా వ్రాస్తుంది. నిజంగా నిర్మలమైనది నిజమైన స్నేహమేనుమండీ.

ఎన్. నారాయణమ్మ (పాండు)

* * *

స్నేహం ఉన్నతమైనది. ఈర్ష్యాసూయలకు రాగద్వేషాలకూ తావులేదు. స్నేహానికి కులమత భేదములు ఆర్థిక వ్యత్యాసములు అడ్డురావు. భావాలు ఏకమైతే పరస్పరం స్నేహితులగుట సహజము, సులభము అన్న మీ భావాలతో నే నేకీభవిస్తున్నాను.

ఎం. అన్నపూర్ణ (పార్వతీపురం)

* * *

రంగారాణిగారు రచించిన 'స్నేహం' అన్న వ్యాసం చక్కగానున్నది. ఆమెకు బంధువులతో అట్టే పరిచయముగాని, అలవాటుగాని ఉన్నట్లు కనబడదు. ఎప్పుడూ స్నేహితులతోటే సన్నిహితంగా ఉన్నట్లు తెలుస్తూఉంది. కాని, బంధువులలోకూడా అటువంటి ఆప్యాయత, ఆదరణ లభించుతూవుంటాయి కొన్ని సందర్భాలలో. నేను క్రొత్తగా హైద్రాబాదు ఉద్యోగరీత్యా వచ్చాను. ఇక్కడంతా క్రొత్త. కాని మా బంధువులు నన్ను చాలా ఆదరించి, బాగా అలవాటైనవరకు వాళ్ళ ఇంట్లోనే ఉండమన్నారు. కాబట్టి బంధువులైనా, స్నేహితులైనా మన ప్రవర్తనలోకూడా ఉంటుందని తలుస్తాను.

ఎస్. రమ (హైద్రాబాద్)

* * *

నిజమైన స్నేహితులు లభించాలంటే మన మనస్సులుకూడ నిర్మలంగా ఉండాలి. స్నేహితుల మధ్య ఎటువంటి మనస్పర్థలు రాకుండా ఒకరి లోటును ఇంకొకరు సర్దుకుంటూవుంటే స్నేహం చిరకాలము వర్ధిల్లుతుందని నా ఆశ. నిజంగా స్నేహం వ్యాసం చదివాక, మనస్సుకు చాల సంతోషమైంది. కాని స్త్రీ పురుషులు స్నేహంగావుంటే ఆ స్నేహానికి లేని అపవాదులుకట్టి వారిని అల్లరిపెట్టి తాము ఆనందించేవారు ఈ రోజుల్లో ఎక్కువగా ఉన్నారు. అటువంటివారి బారినుండి తప్పించుకుంటూ, తమ పవిత్రమైన స్నేహాన్ని కాపాడుకుని, స్నేహానికి ప్రాణం ఇచ్చేటట్లుగా ఉండాలి. ఇట్టి వ్యాసము వ్రాసిన రంగారాణిగారికి నా అభినందనలు.

శ్రీమతి పరిమి సీతాతిలకం (వాల్తేరు)

* * *

నేనుకూడ బాంధవ్యంకంటే స్నేహానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాను.

కుమారి బోడపాటి వనజ (అనకాపల్లి)

* * *

రచయిత్రి అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మా నాన్నగారు ఒరిస్సాలో పదంపూర్ అను గ్రామంలో డాక్టరుగా ఉన్నప్పుడు మా చెల్లెల్ని స్నేహితురాలు రంగారాణి జ్ఞాపకం వచ్చి ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోయాను.

డి. సూర్యకాంతం (న్యూఢిల్లీ)

* * *

రచయిత్రి గారన్నట్లు సుఖ, దుఃఖాలలో ఆదుకొనేవారే నిజమైన స్నేహితులు. క్రొత్తచోట్లలో కూడా "మన నోరు మంచిదైతే-ఊరు మంచిదౌతుందనే" సామెత చొప్పున కావలసినంతమంది స్నేహితులు. చెత్త వ్యాసాలు వ్రాయక ఇలా వనితలకు ఉపయోగించే వ్యాసాలురాస్తే చదివేవారికి బాగుంటుంది. అల్లుళ్ళ అలుకలు, కోడళ్ళ అలుకలు అని ఏవో వ్యాసాలురాస్తే ఏమీ ప్రయోజనం లేదు—అనేకరకాల విమర్శలకు గురికావడంతప్ప. అలాంటివారు, ఇలాంటి వ్యాసాలతో మారుతారంటే నాకేమాత్రం నమ్మకంలేదు సుమండీ!

బి. శకుంతలాదేవి (కల్యాణదుర్గం)

* * *

మా నాన్నగారి ఉద్యోగరీత్యా మేము ఒరిస్సావచ్చి నాలుగు సంవత్సరములు అయినది. వ్యాసంలో వ్రాసినట్లుగా మమ్మల్ని ఒక ఇంటివారు చాల ఆదరించి సామగ్రి మొదలైనవి సదుపాయములు సమకూర్చారు. ఇలాంటివాళ్ళ ఆదరణ మరువలేము. మొదట్లో ఒరియాభాష క్రొత్తఅయినా, క్రమేపి వాళ్ళతోనే స్నేహం లభించినది.

ఇ. ప్రతిమకుమారి (కటక్)

* * *

## యువతుల సమస్యలు

ఇటువంటి చిక్కులు చదువుకొన్నవారికే గాదు, ప్రతి యువతీ ఎదుర్కోవలసి వస్తుంది. తమ

కూతురు మెట్రిక్ ప్యాస్ అయ్యింది. ఉద్యోగము చేస్తున్నది గనుక వరుడుకూడ చదువుకున్న వాడే కావలెనని తల్లిదండ్రుల కోరిక. చదువుకున్న వరుడు కావాలంటే మరి కట్నాలు తప్పవు. చదువుకున్న వరుడు ఊరికే లభించడు. చదువు లేని వరుడు భయపడి వివాహ మాడడు. గనుక ఈ కాలములో కట్నాలు లేనిది చదువుకున్నవారికి వివాహము జరుగుట అరుదు. కాని కొంతమంది చదువుకున్నవారు కట్నాలు లేకుండ వివాహము చేయదలుచుకున్నా కుటుంబములో ప్రతి ఒక్కరిని ఎదుర్కోవలసి వస్తుంది.

చాంద్‌బీబీ (చిలకలూరిపేట)

*　*　*

చిత్రగారు "యువతుల సమస్య" అను వారన్నట్టుగా అన్ని కోణాలనుండి చిత్రించలేకపోయారేమో అనిపిస్తుంది. ఏ యువతిఅయినా పెళ్లాడాలనీ, గృహిణికావాలనీ కోరుకుంటుంది. కాని ఆర్థిక పరిస్థితుల మూలంగా ఆకోరిక నెరవేరక పోవచ్చును. అందుచేత ఆమె జీవితాంతంవరకు అవివాహితగా ఉండి, సంఘంలో వ్రేలెత్తి చూపించుకోవలసిన గతి పడుతుంది. ఈవిధంగా ఎన్నో జీవితాలు బలి అయ్యాయి. కాబట్టి యువతులే ముందంజవేసి వారి జీవితాన్ని వారు చక్కదిద్దుకుంటే చాలా బాగుంటుంది. పురుషులతో సమానహక్కులు సంపాదించిన స్త్రీలకు, యువతులకు ఇది పెద్ద సమస్య కాదేమో!

వీరవల్లి సుశీల (వీరవాసరం)

*　*　*

నేటి లోకంలో యువతులు ఎదుర్కొనే సమస్య లను సవిస్తరంగా అభివర్ణించారు.

కలకొండ ఉషారాణి (ఒంగోలు)

*　*　*

# వంటలు

## కాంచీపురం ఇడ్లీ

### కావలసిన వస్తువులు

| | | | |
|---|---|---|---|
| ఉప్పుడుబియ్యం | - | 1 | అళాకు |
| మినపపప్పు | - | ½ | అళాకు |
| పెరుగు | - | ¼ | కప్పు |
| నెయ్యి | - | 2 | చెంచాలు |
| ఉప్పు | - | 1 | చెంచా |
| మెంతులు | - | ½ | చెంచా |
| జీలకర్ర | - | ½ | చెంచా |
| మిరియాలు | - | ½ | చెంచా |
| కర్వేపాకు | - | | కొద్దిగా |
| అల్లం | - | | కాస్తంత |

ఉప్పుడు బియ్యం, మినపపప్పు కలిపి రవ్వగా విసురుకోవాలి. మిరియాలు, మెంతులు విడిగా నూరుకోవాలి. అన్నివస్తువులు గుచ్చెత్తి నీరుపోసి గరిటజారుగా కాకుండా కాస్త గట్టిగా పిండి కలుపుకోవాలి. ఆతరువాత ఇడ్లీ పాత్రలోనో, వెడల్పాటి గిన్నెలోనో ఈ పిండివేసి, ఇడ్లీ వండినట్లు వండాలి. ★

ఇదీవరస　　　　సుందర్





ఏడేళ్లప్పుడు

# వెండితెర వెలుగు 'శారద'

అర్ధరాత్రి దాటుతున్నది .... పక్కమీద పడుకున్న శారదకు నిద్రరావటంలేదు.... ఎటునుంచి ఎటుదొర్లినా ఒకలాగే వున్నది. నెమ్మదిగాలేచి వెళ్లి, కడుపునిండా నీళ్లు తాగింది. ఆ నీళ్లు ఉప్పగావున్నట్టు తోచినై— మంచి నీళ్లయినా. అందరూ నిద్రపోతున్నారు. తనకుమాత్రం నిద్ర రావటంలేదు. తనమనస్సు చాలా గాయపడి ఉన్నది.... హృదయం బరువుగావున్నది.... శారద ఆరుబయటకు వెళ్లి కాస్సేపు కూచుంది. దూరంగా ఎక్కడో కుక్క అరచిన అరుపుతప్ప, వేరే శబ్దం లేదు. ఆకాశంలో చంద్రుడూ, తనూ ఇద్దరే— నిద్రపోవనివాళ్లుగా ఆమెకు అనిపించింది. ఐతే చంద్రుడు నిద్రపోడు; తనకు నిద్రరాదు.... ఆమె జరిగినవిషయాన్ని ఒక్కసారి నెమరు వేసుకుంది—

ఒక చిత్రదర్శకుడు, సినిమాలో వేషం ఇస్తానని శారదను వెంటనే రమ్మని ఉత్తరం రాశాడు. రావలసింది తెనాలినుంచే ఐనా, ఆమె వెంటనే బయల్దేరి రాలేకపోయింది. ఉన్నంతలో 'తొందరగానే' మద్రాసు చేరుకుంది. ఆ దర్శకుని కలుసుకుంది. ఐతే ఆమె అదృష్టం అడ్డంతిరిగింది. "లేదమ్మా— నువు ఆలస్యంగా వచ్చావు. ఆవేషాన్ని ఇంకోఅమ్మాయికి ఇచ్చేశాను. నువ్వేం అనుకోకు. వీలైతే...." అంతే! ఆతర్వాత జరిగిన ఆయన సంభాషణ శారదకు తెలియదు. ఎన్నో ఆశలు పెట్టుకుని, ఉన్నంతలో హడావిడిగా మద్రాసుచేరుకున్న ఆమెకు, ఒక్కసారి ప్రపంచం చీకటయిపోయింది. శారద చరచరా వెళ్లిపోయింది— పొంగిపోతున్న దుఃఖాన్ని అణచుకుంటూ! ఇంటికివెళ్లి పక్కమీద పడేవేళకల్లా— కళ్లవెంబడి నీళ్లు జలజలా వచ్చేసినై! విధికి తను చేసిన అపకారం యేమిటి? ఆ ఊర్నుంచి ఎందుకని రప్పించింది! తాను సినిమాలో నటించేందుకు వెళ్తున్నానని అక్కడ చాలామందితో చెప్పిందే— ఇప్పు డేంచెయ్యాలి? తన ఆశలన్నీ గాలిమేడలలాగా కూలిపోవలసిందేనా?.... చదువుకు కూడా స్వస్తిచెప్పేసింది .... ఆ ఊరికి 'గుడ్‌బై' కొట్టేసింది.... ఇప్పుడింక తనకర్తవ్యం?.... ఇక్కడుండి ఏంచెయ్యాలి?.... లేకపోతే తిరిగి వెనక్కు పోవటం ఎట్లా?....

ఇట్లా సతమత మవటంలో ఆమెతల వేడెక్కింది· ముందుదారి కనిపించదు...."ఏంచెయ్యాలి? ఏంచెయ్యాలి?" అనుకున్న దామె గట్టిగా.

"ఏం చేస్తావు? ఎట్లాగూ వచ్చేశావుగదూ— ఇక్కడే ఉండు. ఎప్పటికయినా వేషంవస్తుందేమో" అని వినిపించింది ఆమెకు. ఛట్టున ఆమె తిరిగి చూసింది. అది శారద ప్రతిరూపం.

"నేను ఉండను. ఉండి ఏం బావుకోను?" అన్నది శారద.

"వెళ్లి ఏం బావుకుంటావు?" అని అడిగింది ప్రతిరూపం.

శారద సమాధానం చెప్పలేదు. ప్రతిరూపమే మళ్లీ అన్నది—

"నువు అనవసరంగా బాధపడకు. మానవ జీవితాల్లో ఒడిదుడుకులు రావటం సహజం. ఆ ఒడుదుడుకులను తట్టుకోవటమే అతని కర్తవ్యం! నిరాశలూ, నిస్పృహలూ ఎప్పుడూ తప్పవు. అంత మాత్రాన అధైర్యపడిపోయి, దిగులుచెంది, కలత పడటం భావ్యంకాదు. నిరాశలోనే ఆశవున్నది. ఆ ఆశతోనే ఎప్పుడూ జీవించాలి. ధైర్యం తెచ్చుకో — లేచి, వెళ్లిపడుకో! బాగా ప్రయత్నంచెయ్యి— ప్రయత్నిస్తే సాధించలేనిది ఏదీలేదు.... ఎన్ని ఆటంకాలువచ్చినా ప్రయత్నంమాత్రం మానకు. లే!" అన్నది ప్రతిరూపం.

శారద లేచింది. కళ్లు తుడుచుకున్నది. ధైర్యం తెచ్చుకున్నది. "ఇక్కడే ఉండి సాధిస్తాను" అనుకున్నది— చరచరా వెళ్లి పక్కమీదపడి హాయిగా నిద్రపోయింది!

* * *

1945వ సంవత్సరం జూన్‌మాసం 12వ తేదీన తెనాలిలో పుట్టింది శారద· ఆమెతండ్రి గారు వెంకటేశ్వరరావుగారు ఏనాడూ నాటకాల్లో పాల్గొనలేదు. ఐతే ఆయనకు కళపట్ల విశేషమైన అభిమానం. ఆ అభిమానమే శారదకు ఆమె ఐదవ ఏటనే భరతనాట్యం చెప్పించింది. పదవఏటి వరకూ శారద ఈ భరతనాట్యాన్ని అభ్యసిస్తూ, ముఖకవళికలను మార్చటమూ, వివిధ భంగిమలూ, భావప్రకటన మొదలైన నటన సూత్రాలన్నీ అలవాటుచేసుకున్నది. ఉద్యోగంనిమిత్తం వాళ్ల నాన్నగారు బర్మా వెళ్లారు. కుటుంబం అంతా అక్కడికి వెళ్లింది. ఐనా శారద, రోజూ ఇంట్లో తనకుతానే నాట్యకళారాధన చేసుకునేది.

కొంతకాలం తర్వాత బర్మానుంచి తెనాలి వచ్చేశాక శారదజీవితంలో కొత్తశకం ప్రారంభమైంది. మూడవఫారం చదువుకుంటూ ఉండగా ఆమెకు ఒకనాటకంలో నటించే 'ఛాన్సు' తగిలింది. అది చిన్ననాటిక! తెనాలిలోనే ఏదో సందర్భంలో వెయ్యాల్సివచ్చింది. ఆ నాటికఅయితర్వాత, శారదను

నటీమణుల జాబితాలో చేర్చేశారు ఆ ఊరివాళ్లు. ఐతే అప్పటికి ఆమెక పన్నెండు ఏళ్లే!

రానురాను శారదకు నాటకాల్లో నటించాలనే ఆసక్తి కలిగింది. ఆ ఆసక్తితో ఆమె చాలా పాఠాలు చదువుకున్నది. స్టేజిమీద రకరకాల పాత్రలను వీలైనప్పుడల్లా నటించింది. పన్నెండవఏట ఆరంభమైన ఆమె ఉత్సాహం పదిహేనవఏటిదాకా బాగానే సాగింది. ఈ మూడేళ్లలోనూ ఆమె ఆప్రాంతాల చాలా నాటకాల్లో నటించి, రాణించింది. పదిమందిలోనూ 'నటి' గా ఆమె పేరు వినిపించేది.

లలితకళలు చాలామందికి పుట్టుకతో వస్తాయి; వంశంలో ఉన్నవారిలో ఎక్కడినుంచో వస్తాయి కొంతమందికి; ఇట్లాగా, అట్లాగా రాకపోయినా— ఉత్సాహంఉన్నవారికి కష్టపడి నేర్చుకోగా వస్తాయి. ఈ కోవకు చెందిన అమ్మాయి శారద. నాటకరంగంమీద నటిస్తున్నా — చదువు మాత్రం ఎప్పుడూ ఆమె మానలేదు. మూడవఫారం చదువుకుంటున్న రోజుల్లోనే — ఒక చిత్ర దర్శకుడు ఆమెను చూశాడు. తాను తీయబోయే చిత్రంలో ఆమెకు పనికివచ్చేపాత్ర ఒకటున్నదనీ, తాను ఉత్తరం రాస్తాననీ, రాగానే వెంటనే బయల్దేరి రావలసి ఉంటుందనీ చెప్పాడు. ఈ 'ఛాన్సు' కు శారద మురిసిపోయింది. తనజీవితం నటిగా ప్రకాశించబోతున్నది—అందులోనూ సినిమానటిగా! ఆమెసంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఆనాటి నుంచీ, ఆమె ఆ ఉత్తరం కోసం ఎదురుచూస్తూనే కూచున్నది. చాలాకాలంవరకూ రాకపోగా కాస్త నిరాశ చెందింది. ఇప్పట్లో తన కా అవకాశం లేదనుకున్నది. తర్వాత మళ్లీ మామూలుగా తన చదువూ, నాటకాలూ—వీటిల్లో పడింది.

ఒకనాడు అకస్మాత్తుగా ఉత్తరం వచ్చింది— దర్శకుని దగ్గరనుంచి — 'వెంటనే బయలుదేరి రమ్మని'! ఈ ఉత్తరం కాస్త కలవరపాటును కలగజేసింది. ఎంచేతంటే, ఉన్నపళాన మద్రాసు వెళ్లాలంటే ఎట్లా ? వాళ్ల నాన్నగారు ఊళ్లోలేరు. ఆయనతో చెప్పకుండా, అమ్మగారిని తీసుకుని ఎట్లా బయలుదేరుతుంది ? నాలుగు విషయాలూ చూసుకోవాలి—తన చదువు—ఇక్కడి సంసారం— ఇక్కడినుంచి మకాం మార్చాలంటే, సంసారం అంతా ఒక్కసారి మార్చాల్సిందే ! ఏం చెయ్యడానికీ ఆమెకుగాని, ఆమెతల్లికిగానీ పాలుపోలేదు ! నాలుగు రోజులనాడు, వాళ్ల నాన్నగారు రాగానే విషయాలన్నీ మాట్లాడుకున్నారు—సంసారం అంతా మార్చాలనుకున్నారు — అందరూ కలిసే మదరాసు బయల్దేరాలని నిశ్చయించుకున్నారు. తాను సినిమాల్లో నటించటానికని మద్రాసు వెళ్తున్నానని శారద తన స్నేహితురాళ్లందరితోనూ చెప్పింది— అందరూ సంతోషించారు. ఊళ్లోవాళ్లంతా మురిసిపోయారు. "శే ప్పిద్దన్న పెద్దతారవైపోతే, మమ్మల్ని పలకరిస్తావా" అని కొందరు హాస్యం కూడా ఆడారు.

1959 వ సంవత్సరంలో, తన మూడో ఫారం చదువుకు స్వస్తిచెప్పి — 15 వ ఏట ఆచిత్రంలో నటించేందుకని శారద మద్రాసు చేరుకున్నది. చేరుకున్ననాటిరాత్రి ఆమె పడిన ఆవేదనే అది ! ......

* * *

ఇతర దర్శకులనూ, నిర్మాతలనూ కలుసుకో సాగింది శారద. ఐతే ఆలోపలే — ఆమెకు మంచి నాటకం ఛాన్సు తగిలింది. నాగభూషణం నాటకం 'రక్తకన్నీరు' లో ఆమె పాల్గొన్నది. ఆ నాటకంలో, అట్లా ఆమె 120 ప్రదర్శనాలదాకా పాల్గొన్నది.

ఏమూల పారేసినా, రత్నం ప్రకాశించక తప్పదన్నట్టు—నటనలోని ఆమె శక్తిసామర్థ్యాలను



"ఇద్దరు మిత్రులు"లో నాగేశ్వరరావు, సరోజలతో శారద.

దర్శకుడు ప్రసాద్‌గారు కనిపెట్టారు. తాను తీయబోయే తెలుగుచిత్రంలో కొత్తవారిని ప్రవేశపెట్టా లనుకొంటున్నానని, ఆమెను ప్రసాద్‌గారు 'పెర్మనెంటు ఆర్టిస్టు' గా బుక్‌చేసి, నెల జీతం ఇవ్వసాగారు. ఆ కంపెనీలో ఆమె, నటననుగూర్చి ఇంకా చాలా నేర్చుకున్నది. పాత్రపోషణా, సంభాషణలు పలకటంలో మెళుకువలూ వంటి చాలా విషయాలు అక్కడ ఆమెకు అబ్బినై. ప్రసాద్‌గారి ప్రొడక్షన్స్‌లో జేరటంద్వారా, ఆమె నాటకాలకు స్వస్తిచెప్పాల్సి వచ్చింది. ఎంచేతంటే, ఇక్కడ పనిచేస్తూ ఊరూరా తిరగటం అసాధ్యం! ఐతే అడపా దడపా మద్రాసు నాటకాల్లో మాత్రం పాల్గొనేది.

ప్రసాద్‌గారు కారణాంతరాలవల్ల అప్పుడు అనుకున్నట్టు తెలుగు చిత్రం తియ్యలేదు. తొమ్మిది నెలలపాటు శారద అక్కడ జీతం తీసుకున్నది. ఆలోపలే ప్రసాద్‌గారు ఆమెను అన్నపూర్ణా మధుసూదనరావుగారితో పరిచయంచేశారు. తన చిత్రంలో వేషం ఉండవచ్చునని అన్నారు మధుసూదనరావుగారు.

ప్రసాద్‌గారి సంస్థలో పనిచెయ్యటంవల్ల శారదకు చాలా మేలు కలిగింది. అక్కడ ఉన్నదని శారదపేరు చాలామంది నిర్మాతలకూ, దర్శకులకూ తెలిసింది. ఆ సంస్థనుంచి బయటకు రాగానే మధుసూదనరావుగారు శారదను 'ఇద్దరు మిత్రులు'లో మీనాపాత్రకు బుక్‌చేశారు. అప్పుడే ఆమె 'తండ్రులూ కొడుకూలూ' చిత్రంలోనూ బుక్ ఐంది. ఈ చిత్రంలో ఆమె 'వాణి' గా నటించింది.

అప్పుడే ఆమె సాధనావారి 'తోబుట్టువులు' లో రుక్మిణిపాత్రకు బుక్ ఐంది. ఆమె ముందుగా 'బుక్' ఐన చిత్రం 'ఇద్దరు మిత్రులే' ఐనా, ముందు విడుదలైన చిత్రం 'తండ్రులూ కొడుకులూ.' ఈ చిత్రంతోనే ఆమెకు మంచిపేరు వచ్చింది—తర్వాత 'ఇద్దరు మిత్రులు' చిత్రంతో 'శారద' పేరు అందరినోటా వినిపించసాగింది !

ప్రస్తుతం ఆమె ఆర్. ఆర్. పిక్చర్స్‌వారి సాంఘిక చిత్రంలోనూ, సారధివారి 'ఆత్మబంధువు' లోనూ, జూపిటర్ వారి 'వాల్మీకి' లోనూ నటిస్తున్నది.

శారదకు నాటకాల్లో నటించటం చాలా సరదా ! ఇష్టం ! ముమ్ముందు తాను ఎంత తీరికలేని తారను ఐనా, అవకాశం వచ్చినప్పుడల్లా నాటకాల్లో నటిస్తానని ఆమె అన్నది. తీరిక వేళల్లో ఆమె, కథలూ, పుస్తకాలూ చదువుకుంటుంది. వాటిమీద ఆమెకు ఎనలేని అభిమానం ! ఆమె భరతనాట్యం నేర్చుకుంటున్నది, హిందీ నేర్చుకుంటున్నది. తమిళం వ్రాయటమూ చదవటమూ బాగా వచ్చును. ఒక తమిళ చిత్రంలో ఆమె నటించబోతున్నది కూడా !

"నా జీవితంలో మరపురాని సంఘటనలు రెండు

52-ఎ పేజీ చూడండి

---

**'చిత్రవ్యక్తులు' శీర్షిక క్రింద ఇది మొదటి వ్యాసం. ఇకమీదట శ్రీ సుకుమార్ క్రమంగా ఇలాంటి వ్యాసాలు వ్రాసి నూతన నటీనటులను పరిచయం చేస్తారు.**

# చదువుల్రావు


ఏమోయ్ చదువుల్రావ్ కులాసాగా ఉంటున్నావా?.. ఫస్ట్‌క్లాస్‌లో పాసవయ్యావుటగా
ఏం పాసవడం లెద్దురూ! ఎవరూ నమ్మటంలేదు కూడాను —
సరేలే. ఈ మధ్య మీ మామయ్య హాస్పిటల్లో ఉన్నాట్ట... ఏం?
మొన్న కారు ప్రమాదంలో కాలు విరిగి నెల్లాళ్ళు హాస్పిటల్లో ఉన్నాడండి. డాక్టరు గారు ఈయన మూడు నెలలలో నడిచేలా చేస్తానన్నారు అన్నట్టుగా చేశారు కూడాను...
వింతగానే ఉందిస్మీ. అన్నట్టుగా నడిచేలా ఎలా చెయ్యగలిగేడు?
ఏముందండి, ఈయన డాక్టరు బిల్లు చెల్లించాల్సి వచ్చేటప్పటికి ఈయన తన కారు కూడా అమ్మెయ్యాల్సి వచ్చిందండి
సత్యమూర్తి



## 39

"మీనాక్షి అందమైనది" ఒప్పుకుంది సూర్యం మనసు "మీనాక్షి తెలివైంది." మీనాక్షి చురుకైంది. మీనాక్షి మాటకారి. ఆమె బరువైన నడకలలో హంసల హొయలున్నది. ఆమెలోని ఆకర్షణ సూర్యానికి అంగ ప్రత్యంగంలోనూ పులకింతనూ ఆనందాన్ని ఇస్తున్నది అయితేనేం..., తన ఆత్మీయతను అదివరకే యెవరో దోచుకుపోయారు. బహుశా అదేకారణంచేత అతని హృదయంలో పెనుగులాట జరుగుతున్నది.

సూర్యం ఆలోచనలమధ్య హతాశుడై అనేక పర్యాయాలు మరోవ్యాపకం కల్పించుకుని తప్పించుకునేవాడుకాని ఈవాళ అతగాడు అలా చేయలేక పోయాడు. ఐతే మీనాక్షి గురించి ఆలోచించడానికి అతని అంతర్యంలో సంకోచమెందుకో తెలియలేదు. శంకరంగారి అమ్మాయిలగురించి ఆలోచన చెయ్యలేకపోవడానికి అటంక మెవరు? నరసమ్మగారా? మంగపతియా? ఎవరు? సమాజమా? "ఊహూం."

సూర్యానికి మానసికసుషుప్తి మెల్లిగా విడిపోసాగింది.

ఆవేళ ఉదయం ఆఫీసులో ఒక సంఘటన జరిగింది. సాంబశివంగారు తనకోసరం ఆఫీసుకి వచ్చేరట. తనకోసం లోపలికి కబురుపెట్టగా తాను ఇవతలికివచ్చేడు.

సాంబశివంగారితో ఇన్ని సంవత్సరాల పరిచయమున్నప్పటికీ ఏ ఐదారు పర్యాయాలోమాత్రం తాను మాటాడేడు. కాని ఆయనమీద తనకి సదుద్దేశ

—46 వ పేజీ చూడండి

### జరిగిన కథ

ఐదు వాటాల లోగిలియిల్లుగలావిడ నరసమ్మగారు మనుమడు సూర్యానికి తల్లీ తండ్రీతానే అయి పెంచింది. ఆ ఐదు వాటాల లోగిలిలో రకరకాల కుటుంబాలున్నాయి. రాజ్యలక్ష్మికి నరసమ్మగారంటే చనువూ, భక్తీ. సూర్యంపాపంటే పిచ్చీ, నిర్మలంటే స్నేహం. సాంబశివంగారికి గతం గాయం. సూర్యం నిర్మలకి పాఠాలు చెబుతూంటాడు. మేనమామ కూతురు మీనాక్షితో సూర్యానికి చనువు ఏర్పడుతుంది. సూతికట్టున కాలు జారిపడిన నరసమ్మగారికి నిర్మల ఉపచారం చేసి, ఆమె మెప్పు పొందుతుంది. లలితాంబ రాజ్యలక్ష్మి పీడవిరగడ చేసుకునేందుకు సావిత్రమ్మ, కృష్ణవేణమ్మలతో కలిసి ప్రయత్నం చేసుంది. తాను చేసిన తప్పు భార్యకు చెప్పే ధైర్యం లేని సాంబశివంగారు ఈ సంగతి తెలిసి క్షోభకు లోనవుతాడు. మీనాక్షిని సూర్యానికి చేసుకోమని జయరావు నరసమ్మగారికి నయానా భయానా చెప్పి చూస్తాడు.

## ఎఫ్. బి. ఐ. కథలు-5

# భూతద్దంతో హత్యాపరిశోధన

### నార్మన్ ఆబట్

అయోవా రాష్ట్రం పాడిపంటలకు ప్రసిద్ధి. ఈ రాష్ట్రం 'మాప్' చూస్తే నగరాలు అక్కడక్కడ చుక్కలు చుక్కలుగా కనిపిస్తాయి. ఈ నగరాలు కొన్ని సంవత్సరాలుగా ఒకేవిధంగా-అంటే మార్పులేకుండా!—ఉంటాయా అనిపిస్తుంది. మారిసన్ ఇటువంటి నగరాలలో ఒకటి. ఈ మారిసన్‌లో పన్నెండేళ్ళక్రితం ఇర్మాజీన్ స్టాల్‌హట్ తన రెండవ భర్తతో నివసించేది. ఆ ఊరిలోకెల్లా ఒకటే హొటల్ ఉండేది.

అసలు ఆ ప్రాంతాలలో ఇర్మాజీన్ అంటే సదభిప్రాయంలేనివారు చాలామంది ఉండేవారు. హార్వే స్టాల్‌హట్‌ని పెళ్ళిచేసుకునేముందు వాటర్‌లూ నగరంలో ఉండేది. మొదటి భర్తకు విడాకులు ఇచ్చి ఈ ఊరికి వచ్చేసింది.

ఇదంతా జరిగి రెండు సంవత్సరాలు కావచ్చాయి. ఇప్పుడు ఇర్మాజీన్‌కి ఏడాది వయస్సున్న కొడుకు ఉన్నాడు. ఇర్మాజీన్ మాత్రము బార్‌లో పనిచేస్తూనే రోజు 22-6-1949. తెల్లవారుజామున నాలుగ గంటలకు హార్వేస్టాల్‌హట్ ఒక డాక్టరుకి టెలిఫోన్ చేసి ఏమిటేమిటో చెప్పాడు. అతని మాటలు అర్థంకాక డాక్టరు వెంటనే అతని ఇంటికివచ్చి, జరిగింది తెల్సుకొని, ఆ ప్రాంతం షరిఫ్‌జాన్ మేయర్‌కు కబురుచేశాడు.

ఇర్మాజీన్ దేహం గుర్తుపట్టటానికి వీలులేనంతగా చీల్చిపారవేసి ఉంది. వస్త్రాలు ముక్కలు ముక్కలుగా



ఆ హొటల్‌కి చెందిన బార్ ఇర్మాజీన్ చూస్తూ ఉండేది.

ఈమె చాలా అందకత్తె. తన 22 వ సంవత్సరంలో ఆ హొటల్ 'బీర్' చల్లబెట్టేగదిలో రక్తసిక్తమైపోయి విరిగిన గాజుముక్కలమధ్య చనిపోయి కనిపించింది, ఒకరోజు.

ఆ గాజుముక్కల మధ్య ఒక చిన్న ఆధారము దొరికింది. కాని ఇది కేవలం అదృష్టవశాత్తు దొరికిందనే చెప్పాలి. దీని సహాయంతోనే ఇర్మాజీన్ హంతకుడిని పట్టుకొన్నారు.

ఉండేది. (ఆ లాడ్జిపేరు "హార్వేస్‌ప్లేస్") ఆమె భర్త లారీ నడిపేవాడు.

## 'విమర్శ'

కొందరికి ఇర్మాజీన్ వాలకం నచ్చలేదు. లాడ్జికి వచ్చే ఖాతాదార్లతో అతి చనువుగా ఉండేది అనేవారు; గృహిణి, తల్లి అయిన ఈమె ఆవిధంగా ప్రవర్తించరాదని వారి అభిప్రాయం.

ఈ విమర్శకులు కూడా ఆ బుధవారం ప్రొద్దున జరిగిన సంఘటనలకు దిగ్భ్రాంతులైపోయారు. ఆ రోజు

పడిపోయిఉన్నాయి. శవం బీర్ చల్లబెట్టేగదిలో దొరికింది. కాళీసీసాలు కొన్ని క్రిందపడి నేల గాజుముక్కలతో కప్పినట్లు ఉంది. ఎక్కడ చూసినా నెత్తురు. అర్థరాత్రి చనిపోయిఉంటుందని పరీక్ష చేసిన డాక్టరు చెప్పాడు.

హార్వేస్టాల్‌హట్‌ని లడావంపిన ప్రశ్నలు అడిగారు. అతను ప్రతిరోజు సాయంత్రం లారీలో డెలివరీలు ముగించుకొన్నతర్వాత ఇంటికి వచ్చేసే

45 — వ పేజీ చూడండి



# వెండిమబ్బు

కన్నడ మాతృక – త్రివేణి
అనువాదం – శర్వాణి

## జరిగిన కథ

'వెండిమబ్బు' యజమాని సదాశివరావుగారు, భార్య లలితమ్మగారి ప్రోద్బలం వల్ల తమ ఏకైక పుత్రిక ఇందిరను మోహనుడికిచ్చి వివాహం చెయ్యాలని నిశ్చయించి, పైచదువులకు అతణ్ణి అమెరికా పంపుతారు. మోహనుడు అమెరికా వెళ్ళిన కొద్ది కాలానికి లలితమ్మగారికి గిరి అనే కొడుకు కలుగుతాడు. ఇందిర ఈ సంగతి తెల్పితే మోహనుడు అంటీ ముట్టనట్లు సమాధానం వ్రాస్తాడు. మొదటే [illegible] శంకించిన లలితమ్మగారు కూతురు పెళ్ళి చూడకుండానే దిగులుతో కన్నుమూస్తారు.

(గత సంచిక తరువాయి)

మరుక్షణంలో ఇల్లు ఏడ్పులతో నిండిపోయింది.

"వెండిమబ్బు" కూలీలంతా ఇంటిముందు గుమిగూడారు. ఇరుగుపొరుగు కాఫీతోటల యజమానులు తమ సానుభూతిని వెల్లడించటానికి రావుగారిని, ఇందిరను వెతుక్కుంటూ వచ్చారు.

రావుగారికి, ఇందిరకు ఎవ్వరిసానుభూతితోనూ దుఃఖం ఆగటంలేదు. లలితమ్మగారిచావు వారికి అనుకోనిదేమీకాదు. కాని రావుగారు మతిస్థిమితాన్ని కోల్పోయారు. ఇందిర తల్లిలేని పిల్లయింది.

ఈ గొడవలో గిరిని కనుక్కునేవారే లేకపోయారు.

అతడు ఉయ్యాలలో గుక్కపట్టి ఏడుస్తున్నాడు.

అతడి ఏడుపు వినలేక ఇందిరవెళ్ళి గిరిని హృదయానికి హత్తుకుని, గద్గదకంఠంతో, "గిరీ..... నీకు అమ్మలేదు. అమ్మగుర్తూ ఉండదు" అంది

ఆమె కళ్ళనుండి దుఃఖాశ్రువులు రాలిపోతున్నాయి. అంతవరకూ ఆపుకున్న దుఃఖం బిడ్డను చూడగానే పొంగిపొర్లింది.

రావుగారు 'ఆఖరికి ఇందిరపెళ్ళి చూడకుండానే వెళ్ళిపోయావే"— అని దుఃఖించారు.

కూతురి పెళ్ళయ్యేవరకన్నా ఆమె బ్రతికిఉండాల్సింది అని ఏడ్చారాయన.

ఆమె 'ఆఖరుకోరిక ఆయన హృదయపు లోతుల్లో సూటిగా గ్రుచ్చుకుంటూఉంది.

రావుగారు భార్య అంత్యక్రియలు అతి వైభవంగా నెరవేర్చారు.

ఆక్షణంలో 'గిరి కర్మలు చేసేంతటివాడయ్యేవరకన్నా లలితఉంటే బాగుండేది' అనుకోకుండా ఉండలేకపోయారు.

లలితమ్మగారి మరణాన్ని గురించి మోహనుడికి ఇందిర, రావుగారు ఇద్దరూ వేర్వేరుగా ఉత్తరాలు వ్రాశారు.

మోహనుడు క్లుప్తంగా 'ఇలా జరగకుండా ఉండాల్సింది. ధైర్యం తెచ్చుకోండి' అని వ్రాశాడు.

మోహనుడినుండి ఇంకా ఎక్కువ సానుభూతి, అనుకంపలను ఆశించిన ఇందిరకు అతడి చిన్ని సమాధానం నిరాశను కలిగించింది.

"అవును. కన్నతల్లిమీద తనకున్న ప్రేమ అతడికెలా వస్తుంది? ఆయనతల్లిమీద ఆయనకున్న ప్రేమ నాకుమాత్రం ఉందా?" అని తన్నుతాను సమాధాన పరచుకొంది

—43 వ పేజీ చూడండి



## సరి, బేసి

తరుణీ నామాక్షరములు
స్థిరముగ నే డింత బెంచి
తిథితో గూడన్
పరమేష్ఠి పాలు చేయగ
సరికూతురు బేసికొడుకు
చయ్యన గల్గున్.

కొండపల్లి సరయూకుమారి (విశాఖపట్టణం)

* * *

## ఎవరెవరు ?

ఒక గాయనీమణి తన గానచాతుర్యాన్ని ప్రదర్శిస్తూంది. వినేవాళ్లకది దుర్భరంగా ఉంది. అందరూ ఆమెను తలోకరకంగా తిట్టుకుంటూంటే ఒకాయన మాత్రం నిశ్శబ్దంగా కూర్చుని వినడం చూసి ఆపక్కాయన ఇలా అన్నాడు: "ఉత్త గాడిదరుపులు, ఎలా వింటున్నారండీ!" ఆపక్కాయన మెల్లగా "ఆవిడ మా ఆవిడేనండి" అన్నాడు. మొదటాయన గతుక్కుమని "ఆవిడ స్వరాని కేమండీ నిక్షేపంలా ఉంది. కాని ఆపాటే బాగులేదు. లేకపోతే ఎంత బాగుండేది" అని సర్దుకున్నాడు. అంతటితో ఊరుకోక "ఆ పాట రాసిందెవరో మీకు తెలుసునా" అని పక్కాయనని అడిగాడు. ఆయన తల వంచుకుని "ఆ పాట రాసింది నేనేనండి" అని జవాబిచ్చాడు.

వి. వి. రమణారావు (విశాఖపట్టణం)

* * *

## గృహలక్ష్మి

"వంటయిందా? ఆఫీసుకి టయిమైంది. ఆలస్యముంటే చెప్పు. హోటల్లో భోంచేస్తాను." విసుగ్గా అరిచేరు నరసింహంగారు.

"అబ్బ! ఏం తొందరండీ, ఓ పది నిమిషా లాగకూడదూ?" అంది శ్రీమతి రత్నం వంటఇంట్లోంచి.

"ఏం వంటవుతుందా?" ఆత్రుతగా అడిగారు నరసింహంగారు.

"అబ్బే, నేనుకూడా మీతో హోటలుకొస్తాను." తాపీగా అంది శ్రీమతి రత్నం.

శ్రీరంగం రాజేశ్వరరావు (విశాఖపట్నం)



'అబ్బా! ఏమేవ్! కాలుమీద గొడ్డలిపడి దెబ్బతగిలి రక్తమొస్తూంది. నేను కట్టెలు కొట్టలేనన్నా విన్నావుకాదు!...'
"ఆ—ఆఁ ఆ రక్తంకాలుతోటి ఇంట్లోకి రాకండి. ఈవేళే ఈ గదంతా గడిగించేను.


ప్రేమ కానుక
బొమ్మలకథ- సత్యమూర్తి
6
సరే నువ్వు అటు గా నేను ఇటునించి వెళ్ళు
నించి వెతుక్కొస్తాను
సరే పద
?!!!
మీరేం కంగారు పడకండి, నేను వెతుక్కొస్తాను
కొంత సేపటికి ఆచూకీ దొరుకుతాడు
నాయనగారు తండ్రే నువ్విక్కడ ఉన్నావా? మీ అక్కయ్య దగ్గరకి తీసుకెళ్తా నడు
ఏరా దారి కేదురా?
ఆ దారి కేదు వీణ్ణి తీసుకెళ్ళి ఇచ్చేద్దాం నడు
ఒరేయ్ ఇచ్చేస్తావూ? ఇలాంటి పోగొట్టుకుంటూ
ఛాన్సు నాగన్న
కొంపలు మునగవు కదా?
నీ కేంభయం లేదు ముందు నడు




**20-7-1962 శుక్రవారము మొదలు**
**26-7-1962 గురువారము వరకు**

### మేషం :

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

రావలసిన ధననిమిత్తం ఎదురుచూడటం ప్రయోజనం తక్కువ. పెద్దమనుష్యులను కలుసుకొనటం, వృత్తికి సంబంధించిన ప్రయాణాలు, ముందుముందు జరుపవలసిన కార్యక్రమాలను గురించిన ఆలోచనలు—వీనితో విశ్రాంతిలేకుండా పోతుంది. ధనాదాయం గతవారంకన్నా బాగుంటుంది. ఒకటి, రెండు సందర్భాలలో పాతమనుష్యులతో సంబంధం వదులుకొనవలసివస్తుంది. కుటుంబంలో సాధారణంగా అశాంతిసూచనలు కనుపిస్తవి. మీక్రింద పనిచేసేవారితో జాగ్రత్తగా ఉండటం మంచిది. చిన్నపనులుకూడా పెద్దప్రయత్నంతో పూర్తిచేయవలసివస్తుంది. నగలు మొదలయినవి కొంటారు. రాజకీయాలలో మీ ఆలోచనలు అనుకూలిస్తవి. 24, 25 తేదులలో శుభకార్యానుకూలత, మిత్రలాభం.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

అన్నివిధాలా మీమాటకు విలువ పెరుగుతుంది. మధ్యమధ్య కలహప్రసంగాలు వస్తూ ఉంటవి. ముందుఉన్న వస్తువును సమయంలో వినియోగించుకొనటానికి వీలులేకుండాపోతుంది. పైకిమాత్రం గౌరవంతో మీ మాటను నెరవేర్చుకొంటూ ఉంటారు. మీ ఆరోగ్యం బాగుంటుంది. అధికారులవల్ల కార్యసిద్ధి పొందగలుగుతారు. క్రొత్తవమనుష్యులతో చేరతగిన సమయంకాదు. వృత్తి ఉద్యోగాలలో ప్రశాంతంగా జరిగిపోతూఉంటుంది మీ మాటల తొందరలో ముఖ్యవిషయాలు ఇతరులకు తెలియకుండా చూచుకొనండి. వారాంతంలో మిమ్ములను ఆందోళనపరచగల వార్తలు తెలుస్తవి. డబ్బు అవసరం అధికమవుతుంది. మీ పనులలో పొరపాట్లు జరుగుతవి. 20, 21 తేదులలో సంఘంలో గౌరవం, ఆకస్మాద్ధనలాభం, పుణ్యకార్యాలు.

**గ్రహస్థితి**

వృషభంలో అంగారకుడు, మిధునంలో బుధుడు, కర్కాటకంలో సూర్య, రాహువులు, సింహంలో శుక్రుడు, మకరంలో శని, కేతువులు, కుంభంలో గురువు, కుంభ, మీన, మేష వృషభాలలో చంద్రుడు.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

విశ్రాంతిగా ఉండటానికి బుద్ధిపుట్టదు. చేసిన పనివల్ల ప్రయోజనము కనుపించదు. తాత్కాలికంగా ధన సంబంధమైన సమస్యలు ఎదురుకాగల సమయం. సహాయంకోరేవారు అధికంగా ఉంటారు. వృత్తిలోకూడా ఆరంభించిన పనులు క్రమంగా జరుగుతూవచ్చి, ఒక సమయంలో అకస్మాత్తుగా ఆగిపోయే అవకాశాలున్నవి. శత్రుబాధ, అప్పులబాధ తగ్గిపోతుంది. విద్యాభివృద్ధి ప్రయత్నాలు ఫలిస్తవి. కుటుంబంలోనివారివల్ల నిష్ఠురాలు వచ్చే అవకాశాలున్నవి. ఇతరులవద్దనుంచి ఎదురుచూస్తున్న ధనం వస్తుంది. వ్యవహారపత్రాలు వ్రాయటం, ఇతరులకు మధ్యవర్తిత్వం చేయటం మొదలయిన విషయాలలో జాగ్రత్తగా ఉండండి. పుణ్యకార్యాలు నెరవేరుతవి. 25, 26 తేదులలో ఉత్సాహభంగం, దుబారా వ్యయం, ప్రయాణ సూచనలు.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

ప్రస్తుతం మీ ఆలోచనలు ఒకరకాలుగాపోతూ ఉంటవి మిత్రులుచెప్పే ప్రతిమాటా అనుకూలంగా ఉన్నట్లు తోస్తుంది. అయితే మీ అడుగు ఎటువేయటానికి వీలుకాదు. కోర్టు, కచేరీలలో దైవికంగా జయం లభిస్తుంది విశేషంగా ఆదాయం వచ్చి, సమయంలో ఉపయోగపడుతుంది. మీ దేహసౌఖ్యాన్నిగురించి జాగ్రత్తవహించలేకపోతారు. స్వంత ఉపయోగం నిమిత్తం చేసిన ప్రయత్నాలు చివరకు మీ స్నేహితులకు అనుకూలిస్తవి వారం రెండవభాగంలో వస్తువుల దొంగతనంవల్ల పోయే అవకాశాలున్నవి వృత్తివ్యాపారాలలో అనుభవంలేని క్రొత్తపనులు పైన వేసుకొంటారు. మొత్తంమీద బుద్ధిబలంతో జాగ్రత్తగా పూర్తిచేయగలుగుతారు. 20, 21 తేదులలో ధనవ్యయం, సంతోషకార్యాలు, శ్రమ.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

శ్రమ కనుపిస్తున్నా పట్టు విడువకుండా మీ కోరికను తీర్చుకోగలుగుతారు ఆదాయంమాత్రం పెద్దగా పెరుగదు. బాహ్యావిషయాలలో మీరు ఏమాట చెప్పినా చెలామణీ అవుతుంది ఇంతకు ముందు మిమ్ములను ఎదిరించి మాట్లాడేవారు క్రమంగా తొలగిపోతారు. సాహస కార్యాలయందు దిగవలసిన పరిస్థితులు ఏర్పడుతవి. వారం రెండవ భాగంలో మిమ్ములను పొగిడే మనుష్యులు తటస్థపడుతారు వృత్తికి సంబంధించిన పనులలో ఆటంకాలు ఏర్పడుతవి. ఏమనుష్యులతో ఏవిధంగా ప్రవర్తించాలో అనుభవంతో తెలుసుకుంటారు సదా నంగా ఉండటంవల్ల సంతృప్తికరమైన ఫలితం పొందగలుగుతారు. పిల్లలమూలంగా ఆనందం లభిస్తుంది. మీ ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. 22, 23 తేదులలో శుభకార్యాలు, వృత్తిలో పోటీ, బంధు విరోధం.

## కన్య :

(ఉ త్తర 2,3,4 పా., హ స్త, చి త్త 1, 2 పా.)

ఈ సమయంలో పేరు మీకు, ఫలితం అవతలి వారికి. సుఖంలేని గౌరవంమాత్రం దక్కుతుంది. కుటుంబవిషయాలలో తలచిన పనులు చురుకుగా జరుగవు. కాని, ఉత్సాహము, అనుకూల సూచనలు కనుపిస్తూఉంటవి. చిన్నచిన్న పనులలో కూడా దుబారా ఖర్చులు అధికమవుతవి. మీ జాగ్రత్తవల్ల రానున్న అవకాశాలను మీ విరోధులు భంగంచేయ కుండా చూచుకోగలుగుతారు. మీకు సహాయం చేయ వలసినవారు మంచి మాటలతో త్రిప్పుతూఉంటారు. ప్రస్తుతం ఫలితం లేకపోయినా ముందు విజయం సాధించగల మనోభావం స్థిరపడుతుంది. మిమ్మలను గురించి అగౌరవంగా మాట్లాడేవారికి చక్కగా సమాధానం చెప్పగలుగుతారు. 20, 21 తేదులలో అనారోగ్యం, స్వల్పలాభం, క్రొత్త కార్యక్రమాలు.

* * *

## తుల :

(చి త్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

శక్తికిమించినపని, మిమ్మలను గురించి బంధు వర్గంలో ఈర్ష్య కలుగగలసమయం. మొత్తం మీద మాట రాకుండా కాపాడుకోగలుగుతారు. వృత్తి వ్యాపారాలలో ప్రస్తుతం ఫలితం పెద్దగా ఉండ దనేభావం ముందుగా తెలుసుకోగలుగుతారు. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం అకస్మాత్తుగా లభిస్తుంది. "ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టలేడు" అనే సామెత అనుభవంలోకి వస్తుంది. బంధుమిత్రులవద్ద నుంచి వచ్చే ఉత్తరాలు విరోధ ప్రసంగాలతోకూడి ఉంటవి. వ్యవహారరంగంలో ముందుముందు మీస్థితి బాగుపడేఅవకాశాలున్నవి పెత్తనం పైనవేసు కొని శ్రమపడవలసిన సమయం. వినోదకార్య క్రమాలలో పాల్గొంటారు. సంఘకార్యాలలో ఉత్సా హం తగ్గుతుంది. 24, 25 తేదులలో క్రొత్త వారితో స్నేహం, కార్యసిద్ధి, ఇష్టవస్తుప్రాప్తి.

* * *

## వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ధనయోగము, గౌరవము బాగుంటవి. అనేక విషయాలలో ఇతరులతో పోటీ పడవలసిన అవసరం తొలగిపోతుంది. శుభకార్యాలవల్ల ఖర్చులు అధిక మవుతవి. కుటుంబంలోనివారితో చిన్నచిన్న పేచీలు వచ్చి సమసిపోతూఉంటవి. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. ఒకటి, రెండు సందర్భాలలో మిత్రుల సలహాలు మిమ్మలను తికమకపెట్టగల అవకాశా లున్నవి. మీ సంతోష, సౌఖ్యాల నిమిత్తం ఖర్చులు మితిమీరగలవు.విద్యావంతులతో పరిచయం లభిస్తుంది. సంఘకార్యాలలో కొన్ని సమయాలలో మీ మాటకు అడ్డుమాట కనుపిస్తుంది. కాని, పర్యవసానంలో పరస్పరసహాయం లభిస్తుంది. సహనంతో మీ బాధ్యతలను నెరవేర్చుకోగలుగుతారు.

25, 26 తేదులలో శుభవార్తలు, కలహ ప్రసంగాలు.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉ త్తరాషాఢ 1 పా.)

గ్రహబలం బాగున్నది. లోగడ డబ్బు ఖర్చు చేసిన వ్యవహారాలు ఈ సమయంలో పరిష్కారం అవుతవి. మిమ్మలను నమ్ముకున్నవారికి సహాయం చేయగలుగుతారు కుటుంబంలోనివారికి అనారోగ్యం చేసి నెమ్మదిస్తుంది మీరు పైనవేసుకొనకపోయినా లేనిపోని కార్యభారంవచ్చి పడుతుంది. బంధు మిత్రు లతో ప్రసంగించటంలో నిబ్బరం చూపవలసిన సమయం. ప్రత్యక్షంలో ఫలితం కనుపిస్తున్నా, అందుకొనటానికి వేచిఉండవలసివస్తుంది. ప్రయా ణం చేస్తారు. ఒక తప్పును సవరించుకొనటానికి బదులు మరొక తప్పును కూడా చేయటం జరుగు తుంది. వృత్తిఉద్యోగాలలో మాటరాకుండా ముందుజాగ్రత్త వహించగలుగుతారు. వారాం తంలో వస్తువులు దొంగతనంగా పోయే అవకాశా లున్నవి. 20, 21 తేదులలో శ్రమతో కూడిన పనులు, సంచారం.

* * *

## మకరం :

(ఉ త్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఎంత ధనం వచ్చినా కర్పూరంమాదిరి అయి పోతూ ఉంటుంది. వ్యవహారజయం లభిస్తుంది ఇంతకుముందు కలిగిన అనుభవంవల్ల మీ కార్య క్రమాలను చక్కగా పూర్తిచేసుకొంటారు. అనవ సరప్రసంగాలతో మిమ్మలను చికాకుపరచేవా రుంటారు. ప్రస్తుతం మీరు చేసే పనులలో ఏది అవసరం, ఏది అనవసరం అనేది తేలక కొంత చిక్కు పడతారు. విలువగల వస్తువులు కొంటారు. సాధ్య మైనంతవరకు ఇతరుల భారమును తగ్గించుకొనండి. ప్రత్యేకంగా అనారోగ్యం చేయకపోయినా, సుఖంగా యున్నామనే సంతృప్తి తోచదు. అగ్ని, ఆయు ధాలు మొదలయినవాటితో జాగ్రత్తగా ఉండటం అవసరం ఈ వారంలో వచ్చే ఉత్తరాలవల్ల మీ ధైర్యం సన్నగిల్లే అవకాశాలున్నవి. 25, 26 తేదులలో ధనలాభము, విశ్రాంతిలేని పనులు.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఈ సమయంలో మీరు తలచిన పనులు నెర వేరవు అందుకు తిరిగి ఆలోచనలు, ప్రయత్నాలు చేయవలసివస్తుంది. వృత్తిఉద్యోగాలలో శత్రుబాధ కనిపిస్తూఉంటుంది. మొత్తంమీద మీ పెద్దరికాన్ని నిలుపుకోగలుగుతారు. ఆదాయంమాత్రం బాగా ఉంటుంది క్రొత్తఒప్పందాలు చేసుకొనటంలో ముందు ముందు చిక్కులు రాకుండా చూచుకొనండి.

---

**ఈ వారము ధరలు**

బంగారు ధర నిలకడగా ఉంటుంది. వారాం తంలో కొంచెం మందీ వస్తుంది. వెండిధర కొద్దిగా పెరుగుతుంది. నూలు ధర ముందు మందీ కనుపించి వారం రెండవభాగంలో క్రమంగా పెరుగుతుంది. వేరుశనగపప్పు ధర తగ్గే అవకాశాలున్నవి. నూవుల ధర మామూ లుగా ఉంటుంది. శనగలకు గిరాకీ ఆరంభం అవుతుంది. మిర్చి ధర వారం రెండవభాగంలో పెరుగుతుంది. ధనియాల ధర మందీఅయ్యే అవకాశాలున్నవి.

---

భూములు మొదలయినవి కొనటంవంటి విషయా లలో ముందు ప్రతిబంధకాలు తోచినా, చివరకు లాభకరంగా జరుగుతవి. సంఘకార్యాలలో గౌర వంతోబాటు ఖర్చులున్నూ అధికం అవుతవి. శుభ, పుణ్యకార్యాలకు ఆటంకాలు రాగల సమయం. ధైర్యం, పట్టుదల అవసరం. 23, 24 తేదులలో కుటుంబంలో సంతోషకార్యాలు, ధనలాభం.

* * *

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

యథార్థంగా ఏ లోపము కనుపించదు. కాని, మీ మనస్సుమాత్రం ఆదుర్దా పడుతుంది. ప్రతి పనీ సక్రమంగా జరుగుతుంది. ఇతరుల సలహాలను ఉప యోగించుకొనటంలో మీ శక్తినికూడా గమనించు కొనటం అవసరం. వ్యవహారపత్రాలవంటివి వ్రాయు టంలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. ఎదటివారి స్వభావం తెలుసుకొనకుండా చేసిన స్నేహం వల్ల ఈ సమయంలో పశ్చాత్తాపపడవలసి వస్తుంది. సుఖంకోసం ఎదురుచూడకుండా మీ బాధ్యతలను నెరవేర్చుకొనటానికి ప్రయత్నించవలసిన సమయం. బాహ్య విషయాలలో గౌరవప్రదమైన కాలం. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. 24, 25 తేదులలో వృత్తిలో అనుకూలత, అకస్మాద్ధనలాభం.

★

---

"నాకు కార్ డ్రయివింగ్ గురించి తెలిసినదంతా ఒక పుస్తకం నిండుతుంది!" అన్నది ఒకావిడ.

"అవును నిజమే! కాని నీకు తెలియనిదంతా ఒక హాస్పిటల్ నింపుతోంది..." ఆవిడ భర్త చెప్పాడు.

రవి (మద్రాసు)

---

# మనమూ - మన దేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

జఠరాశయములో ఏర్పడే వ్యాధులు చాలా ఉన్నవి. వాటిని క్రమంగా వివరిస్తాను. కాని, కొన్ని సామాన్య కారణములవల్ల జఠరాశయము వ్యాధిగ్రస్తము అవుతూ ఉంటుంది. వ్యాధి ఏర్పడ్డతరవాత, ఏవో కొన్ని లక్షణములు ఏర్పడతవి. కాని మూలకారణములను తెలుసుకోకుండా ఆ లక్షణములను అర్థం చేసుకోవడం కష్టం.

జీర్ణకోశము ఒక ఊర్ధ్వద్వారము అధోద్వారము ఉన్న పెద్ద గొట్టము. దాని ఊర్ధ్వ ద్వారము నోరు. జీర్ణకోశంలో ప్రవేశించినది ఏదయినా నోటి ద్వారా ప్రవేశించవలసినదే.

జఠరాశయమును 'ఇరిటేట్'చేసే వస్తువులు మూడు రకములు.

(1) అరగక, కరగక, గరుకుగావుండి కడుపుకు అపాయం కలిగించే వస్తువులు.

(2) జఠరాశయ మ్యూకస్‌మెంబ్రేనును ఇరిటేట్‌చేసే రసాయనిక వస్తువులు.

(3) మరీ వేడిగావుండే పానీయాదులు.

ఈ పై మూడూ కూడా నోటిద్వారా లోపలికి పోవలసినవే. పిల్లలు, రాళ్ళు, నాణేములు, గాజు ముక్కలు, చిన్న చిన్న పింగాణీ బొమ్మలు, వక్కలు, పొరపాటున మింగుతూ ఉంటారు. పెద్దవారిలో ఈ ప్రమాదం అట్టే ఉండదు.

పోతే, మిగిలిన రసాయన ద్రవ్యములు నోటిలో ఉన్న లాలాజలము (Saliva) లో కరిగి, పలచబడి లోపలికి పోయినా ఇరిటేట్‌చేయని బలహీనమైన ద్రావణములుగా మారిపోతవి. వేడివస్తువులు, చాలావరకు, నోటిలోనే చల్లబడతవి. పెద్దవిగా ఉండే ఆహారఖండములు (పటికబెల్లం మిఠాయి మొదలయినవి) చిన్న చిన్న ఖండములుగా నమలబడతవి. కరగని చిన్నచిన్న రాళ్లవంటి వస్తువులను మ్యూకస్‌తో కప్పి, వాటి మొనలు, కొనలు జీర్ణాశయం మ్యూకస్ మెంబ్రేనును గాయపరచకుండా నోరు చూస్తుంది. ఇదంతా ఆహారం మెత్తగా నమిలిమింగే అలవాటున్నవారిలోనూ నమలడానికి మంచి దంతములున్నవారిలోనూ జరుగుతుంది. కొందరు నమలకుండానే, మింగగలిగినవన్నీ దబదబా మింగేస్తారు. పళ్లు లేనివారు సరేసరి. కొందరికి వేడికాఫీ మింగడం, సోడాతో కలపకుండానే బ్రాందీవంటి వస్తువులు తాగివేయడం అలవాటు. పట్టె కాఫీ డికాక్షను, టీ డికాక్షను, ఊరగాయలు, పచ్చి మామిడికాయలు, అపక్వ వస్తువులు, పొగాకు రసము తీసుకునేవారున్నారు. తలనెప్పితో బాధపడేవారు ఏస్పిరిన్‌వంటి మందులూ, రాత్రిళ్లు నిద్రపట్టనివారు బ్రొమైడ్, ఫీనోబార్బిటోన్‌వంటి మందులు, తరుచు మింగుతూ ఉంటారు. ప్రతి మందుకూ ఒక మంచి గుణము, కొన్ని దుర్గుణములు ఉంటూ ఉంటవి. ఆ మంచిగుణంకోసం వాటిని సేవించినప్పుడు, ఆ దుర్గుణములు పోవడానికి కూడా ఔషధములను తీసుకోవాలి. మిక్చరులో అన్ని మందులు వ్రాయడానికి కారణం ఇదే. కొన్ని పరిస్థితులలో డుయోడినంలోవుండే పేంక్రియస్ రసమూ, పసరూ కలిసిన ద్రవపదార్థము కడుపులోకి ప్రవేసిస్తుంది. అది కడుపులో మ్యూకస్ మెంబ్రేనును ఇరిటేట్ చేసి, అక్కడ ఇన్‌ఫ్లమేషన్ కలిగిస్తుంది. డుయోడినంలో అల్సరు ఏర్పడినప్పుడు కడుపునూ, చిన్న పేగయిన జెజునమునూ కుట్టి ఒకకృత్రిమద్వారమును ఏర్పరుస్తారు. ఈ ఆపరేషనును 'గేస్ట్రో జెజునాస్టమీ' (Gastro jejunostomy) అంటారు. గేస్ట్రియం అంటే కడుపు. 'జెజునం' అంటే చిన్న పేగు మొదటిభాగము. 'స్టోమం' అంటే 'నోరు.' కడుపులో చేసిన రంధ్రం నోరులాగా జెజునంలో తెరుచుకునేటట్లు చేసే ఆపరేషను గనుక దాని కాపేరు వచ్చింది. ఈ ఆపరేషనువల్ల డుయోడినంలో వుండే రసం కడుపులోకి ప్రవేశించి కడుపును ఇన్‌ఫ్లేం చేయవచ్చును. కడుపు జెజునం కలిపి కుట్టినచోట కొత్త అల్సరును ఏర్పరుచవచ్చును. ఇందువల్ల ఈమధ్య కడుపులో అల్సరు ఏర్పడినప్పుడు కడుపునే తీసివేసి, ఈసొపెగస్‌తో కుట్టివేస్తున్నారు. బాగా నమిలి తిన్నప్పుడు పేంక్రియస్ రసమే జఠరరసం చేసిన పనులను చేసివేస్తుంది.

ఇన్‌ఫెక్షను:—(క్రిమిదోషం) కడుపులో వ్యాధి ఏర్పడడానికి రెండవ కారణం క్రిమిదోషం. దంతములకు సంబంధించిన పయోరియా ఉన్నవారూ, దీర్ఘమైన టాన్సిలైటెస్, ఫేరింజైటెస్, సైనసైటెస్ (Sinusitis) (సైదవడవిముకలో ఖాళీ ప్రదేశములలో చీము చేరే వ్యాధి విశేషము) వంటి వ్యాధులతో బాధపడేవారూ, ఆహారం తీసుకున్నప్పుడల్లా, దానితో విధిగా క్రిములు కడుపులోకి పోతూనే ఉంటవి. చిన్నపిల్లలకు కళ్లేను నోటిలోకితెచ్చి ఉమ్మివేయడం తెలియదు. వారు కళ్లేను తరుచు మింగుతూఉంటారు. పెద్దవాళ్లే నలుగురిలో కూచున్నప్పుడూ, సినిమాహాల్లో ఉన్నప్పుడూ, ఉమ్మడానికీ, ఊదడానికీ అవకాశం లేనప్పుడూ, తరుచు కళ్లేను మింగుతూ ఉంటారు. క్షయరోగులుకూడా తమ కావ్యాధి ఉన్నదని నలుగురికీ తెలియరాదని తరుచు కళ్లేను మింగుతూ ఉంటారు. జఠరరసంలోవున్న హైడ్రోక్లోరిక్ ఏసిడ్, క్షయక్రిములను తప్ప మిగతా అన్ని క్రిములను సంహరిస్తుంది. కాని, ఏక్లోర్‌హైడ్రియా హైపోక్లోర్‌హైడ్రియా (ఏసిడ్ లేకపోవడము, తగ్గి ఉండడము) వంటి వ్యాధులలో ఈ క్రిమిసంహారానికి కావలసినంత ఏసిడ్ కడుపులో ఉండదు. జఠరాశయంలో వ్యాధులు రావడానికి క్రిమిజనితమైన, దీర్ఘమైన, వాగ్రోగములు (Oral sepsis) ప్రధానకారణములు.

జఠరాశయంమీద క్రిమిప్రభావం అవి ఆహారం ద్వారా ప్రవేశించినప్పుడు మాత్రమే ప్రసరించదు. కొన్ని అతితీవ్రములయిన క్రిమివ్యాధులలో ఆ క్రిములు ఉత్పత్తి చేసిన 'టాక్సినులు' (విషములు) (Toxins) రక్తంద్వారా జఠరాశయము మ్యూకస్ మెంబ్రేను లో ప్రవేశించి, దానిని ఇన్‌ఫ్లేం చేస్తవి. కడుపుకు పట్టిన ఇన్‌ఫ్లుయెంజా జ్వరంలో ఇల్లాగే జరుగుతుంది. కడుపులో నొప్పి, వాంతులతో ఈ జ్వరం ప్రారంభిస్తుంది. ఇల్లా జఠరాశయ లక్షణములతో ప్రారంభమయ్యే క్రిమిజ్వరములు చాలా ఉన్నవి. కొన్ని రోగస్థితులలో శరీరంలోనే కొన్ని విష పదార్థములు ఉత్పత్తిచెంది, రక్తంద్వారా కడుపులోకి చేరి, అక్కడ వ్యాధిని ఏర్పరుస్తవి. మూత్రకోశము (Kidney) సరిగా పనిచేయనప్పుడు, 'యురీమియా' (యూరియా అనే వస్తువు రక్తంలో పేరుకోడం) అనే రోగస్థితి ఏర్పడుతుంది. ఒళ్ళంతా కాలి బొబ్బలెక్కిపోయినప్పుడు చర్మంలో కొన్ని విషపదార్థములు ఉత్పత్తి అవుతవి. ఇటువంటి విషపదార్థములు రక్తంద్వారా జఠరాశయంలో ప్రవేశించి, అక్కడ ఇన్‌ఫ్లమేషను ఏర్పరుస్తవి. ఒక్కొక్కప్పుడా క్రిమిదోషము దీర్ఘమై అక్కడ అల్సర్లు కూడా ఏర్పడతవి.

## మానసిక కారణములు

ఒకప్పుడు శరీరవ్యాధికీ, మనస్థితికీ సంబంధం లేదనే భావన పాశ్చాత్య వైద్యులలో ఉండేది. ఈనాడా అభిప్రాయం పూర్తిగా నశించింది. 'సోమా' (Soma) అంటే శరీరం 'సైకే' (Psyche) అంటే మనస్సు. స్మృతి (Concious) ఉపస్మృతి (Subconcious) అపస్మృతి (Unconcious) అని మనస్సుకు మూడు స్థితులున్నవి. ఈ మూడు స్థితులలో ఏ స్థితిలోవున్నా, మనస్సును 'సైకే' అంటారు. మనకు తెలియకుండానే మనస్సులో అనేక గందరగోళములు జరుగుచూ ఉండవచ్చును. పూర్వస్మృతిలో బాధించని పరిస్థితి ఉపస్మృతిలో మనస్సును బాధించి అక్కడ నాటుకునిఉండి, వ్యక్తులను బాధించవచ్చును. అటువంటివారి ప్రవర్తన విచిత్రంగా ఉండవచ్చును. వారికి అనేక శారీరక వ్యాధులు కలగవచ్చును. టైఫాయిడ్‌వంటి విషజ్వరములలో సంధించి మనస్సు చెడడం అందరికీ తెలిసిన విషయమే. ఈనాడు వ్యాధి కారణములు కేవలం శారీరకములు కావనీ, మనోశారీరకములనీ (Psycho-somatic) నిశ్చయంగా తేలిపోయింది. హోమియోపతిని సంభావించిన హాని

41–వ పేజీ చూడండి




సారధి విచిత్రమైన వ్యక్తి. వాడితో స్నేహం చెయ్యడం అందరికీ చాతకాదు.

ఈ కథ ప్రారంభంకాకముందు సారధి 'పెళ్ళి చేసుకోను' అన్నాడు. వాడు ఒకమాట అన్నాడూ అంటే అది నెరవేరి తీరవలసిందే. బొత్తిగా పట్టుదల మనిషి సారధి!

అలాంటి సారధి దగ్గర్నుంచి నాకో విచిత్రమైన ఉత్తరం వచ్చింది.

ప్రియమైన రావ్!

ఇవ్వాళ మూర్తికిగూడా ఉత్తరం రాస్తున్నాను. నాటికి పెళ్లిచేసుకోవాలనే వాంఛ కలిగింది. దీనికి కారణం మీ రెండు కుటుంబాలే!

చివరికి మీరే గెలిచారు! శుభలేఖలు త్వరలో పంపుతాను. ప్రస్తుతానికి సెలవు. 'నీ'

సారధి.

ఆశ్చర్యపోయాను.

గత నాలుగు సంవత్సరాలనుంచి 'పెళ్లిచేసుకో' మని సారధి చెవిదగ్గర ఇల్లుకట్టుకుని పోరాడాము నేనూ, మూర్తీను. వాడు వినలేదు సరికదా, మళ్లీ పెళ్లిమాట తనదగ్గరంటే సహించేదిలేదని గూడా హెచ్చరించాడు.

మూర్తి, సారధి, నేనూ—ముగ్గురం ప్రాణ స్నేహితులం. క్లాసుమేట్సుమి.

తన కిష్టంలేనిపని తన పక్కనున్నవాడు చేసినా సహించలేడు సారధి. సర్దుకుపోయే మనస్తత్వం కాదు వాడిది. వాడివన్నీ చాలా విచిత్రమైన 'సెంటిమెంట్సు.'

సహజంగా ప్రతివాడికీ సరదాయైన ఘట్టం కాలేజీ జీవితం. కొన్ని పోకిల్లాటి గుణాలు అక్కడే ఉద్భవిస్తాయి. వాటిల్లో ముఖ్యమైనది—అందమైన ఆడపిల్లలతో పరిచయం చేసుకుని దానిద్వారా వీలు దొరికినప్పుడల్లా కల్పించుకుని మాట్లాడ్డము. 'పైగా' ఫలానా అందమైన అమ్మాయితో నాకు పరిచయం ఉన్నది సుమా' అని చెప్పుకోడం పెద్ద 'క్వాలిఫికేషను' కూడాను.

ఈ పద్ధతి సారధికి నచ్చేదికాదు. మండిపడేవాడు.

మాకు ఈ ధోరణి కాస్త చిరాకు కలిగించేది. లేకపోతే ఫలానా అమ్మాయి అందంగా ఉంటుంది. సుమా అనిగాని, ఆ అమ్మాయితో నాకు పరిచయమున్నది తెలుసా అనిగాని — ఓ చిన్న ప్రశ్నవేస్తే దానికి పెద్ద రగడెందుకు? అయినా ఈ ముక్కలో మన్నించతగని తప్పేమున్నది గనుక?

సారధి కాబట్టి మాలో ఒకడిగా, ప్రాణసమానంగా తిరుగుతున్నాడు గనుక, వాడివాదాన్ని వింటూ సర్దుకుపోయాముగాని—మరొకడైతే మా స్నేహం కాస్తా అప్పటి కప్పుడే ముక్కలైపోయేది.

సారధి దృష్టిలో ఈనాటి కాలేజి విద్యార్థి చేస్తున్న ప్రతిపనీ నేరమే! చదువుకోడానికి వచ్చినవాను



# సారథి

చదువులోనే పరిపెట్టుకోవాలిగాని, ఇతర వ్యాపకాలు ఎందుకుంటాడు? అలాంటివాడు భ్రష్టుడంటాడు.

నా డింత సీరియస్‌గా వాదిస్తూంటె విని, వినిపించుకోనట్టు ఉండేవాళ్ళం. వాడికీ మాకూ వున్న స్నేహ సంబంధానికి ఇది చక్కటి నిదర్శన మవుతుంది.

మాతోనేకాదు; వాడి కుటుంబ వ్యవహారాల్లో కూడా సారథిపద్ధతి ఇల్లాగే ఉండేది. వాడికి చిన్న తనంలోనే తల్లిపోయింది. వాళ్ళనాన్న రెండోపెళ్ళి చేసుకున్నాడు. జూదం, తాగుడు మొదలైన వ్యసనాలు ఆయనకు ప్రాణాలు. అవే ఆయన లోకం. ఇది సహించేవాడుకాదు సారథి. ఒకటికి రెండుసార్లు సారథి చెప్పిచూశాడు ఇది మీకు తగదని. 'ప్రేలెడు లేవు నువ్వు ట్టానాకు చెప్పేది' అని ట్రోసివుచ్చా రాయన. అంతే — ఆ తండ్రీ కొడుకులమధ్య అను బంధం బీటలు వారింది.

అది ఎలాంటి పరిస్థితికి తీసుకొచ్చిందంటె — సంవత్సరానికి పదినెలలు బస్తీలోనే ఉండేవాడు సారథి. సెలవల్లో ఎప్పుడైనా ఇంటికి వెడితే ఒకటి రెండువారా లుండేసరికే వాడికి ప్రాణం పోయేంత పనయ్యేది. వెంటనే బయల్దేరి మళ్ళీ రూముకి వచ్చేసే వాడు. మిగిలిన సెలవంతా అద్దెగదిలోనె గడిపే వాడు.

నాలుగైదు తరాలవరకూ కూర్చునితిన్నా తరగని ఆస్తివల్ల సారథికి సుఖంలేదని చెప్పేవాడు. ఆ ఇల్లు నరకమనేవాడు. ఆయ నెప్పుడూ తాగి తందనా లాడుతూండేవాడుట. సవతితల్లి అసలు మాటా డేది కాదుట. అలాంటప్పుడు ఆ ఇంటో సుఖం ఎక్కడుందీ అంటాడు.

మేము చదువుకుంటూన్నరోజుల్లో — వాళ్ళనాన్న గారికి పక్షవాతం వచ్చింది. కబురు వచ్చినా గూడా సారథి ఇంటికి వెళ్ళలేదు. ఇదేమిటని అడుగుతే —

"నీచంగా ప్రవర్తించే మనుష్యులంటె — వాడు నాన్నగానీ, దేవుడుగానీ నా కిష్టంలేదు. ఒక్కనాడు కూడా నా ఆలనా పాలనా గురించి శ్రద్ధ తీసుకో లేదాయన. అమ్మ బ్రతికున్నరోజుల్లో, ఆవిడ నాకు ప్రాణాలు పెట్టేది. ఈయనెంత నీచంగా ప్రవ ర్తించినా, ఆవిడకోసమైనా నే నా ఇంట్లో ఉండక తప్పిందికాదు. ఇప్పుడు అమ్మలేదు. అమ్మతోపాటు నా కా ఇంటితో సమ్మంధం తీరిపోయింది" అన్నాడు.

సారథి రాతిగుండేమో అనిపించింది. కానీ, నాడు వ్యక్తి, ఆతనివాలువాళ్ళు విలువలంటె ప్రాము ఖ్యత ఇస్తాడు. ఈ రకమైన మనస్తత్వం నాకు తారసపడిన ఏ మిత్రుడిలోనూ కాగడాపెట్టి వెతి కినా కనిపించలేదు.

—"కొందరుంటారు. వాళ్ళేది పట్టించుకోరు. ఇం కొందరు గాలికి ఎటుపడితే అటు ఊగుతూంటారు. బహుకొద్దిమందిమాత్రం ఇలా ప్రతి చిన్నవిష యానికీ పూర్వాపరాలు ఆలోచిస్తూంటారు రావ్. మన సారథి ఈ కోవకి చెందుతాడు. కాబట్టి — సాధ్యమైనంతవరకూ ఆమనిషితో అభిప్రాయ భేదాలు తెచ్చుకోకూడదు. అదో తరహాయని సరి



పెట్టుకుపోదాం" అనేవాడు మూర్తి.

అలాంటి సారథి ఓ నాడు ప్రేమించానన్నా(డు). అదిరిపడ్డాం. పిడేవితే ప్రేమించడ మేమిటా ఆశ్చర్యపోయాం. వెనకటికి ముకుందం ఇలాగే అన్నా(డు)

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!


రోజల్లా
పని
చేశాక...
వినో
దా
లకు
సిద్ధ
పడ
గలరు.

లేదా?. అయితే అధిక
జీవశక్తి కోసం
సానటోజన్
సేవించండి. సానటోజన్
ఒక్కటే 95% పాలసత్తువ
పదార్థమునుగలిగియున్న బలవర్ధ
కౌషధం. 5 విటమినులతో బల
పరచబడినది. సానటోజన్
ఒక ప్రసిద్ధటానిక్. అది
అతి శీఘ్రముగా శరీర
ప్రకృతిని బలపరచును.
మరియు శారీరక, మానసిక
శక్తిని ఉత్తేజ పరచును.



సానటోజన్
అధిక
సత్తువ
పదార్థముగల
టానిక్.
ఆరోగ్యానికి
బలమునకు
శక్తికి




GRS-51 TEL

# సానటోజన్

అధిక సత్తువ పదార్థముగల టానిక్

# సారథి

'ప్రేమించానూ' అని. అప్పుడు సారథి నవ్వి,

"ఇలాంటి పదాలు వాడావంటె నాలిక తెగ్గోస్తాను జాగ్రత్త. ప్రేమంటె బజార్లోఅమ్మే వంకాయలనుకున్నావట్రా?" అని కసిరికొట్టాడు.

మేమూ ఈ మాటనే వాడికి వప్పచెప్పుదామనుకున్నాంగాని, అనలేకపోయాం. ఎందుకనో మరి వాడి వాలకం చూస్తుంటె మొదట్నుంచీ ఒకరకమైన భయం మమ్మల్ని పట్టి పీడించేది.

తర్వాత కొన్నిరోజులకి వాడే చెప్పాడు—శారద తనని ప్రేమిస్తోందని. ఆవిడనుంచి ఈమాట విన్న తర్వాతనే తనూ ప్రేమిస్తున్నానని ఆమెకు చెప్పాట్ట. ఇది మరీ చిత్రమనిపించింది మాకు.

నేనే తెగించి అడిగాను చివరికి...

"అయితే నువ్వు ఆమెను ప్రేమించానంటావ్"

"ఆహా......"

"దాన్లో తప్పులేదంటావ్."

"అవునూ."

"కాని......"

"అడుగు. ఏమీ దాచుకోకు."

"మరి మే మెవర్నైనా—" చివర్ని ఆగిపోయాను ఏమనాలో తోచక.

"నువ్వడగదలుచుకుంది తెలుసుకున్నాను. ఫలానా సుబ్బులక్ష్మి గురించి నువ్వు అనర్గళంగా మాటాడేస్తుంటే మండిపడ్డాను. అలాగే సరోజ అందంగా ఉంటుందని మూర్తి అన్నప్పుడు కసురుకున్నాను. కాని రావ్—నువ్వొక సంగతి మరచిపోతున్నావ్. మీరిద్దరూ ఇలా నోరు చేసుకొని వాగేస్తుంటె అవతలి వాళ్ల పరిస్థితి ఏంగాను? నువ్వు సుబ్బులక్ష్మిని, మూర్తి సరోజినీ ఆరాధించవచ్చు. అది మనసుల్లో పెట్టుకోండి. అంతేగాని నోరున్నదిగదా అని చాటింపు వేస్తే? నేను శారదని ఎప్పట్నుంచో ప్రేమిస్తున్నాను. అవుతే అంతమాత్రానికే ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా బయటపడిపోతే ఫూల్‌నయ్యేది నేను. పైగా—అందరిలోనూ అభాసు. నావల్ల ఆ అమ్మాయిగూడా పదిమందిలోనూ రావటం ఏమి బావుంటుంది? ఇప్పుడు—నా అదృష్టంకొద్దీ శారదే అన్నది, నన్ను ప్రేమిస్తున్నానని."

ఆరోజు మూర్తీ, నేనూ ఇద్దరం వాడు చెప్పే ఉపన్యాసాన్ని శ్రద్ధగా చెవులప్పగించి విన్నాము. చివరికి దాని సారాంశం ఇది: ఎదటివాళ్లని దృష్టిలో పెట్టుకుని, మనం నడవాలిట. వాళ్ల మనసు కష్టపడేవిధంగా మనం ప్రవర్తిస్తే అది మన నేరమట.

స్థూలంగా చెప్పాలంటె మా సారథి ఓ పద్ధతికి బాగా అలవాటుపడ్డాడు. జీవితంలో పాటించాల్సిన నియమాలూ అంటూ కొన్ని ఏర్పాటుచేసుకున్నాడు. వాటినిదాటి ఒక్క అడుగైనా పొరపాటున వెయ్యడం వాడికి చేతకాదు.

ఇలాంటి సారథితో ఏ పొరపొచ్చాలూ రాకుండా ఆనర్సువరకూ చదువుకున్నాం. మేము తీసుకున్న జాగ్రత్తవల్ల ఇన్నేళ్ళ స్నేహంలోనూ, ఎన్నడూ అభిప్రాయ భేదం రాలేదు. అందుకు ఇప్పటివరకూ గర్విస్తుంటాం.

యూనివర్సిటీ విడిచినతర్వాత సారథికి అన్యాయం జరిగింది. శారద సారథిని దగాచేసింది. మరెవనినో పెళ్లి చేసుకున్నది. ఇదేమిటని అడిగాడు సారథి. ఆమె తొణక్కుండా జవాబిలా చెప్పింది:

"ఎదగడం మనధర్మం. ఆరోజుల్లో నువ్వు నచ్చావ్. విలువ ఇచ్చాను. పెళ్ళిచేసుకోడానిక్కూడా ఒప్పుకున్నాను. కాని— గడచిన ఈ కొద్ది సంవత్సరాలలోనూ నా అభిప్రాయాన్ని మార్చుకోక తప్పింది కాదు. నా జీవితం ఓ అంతస్థులో జరపాలని నిశ్చయించుకున్నాను. నా అదృష్టంకొద్దీ అంతకుతగ్గ వరుడు దొరికాడు. నువ్వూ కాస్త ఆలోచించి చూడు. నీకంటె అతను అన్ని విషయాల్లోనూ ప్రయోజకుడు. కాదనలేవు. అందుచేతనే అతన్ని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. ఇది తప్పా?"

ఈ జవాబుకి సారథి గతుక్కుమన్నాడు. మరి మనమనుకున్నదంతా ఏమైనట్లు? అని అడిగాడు. ఆమె ఫకాలున నవ్వింది మా సారథిఅమాయకత్వానికి.

"సత్యహరిశ్చంద్రుని చరిత్ర చదవడంవరకే సారథి! ఆచరించడం మనలాటి మనుషులకీ, ఈ కాలనికీ తలకుమించిన పని. అవకాశంకోసం మనం మనల్ని వంచించుకోవలసివస్తుంది. మరి తప్పదు. నీ మనసు బాధపడితే క్షంతవ్యురాలిని. ఇంక వృథా ప్రశ్నలతో విసిగించవనుకుంటాను."

---

నిర్మాత: "నే తీయబోయే సినిమాలో నీకు ముసలాడి వేషం ఇస్తాగాని నీ అడ్రసు ఇచ్చివెళ్లు."

నటుడు: "ముసలి వేషమా! నాకు పట్టుమని పాతికేళ్ళు లేవే"

నిర్మాత: "ఫరవా లేదులే! నే సినిమా తియ్యొచ్చేనాటికి నీకు ముసలితనం రాకపోదు"

రామచంద్రయ్య (మదరాసు)

---

అంతే—ఆనాటితో మా సారథి పూర్తిగా మారిపోయాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ గడిపేవాడు. ఏదీ పట్టించుకునేవాడుకాదు. ఎవర్తోనూ ఆట్టే మాట్లాడేవాడుకాదు.

మాకు శారదపైన కోపం కట్టలు తెంచుకుంది. ఆమె చేసిన అన్యాయాన్ని హెచ్చరించి మందలిద్దామనుకున్నాం. కాని సారథి కూడదని అరికట్టాడు.

"మనల్ని మనం హెచ్చరించుకోవాలిసిందేగాని—పరాయివాళ్లను కాదు. మళ్లీ ఈ జీవితంలో ఎవర్నీ ప్రేమించలేను. అలా నన్ను తయారుచేసి వదలిపెట్టింది శారద. ఈ పాఠాన్నిమాత్రం మరిచిపోలేను."

దీనికి తగ్గట్టు ఆ సంవత్సరంలోనే సారథితండ్రి పోయారు. సవతితల్లి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఆస్తిని కైంకర్యంచేసుకోటానికి ప్రయత్నాలు సాగించిందని గూడా వార్త వచ్చింది. ఇదీ పట్టించుకోలేదు సారథి

వాడికి ఆత్మబంధువుల మైనా, ప్రాణస్నేహితుల మైనా—మిగిలింది నేనూ, మూర్తీను. మూర్తికి పెళ్లవుతున్నరోజుల్లో సారథిని అడిగాం! 'నువ్వూ పెళ్ళి చేసుకోరాదూ' అని. వాడు అడ్డంగా తలూపాడు.

"ఆడదాన్ని నమ్ముకోడం నాకు భయం. ఇంతవరకూ జరిగిన శాస్తి చాలు. మళ్లీ ఆడదానిమాట ఎత్తకండి. నన్ను వంటరిగా ఇలా బ్రతకనివ్వండి చాలు" అన్నాడు.

నా పెళ్ళి గూడా జరిగింది. అప్పుడూ అడిగాం వాడిని, పెళ్లిచేసుకోమని. ఇంకోసారి ఇలా వేధించుకుతింటే మీకూ, నాకూ రగడ రాకతప్పదు. జాగ్రత్త అని హెచ్చరించాడు.

అంతే—మళ్లీ ఆనాటినుంచీ వాడి పెళ్లి విషయం కదపలేదు. అయితే వాడు తీసుకున్న నిర్ణయానికి మాత్రం చింతించాం. ఇందుకు కారణభూతురాలైన శారదని మే మెన్నడూ క్షమించలేదు!

సారథి జీవితంలో లెక్చరర్‌గా స్థిరపడ్డాడు. వాడు అలాంటి ఉద్యోగాలకే తగును. చక్కగా పాఠాలు బోధించడంలో దిట్ట. త్వరలోనే పేరుప్రఖ్యాతలు తెచ్చుకుంటాడని ఆశించాము.

కాని—వాడు ఈ మలుపులోగూడా ఓడిపోయాడు. పాఠాలు చెప్పడం ఎలాగున్నా తన పద్ధతి మాత్రం మార్చుకోలేదు. క్లాసులో విద్యార్థులను ప్రతి చిన్న విషయానికీ మందలించేవాడుట. కొన్నాళ్లు ఓపిక పట్టారు. ఇంకా వాడి పద్ధతి మారకపోవడం చూచి రెచ్చిపోయారు. పబ్లిగ్గా క్లాసులోనే కేరింతాలూ, ఈలలూ వగైరా వెయ్యడం మొదలు పెట్టారుట. దాంతో సారథి అభిమానం దెబ్బతిన్నది. వాడి మందలింపు ఇంకాస్త పైస్థాయిలోకి పోయింది.

ఇదంతా గమనించి వాడికో పేరు పెట్టారుట గడుగ్గాయివిద్యార్థులు కొందరు—చాలా దారుణమైన పేరు 'హైడ్!'

మనిషిలో రాక్షసుడూ, దేవుడూ ఇద్దరూ ఉంటారు. ఒక్కోసారి దేవుడూ, మరోసారి రాక్షసుడూ ఇలా వంతులవారిగా దర్శనమిస్తుంటారు. అవుతే ఈ రంగుని అతి జాగ్రత్తగా పరిశీలించడంలోనే ఉన్నది చాకచక్యమంతాను.

సారథి పద్ధతి మేముకాబట్టి సరిపెట్టుకున్నాంగాని— అందరూ వాడిని హర్షిస్తారంటె వట్టి మాట. మావాడు వాళ్లందరికీ రాక్షసుడిలా కనిపించాడు కాబోలు 'హైడ్' అని నామకరణం చేశారు.

సారథి గురించి తెలుస్తున్న ఈ విషయా లన్నింటికీ మేము చింతించనిరోజు లేదు. అడుగడుక్కీ వాడు ఓడిపోతున్నాడు. వాడికి దురదృష్టం పగ పట్టిన పాములా వెంటాడుతూ వున్నది.

అయిదారుసార్లు (సెలవల్లో) వాడు మా ఇద్దరి దగ్గరికీ రావడం జరిగింది. మా సంసారాలని క్షుణ్ణంగా పరిశీలించాడు. గర్వం కాదనుకుంటె ఈమాత్రం చెప్పగలను—మా అదృష్టమా అన్నట్టు నా భార్య రాజ్యలక్ష్మి, మూర్తిభార్య వసంతా—ఇద్దరివీ అమృత హృదయాలు. వాడొచ్చినప్పుడల్లా ఏలోటూ రాకుండా చక్కటి ఆతిథ్యం ఇచ్చారు. ప్రతిసారీ వాడువున్న వారంరోజుల్లోనూ వాడెప్పుడో పోగొట్టుకున్న సుఖాన్నీ, శాంతినీ పొందగలిగాడు. అప్పుడప్పుడూ ఉత్తరాల్లో రాస్తూండేవాడు—

"మీరిద్దరూ ఏనాడు పుణ్యంచేసుకున్నారో గాని, దేవతల్లాటి భార్యల్ని సంపాయించుకున్నారు. వాళ్లను చూస్తుంటె అనిపిస్తున్నది—స్త్రీలో వంచనే కాదు ప్రాణం పెట్టే అభిమానం కూడా ఉన్నదని. మీకూ, నాకూ స్నేహం ఉన్నది. మీరు నన్ను ఆద

## లాభదాయకమైన లఘు పరిశ్రమ ప్రారంభించండి

"అధునాతన కుటీర పరిశ్రమలు" (తెలుగు) పుస్తకంలో లాభదాయకమైన వివిధ పరిశ్రమలు వున్నాయి. ఈ పరిశ్రమలో వున్నవారు చక్కటి లాభాలను ఆర్జిస్తున్నారు. ప్రతి పరిశ్రమను గూర్చి సంక్షిప్తమైన వివరాలు, ముడి పదార్థాలు లభించే చోట్లు, ముడి పదార్థాల కొనుగోలుకు, వాయిదాల పద్ధతిన యంత్రాల కొనుగోలుకు ప్రభుత్వం యిచ్చే సహాయం – యిందులో వున్నాయి. లఘు పరిశ్రమలు ప్రారంభించ దలచుకున్న వ్యక్తుల సమస్యలకు తగిన పరిష్కార మార్గాలు యిందులో వున్నాయి. పుటలు 878, సుమారు 800 బొమ్మలు, ధర రూ. 13/- తపాలరుసుము రూ. 1-50. Phone : 229835.

COTTAGE INDUSTRY, (WN-33),
P.B. 1262, Jamuna Road, Delhi - 6.



బాధగా అసహ్యంగా వుండే **గజ్జినుంచి** త్వరగా బయటపడండి.

గజ్జి అంటువ్యాధి. అది మీ కుటుంబంలోని యితరులకు వ్యాపించకుండా వుండేందుకు ముందుగానే, మీరు అమృతాంజన్ లిమిటెడ్‌వారి డెర్మల్ ఆయింటుమెంటును వాడి త్వరగా, పూర్తిగా ఉపశమనం పొందండి. మళ్లీ ఆ అంటువ్యాధి తల యెత్తకుండా వుండాలంటే, మీరు తగిన జాగ్రత్త తీసుకోవడం అవసరం.
అమృతాంజన్ డెర్మల్ ఆయింటుమెంటు డబ్బా ఒకటి ఎప్పుడూ యింట్లో ఉంచుకోండి. అది తామరకూ, పాసినకాళ్లకూ కూడా పనికివస్తుంది.




అమృతాంజన్ లిమిటెడ్ వారి
**డెర్మల్ ఆయింట్‌మెంట్**
అమృతాంజన్ లిమిటెడ్ 14/15, లజ్‌చర్చి రోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.

JWT AM/D/1749




రిస్తున్నారంటె, నా ప్రతిఎంయంలోనూ సలహాలు ఇస్తున్నారంటె అర ముస్నది. వాళ్ళెవరు? నేనెవర్ని? నిజం రావ్......నాఎడల వాళ్లు చూపిస్తున్న ఆదరణకి కరిగిపోతున్నాను. నాకోసం, నా శ్రేయస్సుకోసం ఇప్పుడు నలుగురున్నారు."

పెళ్లి చేసుకోమని మేమిచ్చిన సలహాని దూరంగా నెట్టి, మళ్లీ ఆ మాటంటే సహించేదిలేదని చెప్పిన సారధి ఈనాడు ఇలా మారిపోటానికి కారణం రాజ్యలక్ష్మి, వసంతాను వాడు సెలవలో వచ్చినప్పుడు ఇద్దరూ అడిగారు. పెళ్లి చేసుకుని ఓ ఇంటివాడవై ఆనందాన్ని అనుభవించమని.

ఏది ఏమైనా మా సారధి పెళ్ళికి ఒప్పుకున్నందుకు ఎంతో ఆనందంగా ఉన్నది. ఆఫీసునుంచి త్వరగా ఇంటికి వచ్చాను. బట్టలు మార్చుకుంటూండగా రాజ్యలక్ష్మి నా గదిలోకి వచ్చింది.

"శ్రీవారు ఇవాళ చాలా పెందరాళే వచ్చారే?"

"కారణం చెప్పుకో చూద్దాం."

రెండు క్షణాలు ఏదో ఆలోచించింది. ఆతర్వాత అందంగా కళ్ళు కదిపి, పెదవి విరుస్తూ అన్నది.

"ఊహూ.........మీరే చెప్పండి."

"అవుతేనువ్వోకపని చెయ్యాల్సి ఉంటుందిమరి."

"చెప్పండి."

"ఇవ్వాళ ఓ శుభవార్త పట్టుకొచ్చాను. అది చెప్పాలంటే నాకు అర్జంటుగా ఓ అందమైన కాఫీ కాచి పట్టుకురావాలి."

"ఇంచమున్నమాట."

"ఆహా.. ..అక్షరాలా అంతే లేకపోతే అంత తేలిగ్గా చెప్పే శుభవార్త కాదు. ఊ .కదులు .. .. క్షణంలో కాఫీ పట్టుకు రావాలి మరి. క్విక్"

రాజ్యం నవ్వుకుంటూ వంటగదిలోకివెళ్ళిపోయింది. మరో పదినిమిషాల్లో కాఫీకప్పుతో లోనికివచ్చింది. కాఫీ టీపాయ్‌మీద పెడుతూ, "ఊ ఇంకచెప్పండి" అన్నది తానూ ఓ కుర్చీమీద కూర్చుంటూ

నింపాదిగా కాఫీ తాగాను. వక్కపొడి వేసుకున్నాను. సిగరెట్టుతీసి ముట్టించుకోబోయాను. ఈ ఆలస్యానికి ఆమె చిరుకోపం ప్రదర్శించింది.

"అబ్బ... చంపేస్తున్నారు బాబూ... .చెప్పండి త్వరగా."

ఆమె ఆదుర్దాని పసిగట్టి మరింత ఆలస్యం చెయ్యాలనే ఉద్దేశ్యంకొద్దీ—

"కాస్త ఆగు మరి. సిగరెట్టు వెలిగించుకోవాలా?"

సిగరెట్టు ముట్టించి, గట్టిగా ఓ దమ్ములాగి నెమ్మదిగా పొగ వదిలాను ఆ పొగవంక అలా చూస్తూండిపోయాను. ఈ వరస గమనించిన రాజ్యం గబుక్కున కుర్చీలోంచిలేచి బయటికి వెళ్ళబోయింది.

"అరరె......వెళ్ళిపోతున్నావేమిటీ ఖర్మం; చెప్తున్నానుగా మరి. కూర్చో......"

"నాకేం చెప్పక్కర్లేదు. మీరే దాచుకోండి. లేకపోతేను ఆడించేస్తున్నారు మహా......"

"అబ్బో అంతకోపమైతే ఎలా? సారధి గురించి ఓ మంచివార్త తెలిసింది" అన్నాను.

ఈమాట అనంగానే ఆమె గబగబావచ్చి కుర్చీలో కూర్చుంది.

"ఏమిటది?" అని అడిగింది.

"మరేంలేదు. వాడు పెళ్ళిచేసుకోబోతున్నాట్ట."

"నిజం?" ఆశ్చర్యంగా అడిగింది.

"కావాలిస్తే ఈ ఉత్తరం చదువు" అని సారధి రాసిన ఉత్తరం ఆమెకు ఇచ్చాను. రాజ్యం ఆ ఉత్తరం పూర్తిగా చదివింది.

"సారధికూడా ఓ ఇంటివాడు అవుతున్నాడు. పాపం! అనవసరంగా మధనపడ్డాడు. పోనీలెండి. ఈనాటికైనా ఒప్పుకున్నాడు. అదే చాలు."

*   *   *

సారధి పెళ్ళి సరిగ్గా వారంరోజు లుందనగా మూర్తి తన శ్రీమతితోపాటు మా ఇంటికి వస్తున్నట్టు వైరిచ్చాడు. ఆ సాయంత్రం రాజ్యంతో పాటు స్టేషను కెళ్ళాను. వాళ్ళను రిసీవు చేసుకునేందుకు.

మూర్తివాళ్ళు రైలు దిగారు వాళ్ళనుచూచి చాలా కాలం అయ్యిందేమో—ఇప్పుడు కాస్త కొత్తగా కనిపిస్తున్నారు. బాబిగాడు (మూర్తి సుపుత్రుడు) మునుపటికంటె బొద్దుగా, ముద్దుగా తయారయ్యాడు వసంతచేతిలోంచి నన్ను చూడంగానే కేరింతాలు పెడుతూ నా దగ్గరకు వచ్చాడు. వాడి నలా ఎత్తుకున్నానో, లేదో నా చేతిలోంచి వాడ్ని గబగబా లాక్కుని ముద్దులవర్షం కురిపిస్తోంది రాజ్యం.

"ఏయ్! ముందు వాడ్నిలా ఇవ్వు." అన్నాను.

"పోదురూ.....ఏరా బాబీ.. .మావయ్య చెడ్డోడు గదరా!" అన్నది వాడితో చంటిపిల్లలా.

మా ఇద్దర్నీ చూస్తూ మూర్తిదంపతులు ముసి ముసిగా నవ్వుకున్నారు

"నా అంతటివాడు నేనిలా ప్లాటుఫారమ్మీద నిలబడివుంటే వాడొక్కడే కావలసివచ్చాడా నీకు" అన్నాడు మూర్తి

"అన్నయ్యనైతే అన్నారుగాని, రాజ్యాన్ని చూడండి 'ఏవమ్మా కులాసా' అని పలుకరించడంమాని పసిపిల్లలా వాడితో ఆడుకోడం ఏమైనా బావుందా?"

"ఆ... .నీది మరీ ఛాదస్తం. మాటకుముందు రాజ్యాన్ని దెప్పడం నేర్చుకున్నావ్."

వాళ్ళిద్దరి వాదాన్ని విని మేమూ నవ్వుకున్నాం!

ఇంటికొచ్చేసరికి చీకటిపడింది. స్నానాలూ వగైరా ముగించి రాజ్యం ఇచ్చిన కాఫీ తాగాం.

మూర్తి తాగుతూ అన్నాడు.

"నీచేతిలో అమృతముందమ్మా .. .ఎందుకూ మా ఆవిడా ఉన్నది శుద్ధ దండక్కి. ఆవిడచేతి కాఫీ తాగితే మళ్ళీ జన్మలో కాఫీముఖం చూడరాదని పిస్తుంది. ఆ....."

"అరరే.... అలాగుట్రా—మరిన్నాళ్ళనుంచీ ఎలా తాగుతున్నావో?"

"గతిలేక."

"ఒక్కోసారి 'వాసంతీ నీకు పుణ్యముంటుంది కానీ, కాస్త కాఫీ ఇవ్వవూ ...నీ కాఫీ అమృతం వాసంతీ' అని అడుగుతా రన్నాయ్. అప్పుడేమయ్యిందో ఈ వైరాగ్యం? అదీ అడుగు."

"మరి దీనికి నీ జవాబేమిటోయ్ భగవాన్లూ" అని అడిగాను.

"నీకు తెలీందేముంది రా. రోజుకి రెండుమాట్లు కాఫీ అని మాకు రూలంటూ ఛపాటే ఏడ్చిందిగా. ఒక్కోప్పుడు పొద్దుపోటం నాలుగుసార్లు తాగూ అవి అజ్ఞాపిస్తుంది. అలాంటప్పుడు 'తైరు' కొట్టకపోతే వాధనా? చెప్పు."

మా మాటల్లో మేముండగా అటు రాజ్యం బాబిగాడికి బిస్కట్లు వగైరా పెడుతూ, ఏవో ముద్దుమాటలు నేర్పుతుంది. ఇప్పటివరకూ వాడిని కిందికి దించితే వట్టు. ఇదంతా చూచి వాసంతి అన్నది—

"మా వదినకి వాడంటె ఎంత ఇదండి? ఇప్పట్నుంచే అల్లుడ్ని మంచి చేసుకుంటుంది కాబోలు. అలాగే కానివ్వు వదినా నలాంటిపిల్లను కంటావో గాని అచ్చం అన్నయ్య పోలికలుమాత్రం ఉండాలమ్మోవ్.... .తర్వాత చెప్పలేదని దెప్పితేమాత్రం లాభంలేదు."

రాజ్యం తలదించుకుంది సిగ్గుతో.

—భోజనాలయ్యాయి. నేనూ, మూర్తి డాబా మీద పడుకున్నాం. నిద్రపోయేముందు కాలేజీ రోజులు గురించి చాలాసేపు మాటాడుకున్నాం. చివరికి మా సారధి పెళ్ళివరకూ సాగింది మా శోకాబ్ధి రామాయణం.

సారధిపెళ్ళికి మే మిద్దరమే పెళ్ళిపెద్దలం. అందుచేత ఓ నాలుగురోజుల ముందుగానే ప్రయాణ

"కొత్తమంత్రిగారు ఎలాంటి వారంటారు?"

"చెప్పలేం వారంలో ఆరు రోజులు ఆయ నసలు కనిపించనే కనిపించడు. ఏడో రోజు కని పిస్తాడుగానీ ఏం చెబుతున్నాడో అర్థం కాదు!"

హనుమంతరావు (గూడూరు)

మయ్యాము. వాడు మమ్మల్ని చూడగానే కళ్ళనిండా ఆనందం నింపుకుని అన్నాడు.

"ఒక వారంరోజులు ముందుగా రమ్మంటే ఇదా రావటం అసలు మీరు వస్తారో రారో అని ఇప్పటివరకూ ఎదురుచూస్తున్నాను వచ్చారు. అదే చాలు. రండి......

రాజ్యంచేతిలోవున్న బాబిగాడు వాడివైపు చిత్రంగా చూశాడు "బాబాయిరా...... వెళ్ళు" అన్నది రాజ్యం.

సారధి బాబి నెత్తుకున్నాడు.

"అప్పుడే మరిచావుట్రా......రా...... నీకుబోలు బొమ్మలు కొన్నాను. చూద్దువుగాని రా......" అని గబగబా వాడి నెత్తుకుని లోనికి వెళ్ళిపోయాడు నలుగురమూ కాళ్ళు కడుక్కుని ఇంట్లోకి అడుగు పెట్టాము.

—సారధి తరఫున చుట్టాలంటూ ఎవ్వరూ రాలేదు. వాడి పెళ్ళికి మేము నలుగురమే పెళ్ళిపెద్దలయ్యాము. ఆరాత్రి కమ్మటి కబుర్లతో గడిపాం. తెల్లవారుజామున నాలుగున్నరకు రైలెక్కి ఆ ఉదయం పదిగంటలకు కాబోలు తెనాలి పెళ్ళివారింటికి చేరుకున్నాం.

సారధి మావగారు ఆ ఊళ్లో పేరొందిన లాయరుట ఇద్దరే సంతానం. మొదటమ్మాయికి ఆ క్రితం ఏడాదే పెళ్లయింది. సారధితోపాటు పని చేస్తున్న లోటి శేఖరరుగారు ఈ సమ్మంధం తీసుకొచ్చారుట.

లాయరుగారు బాగా సంపాయించారు. ఆఊళ్లో పెద్ద భవంతి ఒకటి కట్టించారు. ఆఊరులో పాతికెకరాలు దాదాపు భూమి కొన్నారుట. ఆయనకున్న పిల్లల నిద్దర్నీ బి. ఏ. వరకూ చదివించారు. మొదటమ్మాయిని గుంటూర్లో డాక్టరికిచ్చారు

పెళ్ళిపందిరి సందడిగా అందంగా ఉన్నది. మంగళవాయిద్యాలు మ్రోగుతుండగా, పురోహితులు మంత్రాలు చదువుతూండగా—మా సారధి మాలతిమెళ్ళో మంగళసూత్రం కట్టాడు.

ఇప్పుడు సారధి ఓ ఇంటివా డయ్యాడు!

జీవితంలో ఓడిపోయాడనుకున్నాం. చింత పెట్టుకుని మిగిలిన జీవితంలో చిచ్చు చేతులారా తానే పెట్టుకున్నాడనుకున్నాం. వాడి కిహ వెలుగంటూ ఉన్నదా అని వాపోయాం. నేటికి వాడింట్లో దీపం వెలిగింది! జీవితంలో సుఖం దొరికింది!

మాలతిద్వారానైనా గతాన్ని మరచి, మళ్ళీ మనిషిగా తయారవుతాడు ఇది చాలు.

పెళ్ళిపందిట్లో, రాజ్యం, వాసంతిల హడావిడి ఇంతా అంతా కాదు. ఎక్కడ చూచినా వాళ్ళే. పెళ్ళి కొడుకుతరఫున ముఖ్యమైనపాత్ర తీసుకున్నదీ వాళ్లే—లాంఛనాలూ వగైరా గట్టిగాచెప్పి చేయించుకున్నారు. వీళ్ళద్దరి హంగామా చూస్తుంటె ఓపక్క నవ్వూ, మరోపక్క ఆనందమూ కలిగింది.

సారధిపెళ్ళి నిర్విఘ్నంగా జరిగింది! మూర్తి అన్నాడు—"ఈ పిల్లయినా మనవాడ్ని ఓదారికి తీసుకొస్తుందని ఆశిద్దాం. వాడి సుఖమంతా ఆమె చేతిలోనే వున్నది" నిజమే మరి

ఆ సాయంత్రం విడిదింట్లో నేనూ, మూర్తి, సారధి పిచ్చాపాటి మాటాడుకుంటూండగా వాసంతి హడావిడిగా వచ్చింది

"పాపం! ...మాలతికి ఫిట్టొచ్చిందిట. డాక్టరుకి కబురంపారు. ఇంకా స్పృహరాలేదు. రండి. చూచి వద్దాం" అన్నది.

ఈ వార్త వినగానే మూర్తి, నేనూ గబగబా బయటకు వచ్చాం వాసంతితోపాటు. వరండాలో కాలుకాలిన పిల్లిలా ఆదుర్దాగా తిరుగుతున్నాడు లాయరు. మమ్మల్ని చూస్తూ అన్నారు.

"అబ్బే.. ...మరేం ఎర్వాలేదండి. నాలుగు రోజుల్నుంచీ ఆ పిల్లకి వంట్లో బావుండలేదు. అందుచేతనే ఇలా జరిగింది. మరో అయిదు నిమిషాల్లో కోలుకుంటుంది లెండి."

రాజ్యం బాబిగాడ్ని ఎత్తుకుని బయటకు వచ్చింది "ఫర్వాలేదు. ఇప్పుడే స్పృహలోకి వచ్చింది"

"చూశారా.. ....నే చెప్పలేదు. నాలుగురోజుల్నుంచీ నలతగా ఉన్నది అంతే." అన్నారు లాయరు నవ్వు తెచ్చుకుంటూ.

తర్వాత కాసేపు మాటాడి విడిదింటికి వచ్చాము. 'మాలతి కెలా వున్నది?' అని నోరు తెరుచుకు అడక్కపోయినా, సారధి ముఖవళికలు అడిగాయి.

"నాలుగు రోజుల్నుంచీ ఆ అమ్మాయి



# వుడ్‌వార్డ్స

'గ్రైప్ వాటర్'

తెలివైన తల్లులు

50 ఏళ్లనుంచి వాడుచున్నారు

ప్రత్యేకాధికారయుత ఏజెంట్లు : శోమల్ మేన్యుఫేక్చరింగ్ కెమిస్ట్స్ లిమిటెడ్ బొంబాయి; ఎమ్.జి. సహాని అండ్ కో., (కలకత్తా) ప్రైవేట్ లిమిటెడ్ కలకత్తా; టి.టి. క్రిష్ణమాచారి అండ్ కో., మద్రాస్; ఎమ్. జి. సహాని అండ్ కో; (ఢిల్లీ) ప్రైవేట్ లిమిటెడ్, ఢిల్లీ.



Aiyars OP. (48 TEL)


## సారధి

సుస్తీగా ఉన్నదిట. అంతే. మరేంపర్వాలేదు. ఇప్పుడు కులాసాగా ఉన్నది" అన్నాడు మూర్తి.

—నెలలు గడిచాయి.

రొటీన్లో పడిపోయాం. ఆఫీసూ, ఇల్లూ—అప్పుడప్పుడూ ఉత్తరాలద్వారా మిత్రుల క్షేమ సమాచారములు కనుక్కోడం. ఇప్పుడు సారధి గురించి వర్రీ అవడం మానుకున్నాం.

రెండురోజులకి రాజ్యం పుట్టింటికి వెడుతున్నదనగా మూర్తిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

"త్వరలో కోడలుపిల్ల పుట్టబోతున్నట్టు తెలిసింది. సంతోషం కానీ—వరేయ్ రావూ—ఈ సంగతి తెలిసిందగ్గర్నుంచీ మీ చెల్లాయి కింద నడవటం లేదనుకో ఎప్పుడూ ఆమె ఆలోచనలన్నీ పుట్టబోయె కోడలిపిల్ల గురించేను. పైగా— మాటామంచీ తెలీని పసివాడికి పదేపదే హెచ్చరించి చెప్తుంది. 'నీకు పెళ్లాం పుట్టబోతోందిరోయ్' అని. ఈ ఆడవాళ్లు బొత్తిగా అల్పసంతోషులోయ్. సారధిగురించి విషయాలు తెలీడంలేదు. నీకు తెలిస్తే రాయి."

ఈ ఉత్తరం తీసుకెళ్ళి రాజ్యం కిచ్చాను చదవమని. ఆమె చదివింది. సిగ్గుతో తన గదిలోకి పారిపోయింది.

—రాజ్యాన్ని రైలెక్కించాను. రైలు కదులుతూండగా అన్నాను. "త్వరలో శుభవార్త రాయి; అల్లుడి తల్లి తండ్రులకి చెప్పాలి. ఏం?"

"పోదురూ."

"కొంపతీసి మగపిల్లవాడ్ని కనేవు. మనవాడు అల్లుడికి మొగుడై పోగలడు. ప్రమాదం."

"అబ్బ......చాల్లేగాని. .. మీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూచుకోండిబాబు. హొటలు భోజనం మీ కసలు పడిచావదు చేతులు కాల్చుకోడం నేర్చుకోండి. ఏం?"

"అహా......రాణిగారి ఆజ్ఞ."

రైలు వెళ్ళిపోయింది. రాజ్యంలేని ఇల్లు బోసిపోయివున్నది. మూర్తికీ, సారధికీ ఉత్తరాలు రాశాను.

* * *

పదిహేనురోజులు ఇలా గిర్రున తిరిగాయో లేదో మూర్తిదగ్గర్నుంచి ఓ చిత్రమైన ఉత్తరం వచ్చింది.

"మొన్నీమధ్యనే సారధిదగ్గర చదువుకున్న కుర్రాడికి మా ఆఫీసులో ఉద్యోగం వచ్చింది. మాటల్లో మనవాడి సంగతి అడిగాను. అతను చెప్పింది వింటూంటె నమ్మాలో, నమ్మకూడదో తెలీడంలేదు. సారధి అక్షరాలా 'హైడ్'లా తయారయ్యాడుట. చూడొద్దామనుకుంటె తీరుబడిలేనంత ఆఫీసు పని నన్నొదిలిపెట్టేట్టు లేదు. నువ్వే వీలుచేసుకుని ఒకసారి సారధిని చూచిరా. వచ్చింతర్వాత ఉత్తరం రాయి."

ఇది చదివి ఆశ్చర్యపోయాను. ఈ విపరీత పరిణామాన్ని ఓ పట్టాన నమ్మలేకపోతున్నాను. పెళ్లి అవుతే సారధి మళ్లీ మనిషిగా ఉంటాడనుకున్నాం. ఇలా ఊహించలేకపోయాం. ఎందుకయ్యిందిలా?

ఆ తర్వాత రోజున సెలవుపెట్టి బయలుదేరాను. ఇంటికి చేరుకునేసరికి బాగా చీకటిపడింది.

ఇంటిముందు రిక్షాదిగి తలుపు తట్టాను. తలుపు తెరుచుకుంది. మాలతి నాముందు నిలబడివున్నది. నన్ను సరిగ్గా పోల్చుకోలేదు కాబోలు—నన్ను చూడగానే తత్తరపాటు చెందింది. నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

"రండి.....ఇంకా ఎవరో అనుకున్నాను" అంది నవ్వుతూ.

లోపలికెళ్ళి కూర్చుంటూ అడిగాను.

"సారధి లేడా?"

"బయటకు వెళ్ళారు. ఇప్పుడే వస్తారు. ఒక్క క్షణం..... నే నిప్పుడే వస్తాను" అంటూ ఆమె వంటగదిలోపలికి వెళ్ళింది.

టీపాయ్‌మీదవున్న పత్రిక చేతుల్లోకి తీసుకున్నాను. పేజీలు తిప్పుతున్నానన్నమాటేగాని, చదవ బుద్ధిపుట్టడంలేదు. మాలతిని చూస్తేనే నాకు ఆశ్చర్యమయ్యింది.

ఆమె బాగా పాలిపోయిఉన్నది. ఆరోగ్యం దెబ్బతిన్న మనిషిలా నీరసంగా ఉన్నది. పెళ్ళినాటికళ ఆమెలో ఇప్పుడు కనుపించడంలేదు. మాలతి గర్భవతి గూడాను.

ఓ పదినిమిషాల్లో మాలతి వంటగదినుంచి బయటకు వచ్చింది.

"పాటు మీగురించి చాలా చెప్తూంటారు" అన్నది.

నేను నవ్వాను.

"మిమ్మల్ని పెళ్ళినాడు చూచానంతే. అందరూ కులాసాయేనాండీ?"

"ఆహా.....అవుతే వాడు ఇప్పటివరకూ ఇంటికి రాకుండా బజార్లో ఏం చేస్తూన్నట్టు?"

"స్నేహితులతోపాటు తిరుగుతున్నారు కాబోలు"

"ఎంత స్నేహితుడైతేమాత్రం ఇంత ఆలస్యంగానా రావటం"

ఆమె పేలవంగా నవ్వింది.

సారధి గురించి మూర్తి రాసింది నిజమా కాదా అని అడుగుదామనిపించింది. కాని—ఎలా మొదలుపెట్టాలో తెలీక రెండు మూడు నిమిషాలు మౌనం వహించాను. ఆమె గూడా ఏం మాటాడలేదు. చివరికి నేనే మాటాడించక తప్పిందికాదు.

"ఈమధ్య వీ డసలు ఉత్తరాలు రాయడమే మానుకున్నాడులా ఉన్నది? కారణం తెలీదు. అదీగాక వీడి గురించి చెడుగా గూడా విన్నాను"

ఈమాట ఆమెను కలతపెట్టిందో ఏమో తెలీదు గాని, చివాలున లేచింది. "వేన్నీళ్ళు దొడ్లో పెడ్తాను. స్నానం చెయ్యండి" అన్నది.

మాలతి పద్ధతి చూస్తూంటే—వాడి విషయం కావాలని దాస్తుందనిపించింది. స్నానం ముగించాను.

భోజనం చెయ్యమని అడిగింది మాలతి. వాడు వచ్చేవరకూ ఉంటానని చెప్పాను.

నాకు కేటాయించిన గదిలో కూర్చుని సిగరెట్టు కాలుస్తూ సారధి గురించి ఆలోచించడం ప్రారంభించాను. తొమ్మిదిన్నరయినా వాడు రాలేదు. రోజూ ఇంతే కాబోలు!

పదిగూడా అయింది. రాలేదు. అప్పటికే రెండుమూడుసార్లు నన్ను భోజనానికి పిలిచింది మాలతి. కాని వాడు వచ్చేంతవరకూ భోజనం చెయ్యనని చెప్పాను. నన్ను భోజనం చెయ్యమని అడుగుతుందేగాని వాడు ఆలస్యంగా రావటానికి కారణం మాత్రం చెప్పటంలేదు.

పది దాటేంతర్వాత కాబోలు — 'ఫెడీ'మని శబ్దం వినిపించింది. ఉలిక్కిపడి గబగబా వాగది గుమ్మందగ్గరకొచ్చి నిలబడ్డాను.

సారధి వచ్చాడు!

తలుపుని విసురుగా లాగి కొట్టాడు. నడువబోయాడు. కాని పట్టుతప్పిందికాబోలు వరండాలో వున్న బల్లమీద పడబోయాడు. అంతలోనే చేతుల్తో బల్లని పట్టుకున్నాడు. 'ఫ్లవర్‌వాజ్' చేతికి తగిలింది. 'వాజ్'లో పూలు ఓచేతిలోకి తీసుకున్నాడు. మరోచేతితో వాజ్‌ని విసిరి అవతలకు గిరవాటువేశాడు. పూలని చేత్తో నలిపి కింద పారేశాడు.

తర్వాత తనకు ముందున్న గదిలోకి నడిచాడు తూలుకుంటూ. చక్కగా డిజైన్ వేసివున్న డోర్‌కర్టను ముఖానికి అడ్డుపడింది. కోపం వచ్చింది కాబోలు — కర్టన్ లాగి చించిపారేశాడు. గబగబా తనగదిలోకి వెళ్ళిపోయాడు.

ఒక నిమిషంపాటు నిశ్శబ్దం. తర్వాత చెవులు బద్దలయ్యేంత ఫుల్‌వాల్యూమ్‌లో రేడియో ఆన్‌చేశాడు. అలా ఓక్షణంపాటు జరిగినతర్వాత సడన్‌గా ఆఫ్‌చేశాడు.

ఇదంతా చూస్తూంటే ఆశ్చర్యంగావుంది. ఏమిటి వీడు ఇలా తయారయ్యాడు? సారధి నిజంగానే 'హైడ్' అయ్యాడా?

నాకు ఎదురుగావున్న గదిగుమ్మందగ్గర మాలతి కళ్ళలో నీళ్ళునింపుకుని నిలబడింది. అప్పుడప్పుడు జాలిగా నావంక చూస్తుంది.

ఇంక సారధి వింతచేష్టలు చూడలేకపోయాను. గబగబా వాడిగదిలోకి వెళ్ళాను. వాడు నారాకను గమనించలేదు. కిటికీదగ్గర అటువైపు తిరిగి నిలబడి ఉన్నాడు.

"సారధీ." పిలిచాను.

గిరుక్కున వెనక్కుతిరిగి చూశాడు. వాడిచేతిలో గ్లాసువున్నది. నన్ను చూడగానే ఆశ్చర్యపోయాడు. చేతిలోని గ్లాసు కిటికీలోపెట్టాడు. మూతి తుడుచుకున్నాడు. కొన్నిక్షణాలవరకూ బొమ్మలా నిలబడి తర్వాత నిమ్మదిగా అన్నాడు.

"ఎప్పుడు వచ్చావ్?"

"వచ్చి చాలాసేపయింది. నువ్వు దారుణంగా మారిపోయావని తెలిసింది. అదెంతవరకు నిజమో తెలుసుకుందామని వచ్చాను. ఇప్పటివరకూ నువ్వు చేస్తున్న పిచ్చిచేష్టలు చూశాను."

వాడు పేలవంగా నవ్వాడు. కొంత నిర్లక్ష్యంగా ఉన్న దానవ్వు. దగ్గరకు వెళ్ళాను. కిటికీలో సీసా, గ్లాసూ చూశాను.

"ఏమిటిదీ?"

"అబ్బే.... ఏంలేదు." వాడు మాటాడుతూంటే గుప్పున వాసనకొట్టింది.

సారధి తాగివున్నాడు. నాలో కోపం కట్టలు తెంచుకున్నది. వాడి చెంపమీద ఫెళ్ళున ఓపెట్టు పెట్టాను.

సారధి తలదించుకున్నాడు. చేతితో చెంపను తడుముకుంటున్నాడు.

"నే విన్నది నిజమని ప్రత్యక్షంగా తెలుసుకున్నాను. ఎందుకిలా దిగజారిపోయావ్?"

వాడు నా కళ్ళలోకి తిన్నగా చూశాడు. జవాబు చెప్పలేదు.

"నీతిపాఠాలు ఇన్నాళ్ళు బోధించినవాడివి—నువ్వెందుకిలా మారావ్?"

వాడి కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"ఛీ .... పైగా కన్నీరెందుకోయ్. నటన. తాగడం — ఇన్ని పిచ్చివేషాలెయ్యడం, ఇవన్నీ ఎవడో భ్రష్టుడు చెయ్యాల్సినపనులు. నీ కేం తక్కువైందని ఇలా తయారయ్యావ్. సిగ్గులేదు."

అప్పటిగ్గూడా వాడు మాటాడలేదు.

"చాలిది. నువ్వు మళ్ళీ మా సారధిలా మారినదాకా ఈ గడప తొక్కను. అంతవరకూ నువ్వు నాకూ, నేను నీకూ దూరంగా ఉండాల్సిందే. వస్తాను." అని బయటకు నడిచాను.

మాలతి తనముఖాన్ని చేతుల్లోదాచుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నది. పాపం!— వాడి ఈ చర్యతో ఆమె ఎంత కృంగిపోయిందో!

ఇంటికి వచ్చి, సారధి పరిస్థితి తెలియజేస్తూ మూర్తికి ఉత్తరంరాశాను. చివరికి మా సారధి భ్రష్టుడయ్యాడు.

ఇలా అవుతాడని కల్లోకూడా తలవలేదు.

* * *

మా ఆఫీసరు ట్రాన్స్‌ఫరై వెడుతూంటే— ఆయన్ను స్టేషనువరకూ సాగనంపటానికి వెళ్ళాను. ఆయన కంపార్టుమెంటులో కాలుపెట్టినతర్వాత ఆయనదగ్గర సెలవుపుచ్చుకుని వచ్చేస్తూండగా ఓ కంపార్టుమెంటులో మాలతి కనుపించింది. ఆశ్చర్యపోయాను. గబగబా అక్కడకు వెళ్ళాను.

"ఏమి టిలా బయలుదేరారు?" అనడిగాను. ఆమె కొంచెం చలించింది. జవాబుమాత్రం చెప్పలేదు.

"మా సారధి రావడంలేదా?"

"ఊహూ......రావడంలేదు."

"తెనాలి వెడుతున్నారా?"

"ఊ......"

"మావాడిపద్ధతి ఇంకా అలాగే ఉన్నదా?"

"దానికి కారణం నేను" అన్నది గాద్గదికంగా.

ఉలిక్కిపడ్డాను.

"తప్పు చేసింది నేను. ఆయన చాలా మంచివారు. ద్రోహం చేశాను. ఆయన మనసు పాడుచేశాను."

దీంతో మరింత ఆశ్చర్యం కలిగింది.

"ఆయన్ను క్షమించండి. ఆయన్ను బాగుచేసే భారం మీ మీదనే వదలిపెడ్తున్నాను" అన్నది ముఖం అటువైపు తిప్పుకుని.

రైలు కదిలి వెళ్ళిపోయింది!

ఆమె వింతవాగ్ధోరణిని ఆలోచిస్తూ ఇంటికి వచ్చాను. ఎన్నో ఆలోచనలు. ఒక్కదానికీ సరైన రూపంలేదు. మాలతి ఎందుకిలా అన్నది? మా సారధి మారిపోటానికి ఎలా కారణమైనది? మాలతి మావాడికి చేసిన ద్రోహం ఏమిటి? అన్నీ యక్షప్రశ్నలు—

—నాలుగురోజులు గడిచాయో లేదో మూర్తి ఓనాడు మా ఇంటికి వచ్చాడు. వెంటనే సారధి దగ్గరకు వెడదాం పదమని తొందరపెట్టాడు. అసలు జరిగిందేమిటో చెప్పమన్నాను. సారధి వాడి ఉద్యోగ

క్యాలెండర్లు

నాణ్యమైన ఫోటో ఆఫ్‌సెట్ క్యాలెండర్లను మాయొద్ద సంప్రదించండి. క్యాలెండరు బొమ్మలను క్యాలెండరు మ్యానుఫ్యాక్చర్లకు, ప్రింటర్లకు ప్రత్యేక ధరలకు సప్లయి చేయుదుము.
మంచికమీషను పైపని చేయుటకు సమర్థులైన ఏజంట్లు కావలెను. వ్రాయండి.

ELITE CALENDAR Co.,
P. B. 1927, MADRAS-1



పొడుగు పెరగండి



సరిక్రొత్త దేహపరిశ్రమలు ఆహార నియమములు పాటించి, పొడుగు పెరిగి, ఆరోగ్యవంతులుగా ఉండండి. వివరములు ఉచితముగా పంపబడును.

TOTAL HEALTH FOR ALL
283, Azad Market (A. P. M.)
Delhi.



పండిత డి.గోపాలాచార్యులవారి
అరుణ
స్త్రీల ఆరోగ్యసౌభాగ్యాలకు
ఆయుర్వేదాశ్రమం ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు-17



శ్రీబాలాంజనేయ ప్రశ్న

సంతానము, రోగములు, గృహబాధలు, వివాహం, పారిపోయిన పశువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలించిన సొమ్ము, వీడిపోయినభార్య మీరు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలను. రూ 2 ఎం.ఓ. చేయండి. నెలవారీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము రూ 2. పూర్తి పేరు, జాబు వ్రాసిన టైము తెలిపిన చాలును.

హనుమాన్ జ్యోతిషాలయము,
10వ లైను,అరండల్ పేట, గుంటూరు2.


# సారధి

నికి రాజీనామారాసి ఇచ్చాడుట. అదిరిపడ్డాను. మూర్తితోపాటు సారధి దగ్గరకి ఆక్షణమే బయలు దేరాను.

సారధి యింటికి తాళంవేసి ఉన్నది. గబగబా వాడి కాలేజికి వెళ్లాము. రాజీనామా ఇవ్వడానికి కారణమేమిటని అడిగాము. వాళ్ల చెప్పింది వింటూంటే నమ్మాలో, నమ్మకూడదోననిపించింది.

వాడు ఈమధ్య చాలా అసభ్యంగా ప్రవర్తించాట్ట. విపరీతంగా తాగి, క్లాసులకు వచ్చేవాట్ట. పిచ్చిగా తనిష్టంవచ్చినట్టు పాఠం చెప్పేవాట్ట. విద్యార్థులు ఈ చర్యని అరికట్టమని యాజమాన్య సంఘానికి తెలియజేశారుట. ఒకటికి రెండుసార్లు వాళ్ల సారధిని హెచ్చరించారుట గూడాను. చదువు కున్నవాళ్లు, పదిమందికి చెప్తున్నవాళ్లు, సంస్కారమూ, సభ్యతా తెలిసినవాళ్లే ఇలా చెయ్యడం తగదని మందలించారుట. మరోసారి ఇలా జరుగుతే తగుచర్య తీసుకోడం జరుగుతుందని హెచ్చరించారుట. రెండురోజుల్రకితం తను ఇలాటి పవిత్రమైన ఉద్యోగానికి తగనని రాజీనామా రాసి ఇచ్చాట్ట. అంత మంచిమనిషి ఇంత దారుణంగా మారినందుకు ఇప్పటికీ ఆశ్చర్యంగా ఉన్నదని చెప్పారు.

నీతిగా బ్రతకడమే తన ధ్యేయంగా పెట్టుకున్న మా సారధి దిగజారిపోయాడు. తాగుడు నేర్చుకున్నాడు అసభ్యంగా ప్రవర్తించాడు

వాడు ఏకారణం లేకుండా ఇంత హఠాత్తుగా మారిపోడు. ఏదో కారణం ఉండిఉంటుంది. అదేమిటి?

ఆ రాత్రికి రాత్రే తిరుగుప్రయాణం పట్టాము మేము. ఇల్లు చేరుకునేసరికి మా పక్కింటాయన నచ్చారు.

"ఎవరో సారధిట. మీరు వచ్చినతర్వాత ఈ ఉత్తరం ఇవ్వమని చెప్పివెళ్ళాడు. తీసుకోండి" ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోయారు.

ఉత్తరాన్ని ఆత్రంగా విప్పి చదివాను. కుప్పలా కూలిపోయాను.

డియర్ రావ్;

నా కథ ఇప్పటికి చాలావరకు తెలుసుకునేఉంటావు. నే నిలా మారిపోయినందుకు కారణం తెలీదు నీకు

ఒక మలుపులో కాకపోయినా, మరో మలుపులోనైనా సుఖిద్దామన్న ఆశకొద్దీ పెళ్లి చేసుకున్నాను నే నింత దిగజారిపోయినందుకు ఒకవిధంగా మాలతి కారణం. ఇది నిందమాత్రం కాదు.

మాలతిని 'క్షమించ' కలిగే సహృదయం నాకున్నది. నన్ను నేను శిక్షించుకోడం పొరపాటే. అయినా ఇది నా బలహీనత. తప్పదు మరి.

నీతికి, కట్టుబాట్లకు దూరంగా తిరిగే మనుషులంటే నాకు గిట్టదని నీకు తెలుసు. మీ కందరికీ కష్టం కలిగించే ఈ సెంటిమెంటు చివరికి నా జీవితాన్నే పాడుచేసింది దీనికితోడు ఎన్నాళ్లనుంచో మరుగుపడ్డ వ్యక్తిగతమైన బలహీనత తోడయ్యింది. ఫలితం ఈనాటి నేను!

పెళ్ళయిన మొదటిరోజున మాలతికి ఫిట్సు వచ్చింది. అప్పటికి మామయ్య ఏదో సర్దిచెప్పాడు. ఆరోజు గడిచిపోయింది. అది లగాయితూ నేటివరకూ ఆమెకు తరచూ సరిగ్గా అలాంటి ఫిట్సు రావడం జరుగుతుంది.

ఇది 'ఫిట్సని' చెప్పటం భావ్యం కాదేమో.....

ఒకనాటి అమావాస్యచీకటిలో ఆమె శీలాన్ని ఒక పిరికివాడు హరించాడు. మాలతిని మాయమాటలుచెప్పి లొంగదీసుకున్నాడు. ఇప్పుడామె గర్భంలో పెరుగుతూన్న పాప ఆ దుర్మార్గుడిదేను.

ఈ రహస్యం నాదగ్గర చాలాకాలం దాచింది మాలతి. ఒకనాడుగూడా ఆమె నాకు భార్యగా ఉండలేదు. అధవా—ఉండాలనుకున్నా, వెంటనే 'ఫిట్సు' వచ్చేది ఆతర్వాత స్పృహవచ్చిన తర్వాత కన్నీరు పెట్టుకునేది

ఓ నాడు తప్పనిసరై చెప్పుకుంది అంతే—మామధ్య అనుబంధం తెగిపోయింది

మానసికంగా బాధని అనుభవించాను ఆమె నాకు మోసం చేసింది. నిలువెల్లా కంపించిపోయేవాడ్ని. సాధ్యమైనంతవరకూ ఆమెకూడా నానుంచి తప్పించుకు తిరిగేది.

ఇలా ఎన్నాళ్ళు సాగిస్తాం మా సంసారం?

అయిపోయింది. ఎన్నో కలలుకని, ఆశలు పెంచుకున్న పచ్చటి జీవితం బీటలువారింది.

మాలతిమీద అసహ్యం రోజురోజుకీ పెరిగిపోతున్నది ఆమె నాకు చెప్పకపోతే—నా కథ మరోలా జరిగేదేమో. కాని ఆమె చెప్పింది! అందుకోసమైనా ఆమెను 'క్షమించాల్సిన' బాధ్యత నాకున్నది.

అయితే నా మనసు కేమి సమాధానం చెప్పుకోను? తాగడం నేర్చుకున్నాను ఇష్టం వచ్చినట్టు తిరగడం మొదలుపెట్టాను.

ఇదే నాలో ఇన్నాళ్లూ దాగిన బలహీనత! ఈనాడు ఇలా విజృంభించింది.

చాలామందిలోలేని విశిష్ట గుణాలు నాలో ఉన్నందుకు గర్వించేవాడిని పొగడ ఇప్పుడు వాటికి రాజీనామా ఇచ్చాను.

అందరికంటె తక్కువగా బ్రతుకుతున్నాను.

మొన్నిమధ్యనే మాలతి వెళ్లిపోయింది. వాళ్లనాన్నగారింటికి వెళ్ళిందేమో అనుకున్నాను. కాని—అక్కడకూ్కడా రాలేదుట. అప్పుడప్పుడూ అనేది. 'మీలాటి పవిత్రులదగ్గర నాకు చోటులేదు. ఇలా బ్రతకలేన'ని.

పాపం—ఎక్కడో ఓ మారుమూల దిక్కుమాలిన చావుకి నోచుకుందేమోనని అనుమానం నాకు.

నేనూ వెడుతున్నాను. తీర్థయాత్రలవల్ల సుఖం లభిస్తే—అదే నాజీవితానికి చివరిసుఖమనుకుంటాను అదీకాకపోతే ఈ పాడుబ్రతుక్కి అతి త్వరలోనే స్వస్తి పలుకుతాను.

చివరిసారిగా మిమ్మల్ని కలుసుకోలేకపోయినందుకు చింతగా ఉన్నా, ఒకవిధంగా సంతోషిస్తాను. ఏమంటే—ఈ స్థితిలో నా ముఖం మీకు చూపించడం నా కిష్టంలేదు. సెలవింక.

మీ
సారధి.

ఉత్తరం చదవడం పూర్తయిన తర్వాత మూర్తికి ఇచ్చాను చదవమని. వాడు చదివి కళ్లనీళ్లు నింపుకుంటూ అన్నాడు. "మనవాడు అనుభవించడానికి పుట్టలేదురా రావ్!"

అదే అనిపించింది నాకూను. ★

# మనమూ-మనదేహస్థితి

31-వ పేజీ తరువాయి

మన్, మానసికలక్షణములు అతి ప్రధానములని నిర్ణయించాడు. గత మహాయుద్ధంలో అనేకమంది జఠరాశయములు గాయపడినప్పుడు వివిధ మన స్థితులలో జఠరాశయ కార్యక్రమము ఎల్లా మారుతూ ఉంటుందో తెలుసుకుంటానికి చాలా అవకాశములు కలిగినవి. ఆ పరిశోధనలవల్ల సంతోషం, దుఃఖం, కోపం, నిరుత్సాహంవంటి మానసికపరిస్థితులలో జఠరాశయంలో ప్రవహించే రక్తపరిమాణము, దాని చలనము, దాని స్పందనములు, ఎన్నో మార్పులను చెందుతవనీ, ఆ మార్పులు తాత్కాలికములుకాక, శాశ్వతములైనప్పుడు, ఒక్క జఠరాశయమేకాదు, జీర్ణకోశములో అన్ని భాగములూ వ్యాధిగ్రస్తములు కావచ్చుననీ, వైద్యశాస్త్రజ్ఞులు ప్రయోగరీత్యా నిరూపించారు.

విపరీతమైన ఆందోళన కలిగినప్పుడు జఠరాశయం మ్యూకస్‌మెంబ్రేనులో రక్తనాళములు విస్తరించి, ఎర్రబడి, బిరుసెక్కి, దాని మందము అధికమై, 'ఇన్‌ఫ్లేం' అయినప్పుడు ఉన్నట్లుగా కనుపిస్తుంది. ఆ స్థితిలో ప్రతి చిన్న బాధాకారణం, అధికబాధను కలిగిస్తుంది. అతి శీఘ్రకాలంలోనే అజీర్తి ఏర్పడుతుంది. ఆ స్థితిలో జఠరాశయం మ్యూకస్‌పొరకు ఏమాత్రం అపాయం, రాపిడి ఏర్పడ్డా అది నెరివిచ్చి, క్రమంగా అల్సర్లు ఏర్పడతవి. అన్ని మానసిక పరిస్థితులలో ఆందోళన (Anxiety) అతి ప్రమాదకరమైనది. నిరుద్యోగము, ఆశాభంగము, ఆత్మనింద, పరోత్కర్షలకు కారణభూతమైన న్యూనభావము (Inferiority complex) భరించరాని, సహించరాని, విస్మరించరాని, గృహచ్ఛిద్రములు ఉద్యోగ పరిస్థితులు, విడదీయరాని చిక్కులు, యాంత్రికవేగంతో ఉత్పత్తి అవుతున్న ఈ కాలంలో అర్థంకాని జీర్ణకోశవ్యాధు లెన్నో అంకురించి, రోగుల్నీ, వైద్యుల్నీకూడా కలవరపెడుతున్నవి మన పూర్వుల కిన్ని జీర్ణకోశవ్యాధు లుండేవికావు. ఈశ్వరుడిచ్చినదానితో తృప్తిపడుతూ, సహజమైన నేలలో సహజములయిన ఎరువులతో సమృద్ధిగా సత్వసహితంగా పండిన ధాన్యములనూ, శాకములనూ, పచ్చగడ్డి తిని బ్రతికే పశువు లిచ్చిన పాలనూ ఆహారంగా తీసుకుంటూ, జీవితంలో లోట్లు పూర్వకర్మకు ఫలితములని మనస్సును సమాధానపరచుకుని, శాంతంగా, సంతృప్తిగా ప్రజలు జీవించిన కాలంలో ఇన్ని జీర్ణకోశవ్యాధులు ఉండేవికావు. ఏనాడు ఉద్యోగం పోతుందో, ఏనాడు బ్రతుకు బజారునపడుతుందో అని ఆందోళనపడే ఉద్యోగులూ, ఏనాడు వ్యాపారం పల్టీకొట్టి దివాలా ఎత్తుతామో అనే వ్యాపారస్తులూ, ఏనాడు ఏటంబాంబు పడి బూడిద అయిపోతామో అనే దేశవాసులూ నిండిపోతున్న ఈ ప్రపంచజీవితంలో ఆందోళనకూ, ఆవేదనలకూ ఉన్న అవకాశం ఎక్కువైపోతున్నది. అవసరాలమీద వాంఛకంటె ఆడంబరాలమీద వాంఛ అధికం అయినప్పుడు, అభిరుచులూ, మానసిక వైఖరులూ మారిపోయినప్పుడు అభిప్రాయ భేదములు అధికమైనప్పుడు, దరిద్రం తాండవిస్తున్నప్పుడు, తండ్రీ కొడుకులమధ్య, భార్యాభర్తలమధ్య, అన్నదమ్ములమధ్య, ప్రాణస్నేహితుల మధ్య ఉండవలసిన పవిత్ర సంబంధములు బాధాకరంగామారి, అనేక శరీరవ్యాధులు ఏర్పరుస్తున్నవి. హృదయమూ, జీర్ణకోశమూ మనస్థితితో మారినట్లుగా, ఇతర అవయములు మారవు. జీర్ణకోశంలో జఠరాశయంలో ఏసిడ్ ఉన్నందున అక్కడ ఉండే మ్యూకస్‌పొరకు ఏమాత్రం అపాయం కలిగినా 'అల్సరు' వెంటనే ఏర్పడుతుంది. సంపన్నులయినంతమాత్రాన శాంతిఉంటుందనుకోడం పొరపాటు. జీవితరంగంలో రక రకాల పోటీలు, కుట్రలు, విరుద్ధ స్వభావాలూ, ద్వేషాగ్నులూ, వ్యాజ్యాలూ జీవితవిషయాల్లో భేద వైఖరులూ ఎన్నో వారినీ పీడిస్తూనే ఉంటవి.

దైహిక, మానసిక పరిశ్రమతో డస్సిపోవడం, తగినంత విశ్రాంతీ, కమ్మని నిద్రా లేకపోవడం, ఆహారం పుష్టికరంగా లేకపోవడం, నిత్యమూ వృద్ధిచెందే రకరకములయిన క్రిమివ్యాధులూ, జీర్ణకోశమును తరుచు వ్యాధిగ్రస్తమును చేస్తున్నవి. కాని ఎంత వృద్ధులయినా, ఎంత తీవ్రమయిన క్రిమిదోషమునకు లోనయినవారలయినా, శాంతిమయమైన మనస్థితీ ఆశాజనకమయిన సంతృప్తీ ఉంటే, వారి జఠరాశయమునూ జీర్ణకోశమునూ ఆరోగ్య పరిస్థితులు ఏమీ చేయలేవని శాస్త్రజ్ఞులు అనుభవరీత్యా నిరూపించారు.

శరీరంలో ఎక్కడయినా దుర్భరమైన బాధ కలిగినప్పుడు, జఠరాశయంలో రోగలక్షణములు వెంటనే ఏర్పడవచ్చును. జుగుప్సతోనూ, హృదయశూలలోనూ (Heart pain) ఎప్పెండిసైటిస్‌తోనూ, వాంతి రావడానికి కారణం ఇదే. జీర్ణకోశంలో ఏభాగంలోనయినా విపరీతమయిన బాధ వున్నప్పుడు, తరంగచలనము అనులోమంగా ఉండక విలోమంగా ఏర్పడుతుంది. ఈ స్థితిని ఏంటీ పెరిస్టాలిసిస్ (Antiperistalisis) అంటారు ఈ విలోమతరంగచలనము బాధాస్థానం నుంచి ప్రారంభిస్తుంది. వాంతిగా వెళ్లిపోయే పదార్థముల స్వరూప స్వభావములు, బాధాస్థానమునుబట్టీ, విలోమతరంగ చలనము తీవ్రతనుబట్టీ మారుతూ ఉంటవి. బాధపడేవారికి ఆహారంమీద ఎంతమాత్రమూ ప్రీతి ఉండదు. బలవంతంగా ఇస్తే వాంతి అయిపోతుంది. బాధ అధికమౌతుంది. ఆస్థితిలో ఆహారం ఇతర మార్గములద్వారా సరఫరాచేయవలసి ఉంటుంది. అజ్ఞానజనితమైన ప్రేమతో బాధపడేవారిని "ఇది కాస్త పుచ్చుకో, అది కాస్త పుచ్చుకో" అని ఒత్తిడిచేసే అమాయకులు ఇది ముఖ్యంగా గమనించాలి.

శరీరంలో ఒకభాగంలో ఏర్పడిన పరిస్థితికి ఫలితంగా మరొకభాగంలో ఏర్పడే రియాక్షనుకు కారణం "రిఫ్లెక్సు ఏక్షను (Reflex Action). జఠరాశయ వ్యాధులలో చాలా లక్షణములు రిఫ్లెక్సుగానే ఏర్పడతవి ఆ విషయం వచ్చేవారం చర్చిస్తాను.

★



కూర్చున్నా, నిలుచున్నా తల్లి జ్ఞాపకాలు ఇంది రను బాధపెట్టేవి.

బీరువానిండా ఉన్న, సగంకూడా ఖర్చుకానిటానిక్కు సీసాలను చూసి ఇందిర కళ్ళు చెమర్చేవి.

'ఈ టానిక్కులన్నీ అయిపోయేవరకన్నా అమ్మ ఉండకూడదా?' అని బాధపడే దామె హృదయం.

రావుగారు లలితమ్మగారి బట్టలన్నీ తోటలోని స్త్రీలకు పంచిపెట్టారు. నగలుమాత్రం ఇందిర పెళ్ళికోసం దాచారు.

తల్లిపోయిన క్రొత్తలో ఇందిర కృశించిపోయింది. జీవితంలో ఉత్సాహం, ఆసక్తి నశించిపోయాయి. తోటలోకికూడా వెళ్ళకుండా నాలుగయిదురోజులు ఇంట్లోనే ఉండిపోయింది.

అలాంటి సమయంలో కూడా గిరిని నిర్లక్ష్యం చేయలేదు. గిరికోసమే ప్రత్యేకంగా నర్సు ఉన్నా కూడా తమ్ముడి పోషణభారంమాత్రం ఇందిరదే.

తల్లంటే ఏమో తెలియని, తల్లి గుర్తులేని గిరి అక్క వాత్సల్యపు ఒడిలో బొద్దుగా, ముద్దుగా పెరగ సాగాడు.

గిరినుండి వీచే నూతన వాయువులను పీల్చి గిరిరాజు ఆరోగ్యాన్ని నింపుకుని నవచైతన్యంతో మెరవసాగాడు.

కాఫీపూల సువాసన అతని ముఖంలోన్నవుల పువ్వుల్ని పుష్పింపచేసింది. బుగ్గల్లోని ఎరుపును కాఫీపళ్ళలోంచి గుత్తకు తీసుకున్నా డా అనిపించేది.

కాలం గడిచినకొద్దీ ఇందిర దుఃఖావేగం తగ్గుతూ వచ్చింది. ముందులాగానే తోటపనుల్లో శ్రద్ధ వహించ నారంభించింది.

కాని ఇందిర ఇప్పుడు ఒంటరిగా వెళ్లేదికాదు. ఇందిర, గిరి, రావుగార్లు తోటపనుల పర్య వేక్షణకు బయల్దేరేవారు. ఇందిర కత్తి పుచ్చుకుని ముందుగా వెడుతూండేది. రావుగారు కొడుకు నెత్తు కునే నడిచేవారు.

రావుగారు ఊళ్ళో లేనప్పుడు గిరి పుట్టయ్య భుజంమీద సవారీచేసేవాడు.

చెట్లనీడల్లో అతనికి మెత్తటిపక్క సిద్ధపరిచి పడుకోబెట్టి చుట్టూ ఆటవస్తువులు పడేసి పని చూడటానికి వెళ్లేది ఇందిర.

ఐదు నిమిషాల కోసారి వచ్చి తమ్ముడిని పలక రించి వెళ్లేది. కొంచెం ఆలస్యమయితే గిరి దేవు డిచ్చిన గొంతు ఉపయోగించి అక్కను రప్పించు కునేవాడు. అతడి ఆర్భాటానికి భయపడి ఇందిర అంతవరకూ రానిచ్చేదికాదు.

'ఏడిస్తే, అరిస్తే బిడ్డకు ఆయాసమవుతుంది' అని భయపడేది ఇందిర.

ఒకమారు ఇందిర తమ్ముడిని కామగచెట్టు నీడలో పడుకోబెట్టి వెళ్ళింది. కాసేపయ్యాక వచ్చి చూస్తే గిరి ఎండలో ఉన్నాడు.

తానే మరిచి ఎండలో పడుకోబెట్టానో ఏమో నని, ఇందిర సందేహిస్తూఉండగానే గిరి అక్క మొహం చూసి నవ్వుతూ, ముందుకు ప్రాకి తన సాహసకార్యాన్ని ప్రదర్శించాడు.

ఇందిర అనుమానం పరిహారమయింది.

"అబ్బా, దిబ్బప్రదేశమయితే ఏంగతికాను? ఇక

# వెండిమబ్బు

25-వ పేజీ తరువాయి

మీదట వీడిని ఒంటరిగా వదిలి వెళ్ళకూడదు" అను కుంది ఇందిర.

రాత్రి తండ్రిముందు తమ్ముడి సాహసాన్ని వర్ణించింది ఇందిర.

"ఇకనుండి గిరిని తోటకు తీసుకుని వెళ్ళటం అపాయం నాన్నా"— అంది.

"అవునమ్మా. నడక వచ్చేదాకా ఇంట్లోనే ఉండనీ"—అన్నారు రావుగారు.

మరునాడు ఇందిర తమ్ముడిని ఇంట్లోనే వదలి తోటకు వెళ్ళింది. ఇంటికి తిరిగివచ్చేసరికి ఇంట్లో పెద్ద గొడవ లేవదీశాడు గిరి. ఇందిర ఇంటికి తిరిగి వచ్చేసరికి గిరి ఏడ్చి, ఏడ్చి అలసిపోయి నిద్రపోతు న్నాడు.

ఒక పెద్దమనిషి తన సంగీత పాండిత్యాన్ని గూర్చి అదేపనిగా గొప్పలు చెప్పుకుంటున్నాడు. "నా చిన్నతనంలో మా ఊళ్లో వరదలువచ్చాయి. మా నాన్న మంచానికి కరుచుకుపోయా డేమో ప్రవాహంలో కొట్టుకు పోయినా బ్రతికి బయటపడ్డాడు"

"బాగానే ఉంది. కాని ఆ వరదకు మీ సంగీతానికీ సంబంధ మేమిటి?" ఒక శ్రోతకు అను మానం కలిగింది.

"నేనూ ఒక పియానోమీద కూర్చుని మా నాన్న వెంట వెళ్లాను."

జి. రామకృష్ణ (ఆదోని)

"చాలా ఏడ్చాడమ్మా బాబు"—అంది నర్సు.

ఆఖరికి తండ్రి సలహా ప్రకారం ఇందిర నాలుగు వైపులా కటకటాలున్న వెదురు ఉయ్యాల చేయించి దానిని నీడలో వేయించి అందులో గిరిని పడుకో బెట్టి తన పని చూచుకోవటానికి వెళ్లేది.

ఇప్పుడు గిరికి ఉయ్యాల్లో బొమ్మలా పడు కోవటం విసుగనిపించిందేమో, చేతులు, కాళ్ళు కొట్టుకుని అక్కకు తన అసమ్మతి తెలియచేశాడు.

ఇందిర దానిని లెక్కచేయకపోయేసరికి ముక్కును ఉయ్యాలకు రుద్దుకుని, రక్తం తెప్పించుకుని అక్క గమనాన్ని, జాలిని పొంది తానే గెలిచాడు.

"ఇకనుండి వీడిని ఉయ్యాలలో వదిలి వెళ్ళ టానికి వీలులేదు నాన్నా. ఈరోజు ముక్కు గుద్దు కుని రక్తం తెప్పించుకున్నాడు" అని తండ్రితో చెప్పింది ఇందిర.

"ఇంట్లోనే వదిలిపెట్టి వెడితే ఏం?"

"అదే వీలుపడదు నాన్నా, నేను కనిపించకపోతే గుక్కపట్టి ఏడ్చి అలసిపోతాడు. పసివాడిని అంత ఏడిపిస్తే ఎలా నాన్నా?" అంది ఇందిర, ఇంకేం చేయాలో తోచక.

"అయితే వాడిని తీసుకుని తోటంతా ఒక చుట్టు తిప్పి తీసుకువచ్చేయ్. తరువాత కావాలంటే నువ్వు వెళ్ళొచ్చు"—అని సలహా ఇచ్చారు రావు గారు. ఇందిరకు ఇది నచ్చింది.

మర్నాడు ఇందిర గిరిని ఎత్తుకుని బయల్దేరింది.

బొద్దుగా, ఆరోగ్యంగా పెరిగిన బిడ్డను ఎత్తు కుని దిబ్బలు ఎక్కటం, దిగటం చాలా శ్రమ అని పించింది. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది.

ఇందిర ప్రతి చెట్టుముందూ నిల్చుని తమ్ము డికి వాటి పరిచయం చేసింది.

టాంకులోంచి నీరుపారేచోటుకు ఇరుప్రక్కలా కాఫీచెట్లు ఏపుగా పెరిగి, పచ్చటికాయల గుత్తు లతో నిండిఉన్నాయి.

"చూడు కాయలు ఎలా ఉన్నాయో......" అంది ఇందిర.

గిరి వెంటనే ముందుకువంగి ఒక గుత్తిని పట్టు కున్నాడు.

"ఒద్దమ్మా, వదిలేయ్. ఛీ.......ఇలా చేస్తే ఇక మీదట నిన్ను ఇక్కడికి తీసుకొనిరాను చూడు"— అంది ఇందిర.

గిరి గుత్తిని వదల్లేదు. తన చిట్టిపిడికిలితో ఇంకా గట్టిగా పట్టుకొన్నాడు.

ఇందిర నవ్వుతూ, గిరిచెవిలో "ఈ కాయల లోపల ముత్యాలు, రత్నాలు, వజ్ర వైడూర్యాలు ఉన్నాయటరా. అందుకే అలా అంటారు. కాని వాళ్ళకు తెలీదు ముత్యాలు, రత్నాలు ఉండేది కాయలలోకాదూ మెరుపుతార ఉయ్యాలలో అని..." అంటూ గిరిచేతిలోని గుత్తిని మృదువుగా విడి పించింది.

ఎర్రబారిన ఆచేతిని ముద్దుపెట్టుకుని ముందుకు నడిచింది.

దోవలో ఎదురైన పుట్టయ్యను చూసి, "వీడిని తీసుకువెళ్ళు బాబూ. వీడిని ఎత్తుకుని నడవటం నాచేతకాదు" అంది.

"రండి చినబాబూ"—అంటూ చేతులు చాచాడు పుట్టయ్య.

గిరి అతడివైపు తిరిగిచూడనుకూడా చూడలేదు.

"అమ్మాయ్. వాడికి నేను అక్కర్లేదట— చూశావా?" అన్నాడు పుట్టయ్య.

"అవును. నీ పొడుంకు భయపడతాడు గిరి."

"నేనూ వాడి ముఖంమీది పౌడరుకు భయ పడతాను. అయినా అంత పౌడరెందుకు చెప్పు?"

"చెమట గుల్లలు వేయకుండా ఉండాలని వేస్తాను. ఎలా పెరుగుతున్నాడు బాబు?" కాస్త గర్వంగా అడిగింది ఇందిర.

"బాగా బలిసిన అడివి దున్న."

"ఛీ, పాడు! ముద్దులమూటను అడవిదున్నతో పోలిస్తే నీకో ప్రత్యేక నరకం సృష్టించాలనిపిస్తుంది"

"మరి దేనితో పోల్చమంటావు?"

"పువ్వు, ఊహూ...చంద్రుడు...ఊహూ అదీ బాగా లేదు. ఎవరితోనూ పోల్చవద్దు. గిరి గిరే తీసుకెళ్ళు" అంది ఇందిర.

"రా బాబూ. ఇహ ఆపౌడరంతా నా మొహానికి పూస్తాడు. తరువాత మా ఆవిడేమో నన్ను దుయ్య పడుతుంది."

"అవును. అదిమాత్రం ఊరికే అంటుతుందా ఏమిటి? ఆరున్నరంకూతురు నీలితో నువ్వేం తక్కువ ఆటలు ఆడుతావా?"

"ఆపిల్ల నా బిడ్డలాంటిది అమ్మాయ్. నీలి కూడా పౌడర్ పూసుకుంటుంది. కాని నా మొహానికి పౌడర్ పూసే ధైర్యం ఉండేది గిరిబాబుకుమాత్రమే."

ఇందిర నవ్వింది. నిర్మలమైన నవ్వుకు ఏదో ఆలోచన అడ్డుపడింది.

"ఏమయిందమ్మాయ్?"

"ఉత్తరాలు వచ్చాయా?"

రావుగారికి వచ్చినట్టుంది."

మోహనుడు రాశాడేమో! ఇందిర ఇహ అక్కడ నిలువలేకపోయింది.

"రాబాబూ"—పుట్టయ్య గిరికోసం చేతులు చాచాడు.

"ఉద్దులే—నేనే ఇంటికి వెళ్తున్నాను" అంటూ ఇందిర ఇంటిదారిపట్టింది.

తండ్రి స్నానానికి వెళ్ళారు. ఇందిర ఆత్రంగా వెళ్ళి ఉత్తరం అడ్రస్ చూసింది అది మోహనుడిది కాదు

ఇందిర చాలా నిరాశ చెందింది.

# వెండిమబ్బు

కులాసాగా ఉన్నారో లేదో?

కలవరంతో ఇందిరకు ఏంచేయాలో తోచలేదు రేపు పోస్ట్ చూసి కేబుల్‌పంపి క్షేమసమాచారం తెలుసుకోవాలనుకుంది ఇందిర.

మరునాడుకూడా ఇందిరకుగాని, రావుగారికిగాని మోహనుడినుండి ఉత్తరం రాలేదు.

ఇందిర మనస్సు పరిపరివిధాల పోయింది. మోహన్ ఎప్పుడూ ఇంత ఆలస్యం చేయలేదు. ఈమారు ఇలా చేయటానికి కారణం ఏమిటో?

ఇందిరకు రాత్రంతా నిద్రపట్టలేదు.

తెల్లవారగానే తండ్రివద్దకు వెళ్ళి, "నాన్నా వారికో కేబుల్ పంపాలి" అంది.

రావుగారు మాటాడలేదు.

వెంటనే ఇందిరనుండి మోహనుడికి కేబుల్ వెళ్ళింది.

"కంగారుపడవద్దు. చదవాల్సింది ఎక్కువగాఉంది. ఉత్తరం రాయకపోతే ఆరోగ్యంగా ఉన్నాననుకో" అని జవాబు వచ్చింది.

హమ్మయ్య. మోహనుడు క్షేమంగా ఉన్నాడని తెలిసి ఇందిరహృదయం తేలికపడింది.

చదువుమధ్యలో తన కేబుల్‌వెళ్ళి ఎంత కంగారు పెట్టిందో అని తన్ను తానే నిందించుకుంది.

తన ప్రతీజాబులో గిరినిగురించి వివరంగా వ్రాసేది.

'గిరి ఈరోజు బోర్లపడ్డాడు. ముందుకు ప్రాక్కుతున్నాడు. మొహంచూసి నవ్వుతాడు. నేనంటే బాగా గుర్తుపెట్టుకొన్నాడు. నీళ్ళుపోయటం, పాలు పట్టటం అన్నిటికీ నేనే కావాలి. లేకపోతే వినడు. గిరికి ఇప్పుడు పళ్ళు వస్తున్నాయి. అందుకేనేమో వళ్ళు వెచ్చబడింది—చిక్కిపోయాడు—వాడి గుండు ఇప్పుడు నల్ల ఉంగరాలవెంట్రుకలతో నిండిపోతోంది—ఇంక పదిహేనురోజులకు అన్నప్రాశనం—మీరగా ఉంటే బాగుండేది. ఇప్పుడు 'అక్క' అంటున్నాడు"

తమ్ముడి బాలలీలలను గురించి మోహనుడికి గాయటంలో ఇందిరకు అపరిమితానందం కలిగేది. అది చదివి అతడూ అంతే సంతోషపడ్తాడనటంలో ఆమెకు ఏమాత్రం సందేహంలేదు. గిరి ఇప్పుడు ముద్దులు మూటకట్తున్నాడు

తోటకూలీలనుండి రావుగారివరకూ అందగా వాణ్ణి ముద్దుచేసేవారే అందరి భుజాలమీద స్వారీ చేసేవాడు గిరిరాజు.

అతడికి ఎక్కువ ఇష్టమయినవాళ్ళు రావుగారు, ఇందిర. కొడుకు అన్నప్రాశనాన్ని అతివైభవంగా జరిపారు రావుగారు. తోటకూలీలు విందుభోజనం చేసి, బిడ్డను ఆశీర్వదించారు

ఒక్కొక్కమారు ఇందిర నొచ్చుకునేది.

"బిడ్డకు అమ్మఅంటే ఏమో తెలియదుకదా తల్లి లేని అనాధుడు పాపం... .. ..

కూతురిబాధ చూసి రావుగారు ఓదార్చేవారు.

"అనాధంటా వెందుకు ఇందిర? నేనున్నాను. నువ్వున్నావు.... .."

అంతమాత్రాన అమ్మ ఉన్నట్టవుతుందా నాన్నా?" అని ఇందిర అడిగినప్పుడు రావుగారు నిరుత్తరులయ్యేవారు. భార్య జ్ఞాపకంవచ్చి, హృదయం కలతచెంది, ఆ చోటునుండి వెళ్ళిపోయేవారు.

మోహనుడు ఒక్కోసారి తన ఉత్తరాల్లో గిరి యోగక్షేమం విచారించేవాడు అపుడు ఇందిర మోహనుడికి గిరి అంటే ఎంత అభిమానం, ఎంత ప్రేమ అనుకునేది.

"గిరీ! బావ ఉత్తరం రాశారురా. నిన్ను చూడా లనిఉందట......" అని వాడి చెవిలో ఎవరూ లేనపుడు గుసగుసలాడి తృప్తిపడేది.

మోహనుడు తిరిగి వచ్చేరోజు దగ్గరపడుతూ ఉంది. తన వ్యాసంగంలోనూ, శిక్షణలోనూ తగినంత ప్రగతి సంపాదించాడు మోహన్. వెళ్ళేటప్పుడు ఓడలో వెళ్ళిన మోహన్ వచ్చేటప్పుడు కూడా ఓడలోనే తిరిగిరావాలని నిర్ణయముంది.

అతడు విమానంలో రావటానికి అభ్యంతర పెట్టింది ఇందిర. రోజూ వార్తాపత్రికల్లో వచ్చే విమానప్రమాదాల విషయాలు చదివి విమానమంటేనే చాలు భయంతో వణికిపోయేది.

మోహనుడు వచ్చేరోజు దగ్గరపడుతున్న కొలదీ ఇందిరకూ, రావుగారికి సంతోషమూ, వ్యథా రెండూ కలిగాయి.

సుమారు రెండేళ్ళు విదేశంలో ఉండి వస్తున్న కాబోయే భర్తరాక ఇందిర కెంతో ప్రియంగా ఉంది.

అతడు వచ్చినవెంటనే వాళ్ళిద్దరికీ పెళ్ళి జరగటంలో ఏవిధమైన సంశయమూ లేదు.

తన పెళ్ళికాగానే గిరిని, వెండిమబ్బును వదిలి వెళ్ళటమే ఆమెను కొంచెం వ్యధపరిచింది.

## ఈ వేళ

యం. వీరభద్రరావు

గగనాన జాబిల్లి
కొలనులో కలువతో
గోముగా ప్రేమతో
సరసమాడే వేళ!

మునిమాపు వేళలో
కడవ చంకన బెట్టి
నీటికై పడుచుల్లు
ఏటికేగే వేళ

మేతకై వెడలిన
ఆలమందలతోడ
పశులు కాపరి తిరిగి
ఊరు చేరే వేళ

ఆవేళ యీ వేళ
నాలోని కోరికలు
నాగులా నా యెడద
కాటువేసే వేళ!

రావుగారిని ఒప్పించి "గిరి"ని తనతో తీసుకు వెళ్లవచ్చు.

కాని "వెండిమబ్బు"?

"వెండిమబ్బు" గుర్తుకు రాగానే ఆకాశంవైపు దృష్టి సారించి నిల్చోవటం తప్ప వేరే దారి ఉండదు.

నాన్న గిరిని తనతో పంపరేమో?

తను వెళ్లిపోతే తనలా తమ్ముడిని ఎవరు చూస్తారు?

మోహనుడు బొంబాయికి వచ్చేరోజు తెలిసింది. రావుగారు బొంబాయికి వెళ్లటం నిశ్చయమయింది.

ఇందిరకుకూడా తండ్రితో వెళ్లి మోహనుడికి స్వాగతం ఇవ్వాలనే అపేక్ష హృదయంలో ఉంది.

కొన్నిరోజుల్లోనే పెళ్లికూతురు కాబోయే ఇందిరను ఇప్పు డెందుకు ఆయాసపెట్టాలి అని రావుగారి ఆలోచన.

మోహనుడు ఇంకా ఒక వారానికి వస్తాడనగా తండ్రీ కూతుళ్లు మాట్లాడుకొన్నారు.

పుట్టయ్య గిరిని షికారుకు తీసుకుని వెళ్లాడు. ఇందిర గిరికి స్వెట్టరు అల్లుతోంది.

"నేను బొంబాయి వెడతాను. మోహనుడి తల్లిదండ్రులు వస్తారో లేదో తెలియదు. నువ్వూ వస్తావా ఇందిరా?"

ఇందిర సిగ్గుతో,

"నువ్వు ఎలా చెప్తే అలాగే చేద్దాం నాన్నా"—అంది.

తండ్రితో వెళ్లాలని ఉన్నా తన అపేక్షను నోటితో చెప్పలేకపోయింది.

మోహనుడు—అసలే మనోహరుడు.

ఇప్పు డెలా ఉన్నాడో?

అతడిని చూడాలని ఆమెకన్నులు తపిస్తున్నాయి. అతడి ప్రేమపూరిత వచనాలకోసం ఆమెచెవులు తపిస్తున్నాయి. అతడి హృదయంతో ఏకమవటాని కామె హృదయం తపిస్తోంది.

"అమ్మ ఉంటే ఎంత సంతోషించేదో?". అన్న బాధమాత్రం ఆమె అంతరంగాన్ని కెలుకుతూనే ఉంది.

"నువ్వు రావచ్చు. కాని గిరిని ఏం చేద్దాం?" అన్న రావుగారి మాటలతో ఈ లోకంలో పడ్డది ఇందిర.

"గిరినీ తీసుకుని వెళ్లచ్చు. కాని పసివాడు వాడికి ఆయాసమవుతుందేమో" — ఇందిర ఎటూ కాకుండా మాట్లాడింది.

"అవును. నే నొక్కడినే వెడతాను. నువ్వు లేకుంటే గిరిని పట్టేవాళ్లు ఉండరు. నువ్వు అత్తారింటికి వెళ్లిపోయాక గిరిని ఎలా చూసుకోవాలో అని ఇప్పటినుండి బెంగగా ఉంది నాకు. ఆ బెంగతో రాత్రిళ్లు నిద్రే పట్టటంలేదు." అన్నారు రావుగారు ఆరాటంతో.

ఇందిర నవ్వుతూ అంది.

"అంత ఆలోచ నెందుకు నాన్నా? నేనే ఉపాయం చెప్పనా?"

"ఊఁ"—రావుగారు కుతూహలంతో అడిగారు.

"గిరినీ నాతో తీసుకుని వెడతాను నాన్నా."

రావుగారి మొహం రంగుమారింది.

"అలా వీల్లేదమ్మా."

"ఎందుకు నాన్నా? నా ఇంట్లో గిరికి ఆమాత్రం స్థానంలేదా?"

"ఇది స్థానంప్రశ్న కాదమ్మా. నిన్నూ పంపించి, గిరికూడా లేక నన్నొక్కడినే ఇక్కడ ఎలా ఉండమంటావమ్మా?"

"తమ్ముడు నాకు బాగా అలవాటుపడిపోయాడు. నేను లేకపోతే వాడిని ఎవరూ పట్టలేరు నాన్నా. నేనే అన్నం తినిపించాలి, నేనే నిద్రబుచ్చాలి .... నువ్వే చూశావుగా—ఆరోజు నేను చిక్కమగళూరు వెళ్లి, రావటం కాస్త ఆలస్యమయ్యేసరికి పాలు త్రాగకుండా, అన్నం తినకుండా ఎంత గొడవచేశాడో? ఇప్పటినుండే ఇలా అయితే ఇహ తరువాత?"

"నేను బ్రతికున్నంతకాలం వాణ్ణి నీతో పంపించలేనమ్మా."

"అశుభం పలకవద్దు నాన్నా" ఇందిర కంఠంలో బాధ ధ్వనించింది. (శేషం)

---

# భూతద్దంతో హత్యాపరిశోధన

24-వ పేజీ తరువాయి

వాడు. అంతకు ముందురాత్రిమాత్రం మారిసన్‌కి ఉత్తరంవైపున పదిహేనుమైళ్ళదూరంలోఉన్న డైక్ అనే ఊరులో ఒక స్నేహితుని బార్‌లో కొంతసేపు అతనికి సహాయంగాఉండి రాత్రి పన్నెండు అవుతున్న దనగా ఇంటికి తిరిగి వచ్చేశాడు. బాగా అలసిపోయి ఉన్నాడేమో వెంటనే పడకవేశాడు.

ఇర్మాజీన్ ఇంకా బార్‌లోనే ఉన్నదనుకొన్నాడు. ఆమె సాధారణంగా ఈవేళవరకు పని చూసుకొని ఆతర్వాత బార్ కట్టేసేది. తెల్లవారుజామున నాలుగు గంటలకు మెలకువవచ్చి ఆమె ఇంకా పడుకోటానికి రాకపోవటం గమనించి బార్‌దగ్గరకు వెళ్ళి చూశాడు. విశేషంగా ఏదీ కనుపించలేదు. తిరిగిపోదామనుకుంటుండగా బీర్ చల్లబెట్టే గదితలుపు తెరిచిఉండటం గమనించాడు. లోపల ఆమె శవం దొరికింది.

ముందురోజు సాయంత్రం ఆ బార్‌కి అయిదుగురు వచ్చారు. వారిలో ఇద్దరు అర్ధరాత్రివరకు ఉండి వెళ్ళిపోయారు. అందరిని అడిగిచూశారు. కాని విశేషంగా ఏది జరిగినట్లు వారు గమనించలేదు. ఇర్మాజీన్ ఎప్పటివలె అందరితోను చనువుగా ఉంది, అంతే.

## అందరూ నిర్దోషులే!

బార్‌లో ఎవ్వరికీ ఆమెను చంపేందుకు కారణం లేదు. ఆ బార్‌ని వదలినతర్వాత ఎవరెవరు ఎక్కడ ఉన్నది బలమైన సాక్ష్యంతో నిరూపించగలిగారు. 27 సంవత్సరాల వయస్సుగల ఆమె భర్తకి సయితం ఆమెను చంపవలసిన కారణంలేదు. వారి దాంపత్యం ఏ ఒడుదుడుకు లేకుండా గడచిపోయింది. ఖాతాదార్లతో తనభార్య చనువుగా ఉండటం అతనికి ఎప్పుడూ కోపం కలిగించలేదు. హత్య జరిగిన రాత్రి అతను డైక్‌లో ఉన్నట్లు నిర్ధారణ అయింది.

అయితే హంతకుడు ఎవరు? ఇర్మాజీన్ మొదటి భర్త సంగతి ఏమిటి? వివాహం అయిన సంవత్సరం తర్వాత విడాకులు జరిగింది. (18 వ ఏటనే ఆమెకు పెళ్ళి అయింది.) విచారించగా అతను రెండు నెలలుగా చికాగో వదలలేదని తెలిసింది. అంటే అతను నిర్దోషి అన్నమాట.

## గాజుముక్కల తనిఖీ

ఈ హత్యకు సరియైన ఆధారం గాజుముక్కలలోనే దొరికింది! ఈ ముక్కలన్నింటిని జాగ్రత్తగా ఏరి వాటర్లూ పరిశోధనాలయంకి పంపించారు. వేలిముద్రలు ఏమీ దొరకలేదు. కాని రెండు గాజుముక్కలు బీర్ సీసాలవి కావని తేలిపోయింది. సులోచనాల భూతద్దాల ముక్కలని పరిశోధకులు నిర్ధారణ చేశారు. సులోచనాలా? అవును అన్నారు పరిశోధకులు. అవి కనుక ఈ చుట్టుపట్లవారివి ఎవరివయినా ఒక అంగడిలోనే కొనిఉండాలని షరీఫ్ మేయరుకి తెలుసు. ఎందుచేతనంటే కంటికి జోడువేసేషాప్ ఆ ప్రాంతానికి ఒకటే ఉంది. గ్రుండిసంటర్‌లోఉన్న ఈ సులోచనాల అంగడిమనిషి ఈ ముక్కలు ఎవరి కిచ్చిన జోడులోనివో చెప్పగలడా? ప్రయత్నిస్తాను అన్నాడు అతను.

కొన్ని గంటలు పరీక్ష అయినతర్వాత పాత రికార్డులు వెతికి రెండు సంవత్సరాలక్రితం ఎడ్వర్డ్ బెక్విత్ అనే యువకునికి సప్లయి చేసిన అద్దాలలోని ముక్కలు ఇవి అయిఉండవచ్చునని అతడు చెప్పాడు.

మారిసన్‌నగరంలో ఎవరు బెక్విత్ హంతకుడని ఊహించలేదు. కాని, ఫ్యాక్టరీలో సాయంత్రం షిఫ్ట్‌కి వెళ్లే ఈ పాతికసంవత్సరాల యువకుడు తరచు ఇర్మాజీన్ బార్‌కి రావటం అందరికి జ్ఞాపకం వచ్చింది. ఇర్మాజీన్‌కి పనిలో సహాయపడేవాడనికూడా చాలా మందికి తెలుసు.

బెక్విత్ తల్లిని ప్రశ్నించి చూశారు. హత్య జరిగినరాత్రి తనకొడుకు సామాను సర్దుకొని, సెలవు తీసుకొని, ఇక మళ్ళీ ఆమెను కలుసుకోనని చెప్పి వెళ్ళిపోయాడని బెక్విత్‌తల్లి అన్నది. అప్పుడు కళ్ళజోడు పెట్టుకొనిఉన్నాడా? లేదు.

## అంతసేపు అక్కడే!

హంతకుడు ఊరు వదలి వెళ్ళలేదు. మర్నాడు మధ్యాహ్నం ఒక పొలంలో దాక్కునిఉండగా పట్టుకొన్నారు. పట్టుపడిపోగానే హత్యచేసినట్లు ఒప్పుకొన్నాడు. తను ఇర్మాజీన్‌ని ఘాడంగా ప్రేమించానని, ఆమె తనను తిరస్కరించినదని, ఆ మంగళవారం రాత్రి ఆమెను బీర్ చల్లబరిచే గదిలో బలవంతం చేయపోయి ఎదిరించగా ఒళ్ళుతెలియని కోపంలో కత్తితీసి ఆమెను పొడిచి చంపేశానని చెప్పాడు.

విచారణతర్వాత ఎడ్ బెక్విత్ మొదటిడిగ్రీ హత్య చేసినట్లు నిర్ధారణ చేశారు. అయితే అప్పీలు చేసుకోవటంవలన మరణశిక్ష విధించటం కొంచెం ఆలస్యం అయింది. ఆగష్టు 4, 1952 వ ఇర్మాజీన్ హంతకుడిని అయోవారాష్ట్ర కారాగృహంలో ఉరితీశారు. ★

మున్నది. అందుకు కారణం రాజ్యలక్ష్మి ఏమోమరి?

సూర్యం ఇవతలికి వచ్చేసరికి ఆపెద్దమనిషి అక్కడ లేడు. డఫేదారు రామయ్య చెప్పేడు. "ఆయన చాలా విచారంగా నీరసంగా మాటాడు తున్నాడయ్యా!"

"మరి ఎందుకొచ్చినట్లు. ఇంటిఅద్దెల భార మంతా బావ్మదే. సూర్యం రాగానే జయరావుగారు వుండడంవల్ల ఏమీ అనలేదు. లేకపోతే వరసమ్మ గారినే సాంబశివంగా రెండుకు వచ్చేరో అడుగుదా మనుకున్నాడు. అసలు అరగంటముందుగానే బయలు దేరా డాఫీసునించి.

కాని; రీటా వెన్నెలంత మొహంజేసుకుని పలక రించింది.

"కంగ్రాచ్యులేషన్స్" అంటూ అభినందించింది.

సూర్యం నిజంగా తెల్లమొహంవేశాడు. ఈ అనవసర అభినందనలు దేనికన్నట్లు మొహంపెట్టేడు.

రీటా చెప్పింది. "అఫ్‌కోర్స్.... ది ఓల్డ్ జాకాల్ మంగపతి టోల్డ్‌మీ" అని. క్యాషియర్‌కి ఆపిల్ల "ఓల్డ్‌జాకాల్" అని. పేరుపెట్టేసింది."

గుంటనక్కలాంటివాడేనని సూర్యముహ్నా అది వరకే బలపరిచేడు. కాని ఆగుంటనక్క ఈ పిల్లకేమి చెప్పేడు? అందులోనూ తన నభినందించ వలసిన విషయం ఏమిటో! అని విస్తుపోయేడు.

రీటా అడిగింది "మీరు శంకరంగారి అమ్మా యిని ప్రేమిస్తున్నారటగా....అయితే ఏంగేజి మెంట్ సంగతి నాకు చెప్పలేదే"మని—

శంకరంగారి అమ్మాయి? తను? సూర్యం కళ్లు విస్ఫులింగాలే కక్కేయి అవి రీటామీద కాదు. మంగపతిమీద "ఐ విల్ కిల్ హిమ్" అన్నాడు.

రీటా భయపడింది. "అసలు సంగతేమిటి? నన్ను క్షమించి దీన్ని ఇలా పోనివ్వండి" అన్నది.

ఆ అమ్మాయి నొచ్చుకున్నది. "బహుశా మీ సాంప్రదాయంప్రకారం ఎంగేజిమెట్ అని అనకూడదా...." అన్నది.

సూర్యానికి నవ్వొచ్చింది. అంత కలతలోనూ "హామొహం" అన్నాడు.

"ఈస్ వెరీ సీరియస్ నా" అన్నది రీటా.

రీటాకి చాలావిషయాలు చెప్పాలి— అనిపించింది సూర్యానికి. కాని పరాయిపిల్లదగ్గర ఏం చెప్పుకుం టాడు. కాని యేదో ఆత్మీయత అతగాడికి—: మంగపతిమీది పగకంటే బలీయమైనది. రీటామీద ఉన్నది.

పార్కుదాకా ఆమెతో నడిచి అన్నాడు "మంగ పతి ఉత్త దగుల్బాజీ, హెడ్‌క్లార్కుగారింటికి ఒకటి రెండుపర్యాయాలు నేనువెడితే ఈవెధవ ఇలా చెబుతున్నాడు. నాకు అటువంటి సదుద్దేశంలేదు. అథవా వున్నా. శంకరంగారిభార్య ఉరిపోసుకుంటుంది. మవ్వీమాట మరిచిపో" అనే భావాన్ని యెట్టకేలకు చెప్పేడు.

రీటా ఆశ్చర్యంతో నోరు వెళ్లబెట్టింది. "మంగపతి రోగ్" అన్నది.

తర్వాత రీటాకి గుడ్‌నైట్ చెబుతున్నప్పుడు రీటా నవ్వింది. "ఈవాళ కాకపోతే రేపు: రేపుకాక పోతే మరోవాడు, ఈపిల్లగాపోతే ఇంకో చిన్నది...

# విడీ విడని చిక్కులు

23-వ పేజీ తరువాయి

నీవు నాకు పార్టీ యివ్వాలి సుమా" అన్నది.

సూర్యం పులకించిపోయి "నీకు పెళ్లొద్దా?" అన్నాడు.

"బొంబాయి పారిపోతానంది" రీటా!

సూర్యం ఆమాటకర్థం అడిగేలోపుగా ఆవిద్యుల్లత మాయ మయ్యింది.

ఏమయితేనేం సూర్యం మంగపతిని తిట్టు కుంటూ ఇల్లుచేరుకొనేసరికి చీకటిపడిపోయింది.

తోవకడకూ, రీటా అడిగిన పార్టీ ఎవరిపేరిట ఇవ్వాలి తను? అదే ఆలోచన

రీటా ఎంత చురుగ్గావున్నా తను మెచ్చుకో లేడు! అదివేరు. కాని రాజ్యలక్ష్మి ఎంతచ తురుకు!!..

"పిల్లల ఫొటోలు తీయడానికి ఏమాత్రం పుచ్చుకుంటారేమిటి?"

"పన్నెండు ఫొటోలకు పది రూపాయలు."

"అయితే రెండేళ్లు ఆగు. నాకిప్పుడు పదిమందిపిల్లలే!"

పి. రామారావు (కాళహస్తి)

* * *

"డాక్టరుగారు నన్ను వంట చెయ్యొద్దన్నారు."

"ఎందుకు? మీకు జబ్బుగా ఉందా?"

"లేదండీ. మావారికి జబ్బుగా ఉంది!"

ఎస్. రమాదేవి (కావలి)

తనంటే ఆపిల్ల కెందుకింత ప్రేమ.... సూర్యానికి రాజ్యలక్ష్మిమీద తలంపు గాలిమీదే నడిపించింది.

మీనాక్షి కాఫీ పట్టుకుని రాలేదు. జయరావు గారే స్వయంగా కప్పుతో కాఫీపుచ్చుకొని వచ్చేడు.

"ఇదో అల్లుడూ" అంటూ.

ఉలిక్కిపడి తనఆలోచనలనించి తేరుకున్నాడు సూర్యం.

* * *

ఇక్కడ సూర్యంలో వింతవింత సంఘర్షణలు జరుగుతూవుండగా, అక్కడ సాంబశివంగారి హృదయం ఉప్పెనలా దుఃఖించ సాగింది.

చచ్చినతరువాత ఏ నరకమో విధిస్తే దాని దారి వేరు? బ్రతికుండగా రంపపుకోత అయ్యింది తనబ్రతుకు.

వదినె ఆత్మ ఎక్కడేనావుంటే విని అడ్డుపడ రాదా? అసలీ ఉపద్రవాన్ని అతడు ఊహించి ఉండలేదు.

ఇరవై సంవత్సరాల క్రితం చెప్పింది· వదినె సీతామహాలక్ష్మి....

"పంచభూతాల సాక్షిగా నువ్వుచేసిన యీ నేర మైనా.... నువ్వు కాదనలేవు! అని సాక్షులుగాలేకుండా నువ్వే మంచిపనీ చెయ్యలేవు అని"—

సాంబశివంగా రెంత పశ్చాత్తాపపడిమాత్రం ఏం లాభం?

రాజ్యలక్ష్మికి తనవదినె ఉనికినిచ్చింది. తనకీ యీసమాజంలో వ్యక్తిత్వానిచ్చింది. కాని తను యేదీ దక్కించుకోలేని అదృష్టహీనుడయ్యేడు!

లలితాంబ నతగాడు బ్రతిమాలి చూసేడు. ధనలోభం చూపించాడు. "ప్రావిడెంటుఫండ్ లోను" పెట్టుకొని మరీ ఇంటికి వచ్చేడు.

లలితాంబది ఒక్కటేప్రశ్న.

"మీ కెందుకీ ఊరిబాబు కన్నపిల్లమీద ఇంతమమకారం?" మీ కిద్దరు ముత్యాల్లాంటి బిడ్డలున్నారు వాళ్ల భవిష్యత్తు మీచేతులారా మంటపెడతారా? మీ ఒళ్లో మీరే నిప్పులు పోసు కునేటంత కర్కోటకులా మీరు—" ?—

నిజం చెబితే సాంబశివంగారి స్థితి ఇంకా విపత్కరమౌతుంది. లలితాంబ రాక్షసిలా ప్రవర్తి స్తున్నది. తను కన్నపిల్ల రాజ్యలక్ష్మిఅని చెప్పి నట్లయితే అది ప్రళయమే అవుతుంది. రాజ్య లక్ష్మికే విషమోయిచ్చి తనూ నీనూతిలోనో దూకే స్తుంది.

ఆడదాని ఈర్ష్య అసూయ తెలియనంతటి అమాయకుడు కాడు ఆయన. మూర్ఖుడున్నూ కాడు.

"నన్నేం చెయ్యమన్నావ్ చెప్పు. పెంచిన మమత కదా? ఆ ముసలి పీనుగుల మాటమీద నీ కంత నమ్మక మేమిటి? ధనపిశాచి ఎంతేనా చెడ్డది. వెధవ నాలుగు రాళ్లకోసరం అబద్ధాలాడుతున్నారేమో ...... మా వదినె ఈ పిల్లను ప్రాణపదిలంగా చూసుకొన్నది. దీన్ని భరించడం నా కర్తవ్యంకాదా?"

అతగాడి మాటలకు లలితాంబ ఆపాదమస్త కము మండిపోయింది. నిప్పులు చెరుగుతూ చూసింది.

తన పసిదాన్ని తెచ్చి, మంచంమీద కుదేసి, "దీన్నెత్తి మీద ప్రమాణం చెయ్యండి......ఇది ఛస్తే మీ రక్తం నాకేం బెంగలేదు—" అన్నది.

సాంబశివంగా రేమనగల్గుతాడు?

"ఇష్! గట్టిగా మాటాడకు ఎవరేనా వింటే నవ్వుతారు? పాపిష్టిదానా?" అన్నాడు

"ఎవరూ ఎందుకు మీ ముద్దులలక్ష్మికే చెబుతాను దాని తల్లి ఎవరో తండ్రి ఎవరో....... రోజూ ఆ దిక్కుమాలిన మీ వొదిన పటం దగ్గర కూచుని అమ్మా! అమ్మా అని ఏడవడం......ఎంత సిగ్గుచేటో తెలిసిపోతుంది."

సాంబశివంగారుమాత్రం ఉగ్రుడై లేచి, లలితాంబ నోరు నొక్కేడు. "పాపిష్టిదానా! పసికూన; దాని మీద నీకెందు కింత కసి?"

లలితాంబ భర్త ఉగ్రరూపం చూసి, కాస్త భయ పడ్డది.

ఏడుస్తూనే కసిగా అన్నది, "దానిమీద

కాదు మీమీద నా కసి. ఛీ! నా గొంతు పిసికితే ఏం లాభం—మూడుముళ్లు వేసిన్నాడే నేను మీబానిసను. లోకం నోరుముయ్యడానికి మీ ధనమూ చాలదు. మీ చెయ్యీ చాలదు."

"చూడు లలితా! నిన్ను బ్రతిమాలుకుంటా..... ఈ వెధవముండలనోళ్లు నొక్కి పంపించి...... హితం పట్టికాటికి కాళ్లు జాచిన ఒక నికృష్టుడికి ఈ ముక్కుపచ్చలారని బిడ్డని సమర్పించకు. అది బలి అవుతుంది......."

అతను బ్రతిమాలేడు.

"మీరుకూడా కాస్త ఆలోచించండి ....... జాతి భ్రష్టతకంటే పాపం ఎక్కడుంది! ఆ పెళ్లికొడుకును మనం పుట్టగతులులేకుండా చేస్తున్నాం ...... ఇందుకు సాహసించిన నన్ను మీరు గొంతు పిసుకుతామంటున్నారు. నొక్కండి ఇవాళగాకున్నా రేపేనా నరకంలో, ఒక బ్రాహ్మడికి మాలపిల్లని వంచించి ఇచ్చినందుకు శిక్ష పడాల్సిందే నాకు" అన్నది. ఆమె మాటాడుతున్నంతసేపు ధారాపాతంగా కళ్లవెంట కడవలు ఒలుకుతూనే ఉన్నాయి.

"నేను అతి తొందర్లోనే సాధ్యమయినంత వేగంగానే ఓ సమ్మంధం చూసి ముడిపెడతానుగా.... నీమీద దీన్ని ఉంచను నా మాట విను......."

"ఊహూఁ ఈ పెళ్లి జరిగితీరాల్సిందే ఈ మా కృష్ణవేణత్తయ్య మామూలుఘటం కాదు. అక్కడ వాడికి మాట ఇచ్చింది........ఇపుడు కాదంటే ఇది ఎప్పటికేనా గుండెలమీద కుంపటి అవుతుంది. ఇంతకీ మీ కెందుకీ రభస........ఆవేదన........మీ ముద్దుల లక్ష్మి ఈ పెళ్ళికి ఒప్పుకున్నది."

సాంబశివంగారు తన చెవులను తనే నమ్మలేక పోయేడు. తనరాజు ఈ పెళ్ళికి ఒప్పుకుందా?

"ఛీ! ఛీ! ఏం మాటాడుతున్నావ్?" అని గద్దించేడు. భర్త గర్జనలకి లలితాంబ కన్నీళ్లు కారుస్తూనే ఫక్కున నవ్వింది.

"దానికి నా పెట్టు పోషణ నచ్చలేదల్లేఉంది..... అదీగాక భూమి పుట్రా, ఆస్తీ పాస్తీవుంటే ఇంకేం గావాలి......మొగుడుచాటున ఏమోనా అనుగుతాయి కదా.......ఇంతకీ తల్లి ఎవరో, తండ్రి ఎవరో తెలీని దానికి నీతిమాలిన బుద్ధులుండవని మీ నమ్మకం... నేను నమ్మను."

సాంబశివంగారికి దుఃఖం పొర్లుకొచ్చింది. ఒడలంతా ఎవరో మానె మరిగించి పోసినట్లు కాగిపోయింది. "శివశివా! నీ నాలిక తెగిపోతుందే నికృష్టురాలా! దాని తల్లిసంగతి నీకేం తెల్సు!.......నోరు ముయ్యి" ఆయన కోపాన్ని నిలదొక్కుకోలేక భార్య తల వంచి వీపుమీద చరచబోయేడుకాని, పసిబిడ్డ కెవ్వుమన్నది. ఆయన భార్యనుకొట్టే ప్రయత్నం విరమించుకుని, "లక్ష్మి ఎక్కడ" అన్నాడు. అతగాడికి భయమేసింది.

"ఏం! భయమేసిందా? మరేం ముయ్యో గొయ్యో చూసుకోదులెండి. పెళ్లివారితోకలిసి సినిమాకి వెళ్లింది" వెటకారం చేసింది లలితాంబ.

"అది రానీ! ఎలాగ ఒప్పుకుందో అడుగుతా" అన్నాడు చివరికి కూలబడి.

"అయ్యో! భగవాన్ నన్ను శిక్షించడానికి నీవీ పద్ధతి అవలంబించేవేమని" ఆక్రోశించిం దతని హృదయం.

## 40

రాజ్యలక్ష్మిగురించి రాజ్యలక్ష్మికి తెలియదు. ఆపిల్ల జీవితాన్ని తిమిరరాశిలోకితోసి .... బ్రతికి నన్నాళ్లు దుఃఖపూరితం చెయ్యాలని షడ్యంత్రం ఎందుకు వేయబడుతున్నదో అందుకు సూత్రధారు లెవరో వారికిగల లౌకికప్రయోజనంగాని, లేదా అలౌకిక ఆనందమేగాని యేమిటో ఆపిల్ల యెరుగదు. నచ్చడం, నచ్చకపోవడం, ఇష్టపడడం, ఇష్టపడకపోవడంవంటి అనుభూతులే ఆపిల్ల మనః ప్రవృత్తికి పరిధులు. ఆపిల్లకి రాముడూ, కృష్ణుడూ కూడా సూర్యంబావే .... సినిమాలోని హీరోల్లో సైతం ఎవరూ అతగాడంత తేజోమూర్తులుగా గాని, ధైర్యశాలులుగా గాని అగుపించరు.

నిర్మలకి తనగురించి తనకు పూర్తిగా తెలుసును. ఆపిల్లకి తనకీ సమాజం తత్వానికీ మధ్య పెనుగులాట యేమిటోకూడా కొంతలో కొంత తెలుసును.

నిర్మల గతచరిత్రమాత్రం మరెవ్వరికి అంటే నరసమ్మగారి లోగిలిలో మాత్రం తెలియదు. తెలియని విషయాలగురించి మనిషి వూహాగానాలు చెయ్యగలడు కదా!

నిర్మలగురించి 'ఆ! ఇది ఏం వితంతువు?... సైలాపచ్చీసులో వున్నది' 'అని ఒక పక్షం ప్రతిపాదిస్తే, ఏమో? మొగుడు వదిలిన ఘటమేమో' నని మరోపక్షం తీర్మానించిన సందర్భా లున్నాయి.

అయితే యెదురీదడమే లక్ష్యంగాగల నిర్మల మొదట్నించీ వీటిని పట్టించుకోకూడదనే అనుకున్నది.

రాజ్యలక్ష్మి ఆత్మీయత ఆ పిల్లకి యెడారిలో 'ఒయాసిస్' అవడమే గాకుండా నిర్దాణ సంస్కారంగల నరసమ్మగారి హృదయద్వారం కూడా రాజ్యలక్ష్మియే తెరిచింది.

నరసమ్మగా రాయింటినుంచి పొమ్మంటుందేమోననే భయం పోవడంతోనూ, సూర్యం తనకు హితాలు చెబుతానని అంగీకరించడంతోనూ, నిర్మల తతిమ్మా సమాజాన్ని గుర్తించడమే మానేసింది.

అంతమాత్రంచేత నిర్మల జీవితం పాముకూళ మయ్యిం దనుకోడానికి వీలులేదు. నిర్మల వర్తమానంతో పోరాడుతున్నది. అది వాస్తవమే! మరి ఆపిల్ల భవిష్యత్తు??

మీనాక్షి వెళ్లిపోవడం, రాజ్యలక్ష్మి అగుపించకపోవడం .... నరసమ్మగారికి ఆరోగ్యం కోలుకోవడం ఇవన్నీ ఒక్కసారిగా జరిగి నిర్మలకి తన బ్రతుకు తిరిగి జ్ఞాపకం తెచ్చుకోవాల్సిన-అవసరాన్ని కలిగించేయి.

ఆమె రివాజుగానే ఆవేళ పూలుకోసుకుని తెచ్చి నసమ్మగారికి ఇవ్వబోయింది.

నరసమ్మగారు సంధ్యవేళ "శంభోశంకర సాహిమాం" పాడుతూ దీపం వెలిగించుకొంటోంది.

నట్టింట దీపం వెలిగిస్తూ నిర్మలరాకను సవ్వడి అవగానే గ్రహించి "రావేతల్లీ! రా" అన్నది ఆదరణతో.

నిర్మల గుమ్మందగ్గర నించున్నది. అగ్నిపర్వతం లాంటిదే వ్యధితహృదయం కూడాను. నిర్మల యెదను భూకంపమే రగులుతున్నది.

నరసమ్మగారు తలయెత్తి చూసి "ఏమే అమ్మాయీ! ఈ ముసిల్దానిమీద పగ సాధిస్తున్నావా?" అన్నది కొంచెకోపం ప్రదర్శిస్తూ....

"ఛా! అదేంమాట .... మీరు మడికట్టుకున్నారుగా" అన్నది. అదివరకెన్నడూ నిర్మల నట్టింట అడుగుపెట్టి యెరుగదు.

"లోపలికిరా! అపవిత్రమైపోవు!.... నేనూ, వెధవముండనే .... ఈ దైవానికి నావైధవ్యం ప్రీతికాదు; నీది బరువూలేదూ...."

నిర్మల కామాటలు వాడితూపులే ఎదను నాటేయి. ఆమె కనుకొలకుల్లో దుఃఖం నిండుకొచ్చింది.

దీపం కాంతిలో అది చూసిన నరసమ్మగారు నిలువునా నీరైపోయింది.



RATNAM'S N-OIL

(వైద్యశాస్త్రము)

అంగవరములు బలహీనత చెంది, చిన్న వయస్సులో తిరిగి యథాప్రకారం అంగ శక్తి సౌఖ్యము ననుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కోరలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇందులో స్పెషల్ రకం అరింటుగుణమునకు రూ. 25-0-0 లు.

డాక్టర్. రత్నం సన్స్, (Estd 1904)

మలక్‌పేటబిల్డింగ్స్, ఆజంపూరాహూస్టెట్ వద్ద, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

నెర్విటాల్

నరములు బలహీనతకును, రక్తపోటుకును రామబాణము. అనుభవయుక్తముగా చేయబడినది.

8 ఔ. సీసా 5-75, పోస్టేజి 1-75.

ఇండియన్ మెడిసన్ హౌస్,

విజయవాడ-2.

క్యాలెండర్లు

నాణ్యమైన ఫోటో అఫ్‌సెట్ క్యాలండర్లకు మమ్ము సంప్రదించండి. క్యాలండరు బొమ్మలను క్యాలెండరు ఉత్పత్తిదారులకు, ప్రింటర్లకు ప్రత్యేక ధరలకు సప్లయి చేయుదుము.

మం చి కమీషనుపై పనిచేయుటకు సమర్థులైన ఏజంట్లు కావలెను. వ్రాయండి.

AJANTA ARTCALENDAR Mfg.Co.

P. B. 255, MADRAS—1.

or P. B 962, Calcutta-1.

డాక్టర్ వృత్తి చేయండి!



విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిస్టర్డు కాలేజీద్వారా డిప్లొమా పొందండి.

ప్రాస్పెక్టస్ ఉచితం వెంటనే వ్రాయండి.

INDIAN HOMOEOPATHIC COLLEGE

(APM), JULLUNDUR CITY


# విడీ విడని చిక్కులు

"ఇలారా!" అన్న దామె నిగ్రహించుకుని.

నిర్మల మంత్రించినట్టు ముందు కదుగులు వేసింది. ఆ యిద్దరిమధ్యా ఆత్మీయతను మించిన మంత్రశక్తి మరొకటి ఏమీలేదు. వరనమ్మగారు నిర్మల చేతివ్రేల నందుకుని మొహంలోకి దీపం ఒత్తి కాంతిలో పరికించిచూసి "ఛా! అదేమిటే పిచ్చితల్లి! నేను ఎప్పుడో, యెరుసుగా చూసానా?" అన్నది తలనిమిరి.

నిర్మల "అట్నే లేదండి!" అన్నది ఆమె పాదాల చెంత కూలబడి.

వరనమ్మగారుకూడా చతికిలబడి "ఎవరేమన్నారే తల్లీ!" అన్నది హతాశయ్యి నెత్తిన చెయ్యి తాటించుకుని.

నిర్మలకి దుఃఖం ఆగలేదు.

"చూడమ్మాయి! ఈ దైవంముందు నిజం దాచకు .... ఇవాళ నాకుచెప్పు నీ కథ....ఆ జగన్నాథుడే వింటున్నాడనుకో .... మరి నీ చరిత్రం ఆదేవుడు వినలేనంత పాపిష్టి దనుకోను"....

అని ఆమె నిర్మల తల నిమిరింది.

"నువ్వు నా ప్రాణం పోశావనే చెప్పాలి! అందుకిది విశ్వాసమే ననుకో .... నేను నొచ్చుకోను — సూర్యానికి పెళ్లిచేస్తేగాని ఈ ఆత్మకి తృప్తిలేదు." ఆమె నిట్టూర్చింది.

నిర్మల తెప్పరిల్లి "మిమ్మల్ని ఒకప్రశ్న అడగనా?" అన్నది. సంకోచంగా — "లక్ష అడుగు ముందా యేడువు మొహంమాని నిర్మలంగా నవ్వు .... ఆ.... అదీ....అలాగ...." వరనమ్మగారి వాత్సల్యానికి నిర్మల కరిగిపోయింది.

"ఒక కుటుంబంలో ఒకరి తప్పిదానికి మిగిలిన అందరూ నైతికంగా కట్టుబడి ఉండాల్సిందేనా? ఒక్కరు తప్పుచేస్తే శిక్ష మరొక్కరికా?" అన్నది.

ఈ ప్రశ్నకి వరనమ్మగారు ఏం చెబుతుంది!

"ఎవరితప్పు? ఎవరికుటుంబం .... అసలు మీ నాన్నగారిదేవూరు?"....

"జయపురం కాని ఆయనపోయి ఏడేళ్లయ్యింది"

"మరినీతల్లి?"

"ఆమె కూడా నాలుగేళ్లక్రితం నాన్నగారి దగ్గరికే వెళ్లింది." నిర్మలచెప్పింది.

"మరి నీకు పెళ్లి ఎప్పుడయ్యింది.? మీతండ్రి చేశాడా?" వరనమ్మగారికి సానుభూతికంటే కుతూహలం కూడా ఎక్కువగానే ఉన్నది.

"లేదు...మేము జయపురం వదిలి మా అమ్మమ్మ గారింటికి వచ్చేశాము. అంటే మాఅమ్మ తాతగారి వూరది....అది గోదావరిజిల్లాలోని ఓ పల్లెటూరు. అక్కడేఅమ్మ .... జయపురంనుంచి తెచ్చుకొన్న మానాన్నగారిఆస్తి అయిన ఒక్కకుట్టు మిషను సాయంతోనే నాచదువు చెప్పించింది. తాతయ్యకి వున్నఆస్తి బహుకొద్ది.... అదికూడా మావయ్యలకేనాడో అంకితమైపోయింది ఒకమావయ్య బొంబాయి పారిపోయేడు. మరొకడు మద్రాసునించి...."—

నిర్మలలేచి వెళిపోబోయింది. వరనమ్మగారు అప్రయత్నంగానే అపిల్లనాపి "చెప్పు.... వాడెవడో యేదోచేస్తే నీకేం! చెప్పు యింతపాటి మచ్చలు లేనిదెవరికి? ఈలోగిలిలోని మనుష్యులకి లేనిదిసీ ప్రతుకలేవు.... నన్ను నీతల్లికి తల్లిగా యెంచుకో. ....." మన్నది.

"....ఒక్కరైని తెచ్చుకున్నాడు. తాతయ్య యీ బెంగలోనే మంచాన పడ్డాడు. కానీ యీలోగా నాపెళ్లి జరగాల్సి వచ్చింది...." నిర్మల మళ్లీ సిగ్గుతో ముడుచుకు పోయింది.

వరనమ్మగారికి జాలితోపాటు విసుగూవేసింది. "ఎవడో కుర్రకుంకని ప్రేమించావు అవునా?.... మరెవరున్నారు? చూసేదిక్కునీకు? అనడిగింది.

తలూపింది నిర్మల.

"ఇంట్లోవాళ్లు వీల్లేదన్నారు.... అంతేనా?" లోకంతీరు యింతేగదాన్నట్టు నిట్టూర్చి అడిగింది వరనమ్మగారు.

"అమ్మ, తాతయ్య, మొత్తానికి వాళ్లయింట్లో యిష్టంలేకపోయినా అతగాన్ని ఒప్పించి పెళ్లి జరిపించారు." నిర్మల తలపూర్తిగా దించుకునే చెబుతున్నది.

"తర్వాత...."

"ఒక్క సంవత్సరంలోపున మావారితోపాటు నాకున్నూ యెలిమెంటరీ ఒళ్లో వుద్యోగమయ్యింది. ఈలోగా వారిపుట్టింటి వారికి మాకువాలా తగాయిదా లయ్యేయి. అమ్మమీద చాలా అభాండాలు వేసేవారు. అమ్మఎప్పుడో యింటినించిలేచి పోయిందని నీతి మాలిందని అన్నారు.... అయితే ఈ బెంగతోనే అమ్మతీసుకొని తీసుకొని తాతయ్య ననుసరించింది. ఆయిద్దరూ ఏడాది తిరగకుండా స్వర్గస్థులయ్యేరు.... మావయ్యమాత్రం వస్తూవుండేవాడు. మాఅత్తగారు మాత్రం రాజీకి రాలేదు.... పైగానన్ను, తల్లిపోలికని మేనమామల పోంగ్రదాయమని నానా మాటలుఅని, అనిపించడమే పనిగా పెట్టుకున్నారు. మా మావయ్య ఒకనాడు మావారితో మాటమీద మాటవచ్చి తగూవడ్డాడు. దానికినేను జోక్యం చేసుకుని మావయ్యను ఏమీ అనలేదనే నెపంతో మావారున్నూ తల్లి దండ్రులతో ఏకమయ్యేరు..." నిర్మల దుఃఖించసాగింది.

"ఛా! పిచ్చిదానా! యింతభారం భూదేవిలా మోసినదానివి యివాళ యింతబేల వయ్యేవేం" ఓదార్చింది వరనమ్మగారు.

"నేనదేవూళో ఉద్యోగం చేసుకోడం కష్టమయ్యింది. దైవసాక్షిగా నేనే పాపము ఎరుగను... ఆయన నన్ను చావమని బలవంతం చేయసాగారు.... దెబ్బలు మాటలూవాలక నీలాపనిందలు సైతం భరించలేకపోయేను.... సాహసంచేసి పట్నమొచ్చి, మావయ్య స్నేహితు డొక డియ్యావోసాహాయంతో వుద్యోగం సంపాయించుకున్నాను. వుద్యోగంతోపాటు నావునికి మావా ళ్ళెవరికి తెలియకూడదని, వాళ్లకు నేను; నాకు వాళ్లూ చచ్చేరనుకున్నాను...." నిర్మల కిన్నెరొ జలదుఃఖమూ వుప్పెనలా వచ్చింది.

(సశేషం)

లాభం! అంతలోనే నువ్వు శత్రు రాజ్యంలో మకారియోదగ్గిరికి వెడుతున్నట్టు చెప్పాడు. మొట్ట మొదట నువ్వు పడమటిగాలిదగ్గిరికి వెళ్లినప్పుడే నేను నీమీద ఆశ వదులుకున్నాను. పోనీ, ఎల్లాగో అలాగ తిరిగి ప్రాణాలతో బయట పడ్డావని సంతోషించాను. పనికట్టుకుని, పరమదుర్మార్గుడు, ఆ మకారియోదగ్గిరికి ఎందుకు వెళ్లావు నాయనా! అక్కడికి వెళ్ళినప్పుడు నీకేమి చిక్కులు లేదుకదా!'

ఇయాగూని విడిచివెళ్లినప్పటి నించి జరిగిన సంగతులన్నీ హాయవాతా సంగ్రహంగా నోకోమిస్‌కి తెలియజేశాడు. తాను సంపాదించుకుని వచ్చిన బాణాలసంగతి వాటి రహస్యాలవిషయంకూడా చెప్పాడు. మిన్నేహాహా తనకిసాయం చేసిన సంగతిమాత్రం చాలా టూకీగా తేల్చివేశాడు. తా నామెను రక్షించిన సంగతి మాత్రమే చెప్పాడు.

నోకోమిస్ అతడు చెప్పినదంతా చాలా శ్రద్ధగా విన్నది. కొంచెం భయపడి మళ్ళీగా ఎంతో ఆత్రంగా అడిగింది:

'నాయనా! ఏది ఏమయితేనేం! క్షేమంగా తిరిగి వచ్చావు! నాకదే పదివేలు! సరేగాని ఇప్పుడీ శత్రు రాజ్యాలగొడవ — మనకెందుకు? ఆ వ్యవహారాలు నెమ్మదిగా తేల్చుకోవచ్చును. కొన్నాళ్ళపాటు కాలు మీద కాలువేసుకుని హాయిగా ఇంటిదగ్గిర కూర్చో! నీకేమి లోటు వచ్చింది? అనవసరంగా ఇప్పుడీ బాణా లెందుకు? దండయాత్ర లెందుకు?'

కాని, హాయవాతా ఆమె మాట చెవి కెక్కనీయలేదు.

17-వ పేజీ తరువాయి

మున్ముందుగా శత్రువులందరి సంగతి కనుక్కొని తీరతానని భీష్మించుకుని కూర్చున్నాడు. అయితే మొట్ట మొదట సైన్యం కొంత పోగుచేసుకుని, దాని లోగల సైనికుల కందరికీ తాను నేర్చుకున్న విలువిద్యరహస్యాలు వెల్లడించి, కొంతకాలం పాటు తగిన శిక్షణ ఇవ్వాలని అన్నాడు.

నోకోమిస్ ఆ సమాధానం విని 'పోనీ మరికొంత కాలంపాటయినా హాయవాతా ఇంటిపట్టున పడివుంటాడు' అని సంతృప్తిపడింది. ఆపైన అతని సైన్యసన్నాహాలన్నీ చూచీ చూడనట్టు మాట్లాడ కూరుకుంది. కాని ఆనాటినించి సైన్యసన్నాహాలన్నీ పూర్తిచేసేదాకా హాయవాతాకి నిద్రపట్టలేదు. తన దేశంలో గల యోధులనందరిని ఒకచోట చేర్చాడు. వాళ్ళకందరికీ విలువిద్యా రహస్యాలు, బాణాల ప్రయోగాలు కొత్త విశేషాలు అన్నీ బోధించాడు. క్రమక్రమంగా హాయవాతా ధైర్యసాహసాలు గమనించి ఇంకా కొన్ని వందలమంది సైనికులతని సేనలో జేరారు. ఆనాటి కానాటి కతని సైన్యంలో కొన్ని వేలమంది కొత్తయోధుల కోలాహలం చెలరేగింది.

హాయవాతా ఆ సైన్యం సాహాయ్యంతో ఇరుగుపొరుగూ రాజ్యాల మీదికి దండెత్తివెళ్లాడు. అతని సైన్యంలోని భటులవి ఉక్కు ముక్కల్లాంటి బాణాలు. ఆపైన హాయవాతా వాటి మొనలమీద కొంచెం మత్తుమందుకూడా పూయించాడు. అందుచేత ఆ బాణాలు కొంచెం గుచ్చుకోగానే శత్రుభటుల నవనాడు లొక్కమారుగా కుంగిపోయాయి. వారా యాతన భరించలేక దూరదూరంగా పారిపోయి బ్రతుకుజీవుడా అనుకున్నారు.

అలాగలాగ హాయవాతా తన ఇరుగుపొరుగున శత్రురాజ్యాలన్నీ అనాయాసంగా లోబరుచుకున్నాడు. ఆఖరికి మకారియో నివసిస్తున్న శత్రురాజ్యం కూడా స్వాధీనం చేసుకున్నాడు. కాని అతని ఉద్యానవనం దరిమానానికి కూడా పోలేదు.

ఆవిధంగా హాయవాతా పరరాజ్యాలన్నీ లోబరుచుకుని తిరిగి వస్తూంటే దారిలో తనదేశంలో అతడెన్నో పల్లెలగుండా సాగిపోయాడు. ఆసమయంలో అతనికి కొన్ని పల్లెలలో పచ్చిమంచినీళ్లు కూడా దొరకలేదు. సైన్యం

---

ఒక ప్రొఫెసర్ గారు 'నాలుగవ పరిమాణం' పైన సుమారు గంటసేపు ఉపన్యాసం చెప్పి, సందేహాలు అడగమని శ్రోతల్ని కోరాడు. వెంటనే ఒక యువతి లేచి నిల్చుంది.

"ఏమిటమ్మా నీ సందేహం?" ప్రొఫెసర్ గారు అనునయంగా అడిగాడు.

"నాలుగవ పరిమాణం గూర్చి మీరు చెప్పిందంతా అర్థమైంది కాని, మిగతా మూడు పరిమాణా లేమిటో మాత్రం నాకు తెలిశాయి కాదు." ఆ అమ్మాయి తన సందేహం చెప్పింది.

పి. గిరిధరరావు (రాజమండ్రి)

# తెల్లమచ్చలు

(మరియు దేహముమీది యితర మచ్చలకు)

ఎంతకాలంగానైన లేక ఏ కారణములవల్లనైనా దేహముమీద ఏర్పడిన మచ్చలను నివారించుటకు, విశేష పరిశోధనలమూలంగా తయారైన "శ్విత్ర మోచన" ఔషధము చక్కగా ఉపయోగిస్తుంది. అనేక గ్రంథాల పరిశీలన మరియు విశేషపరిశోధనల ఫలితమైన యీ ఔషధం వాడడం ప్రారంభించిన కొద్దిరోజులలోనే తృప్తికరమైన ఫలితాన్నిస్తుంది. అనేక యోగ్యతా పత్రములుపొందినది ధర రు. 8/-మాత్రము. లోపలికి పుచ్చుకొనుటకు రు. 10/-పూర్తికోర్సు రు32 మచ్చల వివరాలు తెలుపుమా వెంటనే మాకు వ్రాయండి. ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను. భారత ప్రఖ్యాత నిపుణులు,

Vaidyaratna Sri Satyarthi (P-I) P. O. Pakri Barawan (Gaya).







# హాయవాతా

## అద్భుతగాథ

కొన్ని పూటలపాటు పస్తుండవలసిన దురవస్థకూడా తటస్థించింది. ఆ దురవస్థ కేమి కారణమని తన సైన్యాధిపతిని పిలిపించి అడిగాడు. అతడు సవినయంగా శిరస్సు వంచి విన్నవించాడు.

'ప్రభూ! మొట్టమొదటినించి మనది చాలా బీదదేశం. ఆపైన నాలుగైదు సంవత్సరాలనించి తిన్నగా వానలుపడక మన దేశంలో పొలాలన్నీ బీడుపడిపోయాయి. మరి గత్యంతరం లేకపోవడం మూలానే ప్రజలందరు మన సైన్యంలో భటులుగా జేరారు. అన్నవస్త్రాలులేక యమయాతనలను భరించడంకన్న పగవారి చేతుల్లో చావైనా మేలే అని తెగించి పోరాడుతున్నారు. ఇటీవల శత్రురాజ్యాలలో జొరబడి కొల్లగొట్టిన ధాన్యాలతోనే ప్రస్తుతం మన సైనికుల కడుపులు నిండుతున్నాయి. ఇక పల్లెల్లో మిగిలిన మన ప్రజలు అన్నమో! అన్నమో! అని అంగలారుస్తున్నారు. దేశంలోఉన్న పరిస్థితి ఇది! అపైన తమ చిత్తం.'

'ఇన్నాళ్లనించి కురిసే వర్షాలు ఈ మధ్యన నాలుగైదేళ్లనించి ఎందుకు కురవడంలేదు?'

'మీ కులదైవానికి మన దేశం మీద కోపంవచ్చిందని ప్రజ లనుకుంటున్నారు.'

'ఎందుకు వచ్చింది అంత ఆగ్రహం!'

'ఏమో! అలాంటి సంగతులు మాలాంటివాళ్ల కెలాగ తెలుస్తాయి?'

ఆపైన హాయవాతా మరి మాట్లాడలేదు! తన ఇంటి కల్లంత

దూరంలో ఉన్న కీకారణ్యంలో ఉన్న ఒక పందిరి వేయించి దానికింద బండరాతిమీద పడుకొని ప్రాయోపవేశం ప్రారంభించాడు. మళ్లీ బాగా వర్షాలుపడి కోకొల్లలుగా పంటలు పండేదాకా మరి పచ్చిమంచినీళ్ళయినా పుచ్చుకోనని ప్రతిజ్ఞపట్టాడు.

అలాగలాగ నాలుగైదురోజులు గడిచిపోయాయి. అయినా హాయవాతా తన శపథం విడిచిపెట్టలేదు. ఆ వార్త నోకోమిస్‌కి తెలిసింది. హాయవాతా దగ్గరికి వచ్చి ఉపవాసం మానమని శతవిధాల పోరింది. కాళ్ళ వేళ్ళా పడి బతిమాలుకుంది. వలవలా ఏడ్చింది. కాని అతడు తనపట్టు విడిచిపెట్టలేదు. క్రమక్రమంగా హాయవాతా బాగా నీరసపడిపోయాడు. చివరికతనికి ప్రాణాపాయంకూడా కలిగే పరిస్థితి ఏర్పడింది. నోకోమిస్ మరి చేయగలిగిన దేదిలేక హాయవాతా ప్రాణం రక్షించమని కులదైవానికి వెయ్యి మొక్కులు మొక్కుకుంది.

ఆ మరునాటి రాత్రి హాయవాతా బాగా నీరసపడికళ్లుమూసుకొన్న సమయంలో ఆ ప్రాంతంలో నలువైపులు వేయినెమళ్ళు ఒక్కసారిగా నృత్యం చేసినట్టు పచ్చపచ్చని వెలుగులు వ్యాపించాయి. అంతలోనే ఒళ్ళంతా నెమలిపింఛాలు కప్పుకున్న ఒక విచిత్రవ్యక్తి అతనిముందు సాక్షాత్కరించి మేఘగభీరస్వరంతో ప్రసంగించాడు :

'హాయవాతా! నా పేరు మోందామిన్. నేనెవరినో తెలుసునా! మీ కులదైవందూతని! నీ కోరిక నెరవేరాలంటే వెంటనే లేచి నాతో కుస్తీపట్టి ఓడించాలి! నువ్వు దీనికి సిద్ధపడగలవా? లేదా!'

అంతటి నీరస పరిస్థితిలో ఉన్నా హాయవాతా మోందామిన్‌తో తలపడి మల్లయుద్ధం కొనసాగించాలనే నిశ్చయించాడు! యుద్ధంమాట తలపెట్టగానే లోలోపలినించి అతని కెక్కడలేని సత్తువ పుట్టుకొచ్చింది. తటాలున లేచి హుంకరించి మోందామిన్‌తో తలపడ్డాడు. మరికొంతసేపలాగ కుస్తీ పట్టిన తరవాత హాయవాతా బాగా తూలిపోయాడు. కాని ఎంతో ఒడుపుగా మోందామిన్ మీదికురికి చిత్తుచేసి మహోత్సాహంతో గొంతెత్తి గర్జించాడు! మోందామిన్ ఓడిపోయానని ఒప్పుకున్నాడు. కాని తిరిగి రెండు మూడుసార్లు తనతో కుస్తీపట్టి జయిస్తేనేగాని పూర్తిగా ఓడిపోయినట్టు కాదని హెచ్చరించాడు. ఆ మల్లయుద్ధంలో తాను మరణిస్తే శరీరంమీద ఒక చక్కని సమాధి కట్టించవలసినదని కోరుకున్నాడు. అందువల్ల హాయవాతా కోరిక తప్పక ఫలించగలదని భరవసా ఇచ్చాడు. హాయవాతా ఆ నియమాని కంగీకరించిన తరవాత మళ్లీ వాళ్లిద్దరిమధ్య కుస్తీ ప్రారంభమయింది. రెండోసారి హాయవాతా పూర్తిగా చిత్తయిపోయాడు. కాని ఆఖరిసారి మాత్రం మోందామిన్ రక్తం కక్కుకుని కుప్పగా నేలమీద కూలి మరణించాడు. ఆడినమాట తప్పక హాయవాతా అతని మృత శరీరంమీద రంగురంగుల రత్నాలతో సైనికుల సాహాయ్యంతో చక్కని సమాధి నిర్మించాడు.

ఆనాటినించి హాయవాతా రాజ్యంలో అంతట వానలు కొట్టి కురిశాయి! కోకొల్లలుగా పంటలు పండాయి. క్రమక్రమంగా మరి కొంతకాలం గడిచిన తరవాత హాయవాతా రాజ్యం అంతా పాడిపంటలతో సిరిసంపదలతో పసిపాపలతో పచ్చని తోరణాలతో కలకలలాడింది!

హాయవాతా తన రాజ్యంలో ప్రజలందరు సుఖపడుతున్నందుకు చాలా సంతోషించారు. తండ్రికిచ్చిన వాగ్దానం అక్షరాలా చెల్లించుకున్నానని ఆనందించాడు. కాని అతనికి జీవితం అంతా వట్టి ఎడారిలా కనపడింది. 'ఈసమయంలో మిన్నెహాహా నా సరసన ఉంటే ఎంత బాగుండును!' అని లోలోపల ఎంతో ఉబలాటపడ్డాడు. కాని ఏం లాభం! ఎన్నెన్నివిధాల ఆలోచించినా అతనికి మిన్నెహాహా వివాహాని కెక్కడ దారి కనపడ లేదు. ఎంతపని జరిగింది! మకారియో వాగ్దానం చేసినప్పుడు మొట్టమొదటే మిన్నెహాహా నిచ్చి వివాహం చెయ్యవలసిందని అడిగి ఉండవలసినది!! అని మాటిమాటికి మధనపడ్డాడు. క్రమక్రమంగా ఆ విచారంతో హాయవాతా బాగా చిక్కి శల్యమైనాడు!

ఇంకా ఉంది

---

అమెరికా మాజీ అధ్యక్షుడు కాల్విన్ కూలిడ్జ్ చాలా మితభాషి. ఒకసారి ఎవరో చిత్రకారుడు ఆయన బొమ్మ వేసి ఇచ్చాడు. ఆయన భార్య దానిని గోడకి తగిలించింది. దానిని చూస్తూ నుంచునిఉన్న కూలిడ్జ్ వద్దకు ఒక సెనేటర్ వచ్చి తనూ బొమ్మ చూస్తూ నుంచుని ఉండిపోయాడు. కొన్ని నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"నా అభిప్రాయం కూడా అంతే," అన్నాడు కూలిడ్జ్ చివరికి.

ఎస్. కోదండరామయ్య (నెల్లూరు)

---







# వెండితెర వెలుగు శారద

21—వ పేజీ తరువాయి

ఉన్నాయి. ఇవి తలపుకు వచ్చినప్పుడల్లా నా ఒళ్ళు జలదరిస్తుంది. ప్రసాద్‌గారిసంస్థలో జేరిన మూడోనెలకు నాకు 'టెస్ట్' తీశారు. నాకు డ్రస్సు వేసి, మేకప్‌వేసి, స్టూడియోకు తీసుకెళ్ళి కెమెరా ముందు నించోబెట్టారు. చెప్పవలసిన సంభాషణలను ముందే కంఠతా పెట్టుకొని ఉన్నాను. లైట్లు వేశారు — నన్ను చెప్పమన్నారు. నా ప్రాణం పోయింది ! ఒళ్ళంతా చెమటలుపోసింది. నాలిక తడి ఆరిపోయింది. నోట్లోంచి ఒక్క మాట కూడా బయటకు రావటంలేదు. నా పరిస్థితిని గ్రహించి అందరూ నన్ను 'భయంలేదమ్మా. చెప్పు' అన్నారు. ఏం చెప్పానో నాకే తెలీదు. మేకప్ 'డ్రస్సు' మార్చి మరో షాట్ తీశారు, అక్కడ వేడెక్కిన శరీరం, మూడు రోజులదాకా



మామూలుగా

అలాగే ఉంది. ఆ మూడురోజులూ చెప్పలేనంత జ్వరం ! .... 'ఇద్దరు మిత్రులు' మొదటి రోజున కూడా అట్లాగే ఐంది. అంతకు మునుపు 'తండ్రులూ కొడుకులూ' లో వేషంవేసినా, కెమెరా అంటే భయం పోయినా, అదేమిటో ఆరోజున మళ్ళీ భయం వేసింది. ఎందుకంటే, పెద్ద సంస్థ, పెద్ద నటులు .... పైగా మొదటి రోజే నేను నాగేశ్వరరావుగారి ప్రక్క నటించటం, అంతకంటె పైగా, ఆయన తాగి క్రింద పడి ఉన్నప్పుడు ఆయనను తట్టి లేపటం ! ఈ దృశ్యం నాకు డైరెక్టరుగారు చెప్పగానే ముచ్చెమటలు పోశాయి. ఏమవుతుందోనని భయం. ఐతే, నాగేశ్వరరావుగారూ, మధుసూదనరావుగారూ, సుబ్బారావుగారూ నా భయాన్ని పోగొట్టారు. భయపడకుండ, నేను చెయ్యగలిగేంత సేపు దాకా నాచేత చేయించారు. ఐనా, లోపలున్న భయం లోపల ఉండనే ఉన్నది ! .... మొత్తంమీద చెప్పాను. ఈ రెండు దృశ్యాలూ గుర్తుకొచ్చినప్పుడల్లా నాకు భయమే ! ఐతే, పెద్దవారి మధ్య నటించటం ఏమీ కష్టంకాదు——వారి మధ్య ఉంటే చాలా హాయిగా, చక్కగా నటించవచ్చుననే విషయాన్ని తెలుసుకున్నాను. ఎంచేతంటే, అడుగడుగునా వారు మెళకువలు నేర్పుతూనే ఉంటారు" అన్నది శారద, కళ్ళతో వారికి కృతజ్ఞతలు చెబుతూ. ★

# మొదటి ఓటమి

7-వ పేజీ తరువాయి

క్లాసులో ఉన్నవాళ్లంతా ఎంతో కుతూహలంగా వింటున్నారనే భావనతో చెప్పుకుపోతున్నాడు.

'ఈయన ఎవరో వెనకటి జన్మలో రాజకీయ నాయకుడయి ఉండాలి. కాకపోతే ఎదుటివారి బాధను కొంచెమయినా గమనించకుండా ఇంత అవస్థ పెడతాడా' అనుకున్నాడు ఆ యేడే కాలేజీలో చేరిన మాధవరావు.

'కొత్తగా వచ్చాడు గదా! పైగా ముందు వరుసలో ఆడపిల్లలు కనపడుతున్నారాయె. ఏదో కోస్తున్నాడు' రంగారావు పళ్లికిలించాడు.

"నయాగరా వాటర్‌ఫాల్స్' ... అబ్బ .... ఎక్కడినించి తెప్పించారు బాబూ ఈయన్ని ....

'అబ్బే! యింతకుముందు ఎక్కడా పని చేయలేదుట. ఇదే మొదలు ఉద్యోగానికి .... మన ప్రాణం తీయటానికి.' రామారావు అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

'అబ్బబ్బ! ఏం వాగేస్తున్నాడ్రా బాబూ!' శ్రీధర్ చెవులు మూసుకున్నాడు, ఒక కన్ను మూసి ప్రక్క సీటులో కూర్చున్న అమ్మాయిలవేపు చూస్తూ తనకు తనే మురిసిపోతూ.

ఇంతమందిలోనూ కొత్తగా వచ్చిన ఎకనమిక్స్ లెక్చరర్ కుశాలరావు వాగ్ధాటిని ఆకరించగలిగింది ఒక్క వనజను మాత్రమే. వనజ తదేకంగా హితంలో లీనమై పోవటం గమనించిన పంకజం 'ఏమే పరమాత్మలో లీనమై పోతావా ఏం!' అని మోచేత్తో పొడిచింది.

వనజకు చెప్పరానంత చికాకు వేసింది ఇటు ప్రక్క కూచున్న వసంత 'వనబోసిన పిట్టలాగ అలా వాగుతున్నా డేమిటి. 'సంవత్సరం కోర్సంతా ఇవ్వాళే చెప్తాడేమిటి చెప్మా!' అంది వనజ చెవు దగ్గరగా నోరు పెట్టి. ఈలోగా ఒక పావుతావు, పైజుమీద అష్టవంకర్లుగా ఒక మనిషి బొమ్మ వేసి ఆ బెంచీలో ఉన్నవాళ్లందరికీ పంపింది తాయారు. ఆ బొమ్మనుచూసి ఎదురుగా ఉన్న లెక్చరర్‌ను చూసి వాళ్ళల్లోవాళ్లే నవ్వుకోవడం మొదలుపెట్టారు పెద్దగా నవ్వేందుకు వీల్లేదు లోపల్నించే తెరలు తెరలుగా వస్తున్న నవ్వును ఆపుకుంటూ అవస్థ పడుతున్నారు. వనజ మెల్లిగా ఆ కాగితాన్ని అందుకుని ముక్కలుగా చించి బల్లకింద పోసింది.

కుశాలరావు షర్టుచేతిని పైకి లాక్కుని టయిము చూచాడు. ఇంకా పది నిముషాలుంది పీరియడ్ అయిపోవడానికి. వాతావరణం అనుకూలంగా లేదనుకున్నాడు. ఇదే తను తీసుకున్న మొదటి క్లాసు. అయినా అభాసు కానందుకు సంతోషించాడు తను చదివే రోజుల్లో కొత్తగా వచ్చిన లెక్చరర్ ఒకాయన్ని ఏడిపించి కళ్ళనీళ్ల పర్యంతం చేసి వదలిపెట్టారు. దానితో పోల్చుకుంటే యిప్పుడు క్లాసులో చెలరేగుతున్న దుమారం నాలుగోవంతు కూడ లేదు ఇంకా అయిదారు క్లాసులదాకా యీ గొడవ భరించక తప్పదు.

ఇంతలో బెల్ అయింది. కుశాలరావు తల వంచుకుని స్టాఫ్‌రూములోకి వెళ్ళిపోయాడు.

'ఎలా ఉంది మా కాలేజి?' అన్నాడు హిస్టరీ డిపార్టుమెంటు మోహనరావు.

'బాగానే ఉందండీ. స్టూడెంట్సు కూడ అంత అల్లరి చిల్లరివాళ్ళు కూడ కాదు' అన్నాడు, కుశాలరావు కొంచెం 'టై' సదులు చేసుకుంటూ.

మోహనరావు భావగర్భితంగా నవ్వాడు.

కుశాలరావుకు ఆరోజు అదొక్కటే క్లాసు అయినందువల్ల నాలుగు గంటలదాకా స్టాఫ్ రూములోనే మాగజైన్సు చదువుతూ కాలక్షేపం చేసి, ఒకసారి ప్రిన్సిపాల్ రూములోకి వెళ్లి సెలవు తీసుకుని రూముకు బయలుదేరాడు.

మెయిన్ రోడ్డంట వెళ్తుంటే హోటలు బోర్డు కనపడగానే కాఫీ తాగాలనిపించింది. లోపలికి అడుగుపెట్టాడు. చాలా రద్దీగా ఉంది. రెండు నిమిషాలు నాలుగు వేపులా చూసి ఒక మూల ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. సర్వరుతో కాఫీ తెమ్మని చెప్పాడు.

కూర్చున్న ముగ్గురూ ఏదో టిఫిన్ తింటున్నారు. తను రావడంవల్ల వాళ్ల ముఖాల్లో ఏదో మార్పు గోచరిస్తున్నది. ఒకళ్ల ముఖాలు ఒకరు చూసుకుంటూ కళ్ళతోటే మాట్లాడుకుంటున్నారు.

కుశాలరావది గమనించి 'మీరు ఏమి చదువుతున్నారు' అని అడిగాడు, ఎదురుగా కూచున్నతన్ని ఉద్దేశించి.

'బి. ఏ' థర్డ్ యియర్ సార్' అన్నాడు.

'మీరు!' అని మిగతా యిద్దర్ని అడిగాడు.

'ఇతనూ, నేను కూడా బి. ఏ ఫైనలే!' అన్నాడు ఆ ఇద్దర్లో ఒకతను.

'ఎకో! మీదీఊరేనా' అని అడిగాడు కుశాలరావు మొదటి అతన్ని.

'ఈ వూరేనండీ' అని బిడియపడుతూ సమాధానం చెప్పాడతను

'ఎకో!' అని కళ్లజోడు తీసి మళ్లా పెట్టుకున్నాడు కుశాలరావు.

ముగ్గురూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు

కాఫీ తాగటం పూర్తిచేసిన కుశాలరావు సర్వరిచ్చిన బిల్లు అందుకుని లేచి చిరునవ్వుతో వాళ్ల వేపు చూచి అక్కడినుంచి వెళ్లిపోయాడు.

'ఎకో!' అన్నాడు రంగారావు సీరియస్‌గా మొహం పెట్టి ఇమిటేషన్ ఫోజులో.

రామారావు మాధవరావు నవ్వారు.

'సోషల్ క్రీచరే. ఫర్వాలేదు' అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు రంగారావు

వారం రోజులు గడిచింది. ఆ వారం రోజుల్లోను మూడు క్లాసులు మాత్రమే తీసుకున్నాడు కుశాలరావు

కుశాలరావొక కొరకరాని కొయ్యగా తయారయ్యాడు క్లాసులో ఎంత అల్లరి పెట్టినా చీమ కుట్టినట్టయినా ఖాతరు చెయ్యకుండా పాఠం చెప్పుకుపోతాడు ఎత్తెత్తు మాటయినా అనడు క్లాసులో.

ఒకనాడు కుశాలరావు క్లాసు రూములోకి వచ్చేటప్పటికి బోర్డుమీద రాసిఉన్న 'ఎకో' అనే మాట ఆకర్షించింది. క్లాసు అంతా నిశ్శబ్దంగా ఉంది

బోర్డువంక ఒకసారి చూసి 'ఎకో' అని

ఇంటిల్లిపాదికీ ఆనందం చేకూర్చే
ఆంధ్రసచిత్రవారపత్రిక
తప్పక చదవండి!

సినీతారల ఫోటోలు
మీ అభిమాన సినీతారల ఒరిజినల్ ఫోటోలు అందమైన పోజులలో
డజను వెల: రు. 5/-.
పోస్టేజి రు. 1/- అదనం.
CINE PHOTO DISTRIBUTORS
(P O) Relangi (W.G.) A.P

నెలకు రు. 200 సంపాదించండి
డ్రాయింగ్&పెయింటింగ్ పుస్తకం.352 చిత్రపటములుగల పూర్తి గైడ్. సులభపద్ధతులలో బొమ్మలువేయుట, పెయింటింగ్, రంగులను కలుపుట, ఇతర డ్రాయింగ్ పనులు, స్టెన్సిల్స్ వగైరా పనులు నేర్చుకొనుటకు ఉపకరించును. ఈ పుస్తకం సహాయంతో మీరు చక్కని డ్రాఫ్ట్స్‌మెన్, డ్రాయింగ్‌మాస్టర్, పెయింటర్, ఆర్టిస్టు (డిజైనర్) కావచ్చును. ప్రఖ్యాతిపొంది ధనం సంపాదించవచ్చును. ధర రు. 6/-ఎంబ్రాయిడరి డిజైన్లు: ఏర్చి తీసిన 250 నవీన డిజైనులు. పాట్రనులు, పూలు, పిన్ను, వగైరా వివరములతోసహా ధర రు.5 పుస్తకము 1 కి పోస్టేజి రు. 1
VANDANA BOOK DEPOT.,
(APW) Rafatganj, Aligarh (U.P.)

మంచి పుస్తకాలు
జీవిత రహస్యాలు - మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు - రూ 3-50
యువతి - స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు ... రూ 3-50
సంతానము - గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు ... రూ 3 50
అమ్మక రహస్యాలు - వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు రూ 6-00
ఉద్యోగదర్శిని - మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు రూ 5-00
ఆత్మజ్ఞానము - శరీరానంతరం ఆత్మను గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు రూ 2-50
పోస్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీయింటికి పంపబడును
దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర

మంచి రహస్యం
గ్లోరియా ద్రవాన్ని, మీ ముఖానికి రుద్ది తుడిచినంతలో అద్భుతమైన కాంతిని, మంచి అందాన్ని వెంటనే తెచ్చును, ముఖంలో ముదిరూపును పోగొట్టి చక్కని లేతదనాన్ని తెచ్చును ఎండకువచ్చే నలుపును, మొటిమలను నమ్మకంగా పోగొట్టును
వెల రూ 1-75 అన్ని షాపుల్లో దొరుకును
JANITA PRODUCTS, ELURU, A.P.

పామొలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!

మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకో గలరు. పామొలివ్ సౌందర్యరక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి

మొదటి రోజు నుండే, పామొలివ్ సౌందర్య రక్షణ మీ దేహకాంతికి క్రొత్త శోభను యిస్తుంది. భారత దేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేరిన పామొలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడ వంటి నురుగు ఎంతో శుభ్రపరచి, మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది. సౌందర్య పోషక తైలములు చేరిన పామొలివ్ సబ్బునే ఎల్లప్పుడూ వాడి చిన్న చిన్న కళంకములు చాల తక్కువగుట, ఎక్కువ మృదుత్వము, మరియు నునుపు, తాజాయైన మరియు నిర్మలమైన చర్మము, ఎక్కువ శోభాయమానమైన అందమగు దేహకాంతి మొదలైన వర్చస్సులతో కలిసే అభివృద్ధిని మీరు చూడగలరు!

**భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములతో తయారైనది!**




**పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామొలివ్ సబ్బుతో స్నానము చేయండి!**

# మొదటి ఓటమి

పెద్దగానే అనేసి పాఠం చెప్పటాని కుపక్ర మించాడు.

క్లాసంతా గొల్లుమన్నారు. కాని ఒకే ఒక వ్యక్తి మౌనంగా తల వంచుకుని కూర్చున్నది వనజ—కుశాలరావు గమనించాడు. ఆమె కిటువంటివి అస హ్యమేమో అనుకున్నాడు. లేకపోతే తనంటే ఆమెకు ఏర్పడిన సదభిప్రాయంవల్ల అట్లా మౌనంగా ఉండిపోయిందేమో ననుకున్నాడు.

బహుశ ఆరోజున హొటలులో కలిసిన ముగ్గు రిలో ఎవడో ఈపని చేసి ఉండాలనుకున్నాడు కుశాలరావు. పాఠం చెబుతూనే క్లాసంతా వెతి కాడు. ఆరోజు తనను పలుకరించిన ముగ్గురు ఒకరి ప్రక్కన ఒకరు జట్టుగా కూర్చున్నారు ఏమీ ఎరగనట్టు.

ఆరోజున స్టాఫ్ రూములో తన క్లాసులో జరిగిన సంఘటనను వివరించాడు కుశాలరావు. తనకు అనుమానం కలిగిన ముగ్గురి పేర్లూ చెప్పాడు.

'భలేవాడివయ్యా కుశాలరావు ! రామారావు మా తమ్ముడేనయ్యా వాడలాంటివాడు కాడు. రంగారావు, మాధవరావు కూడా తెలుసు నాకు. అలాంటి గుణాలు లేవే !' అని వాళ్లను సమర్థిం చాడు మోహనరావు.

'ఆ ! యిటువంటివి సహజమే లెండి. మన రోజుల్లో మనం ఎంతమందిని అల్లరి పెట్ట లేదు.' అన్నాడు ఇంగ్లీషు లెక్చరర్ సాంబశివరావు.

'దటీజ్ ఆల్‌రైట్.' ఆ విషయాన్ని అంతటితో తుంచివేశాడు కుశాలరావు.

ఇంగ్లీషు లెక్చరర్ మొహంలోకి చూచాడు మోహనరావు. సాంబశివరావు బుజాలెగరేశాడు.

మళ్లీ రెండు రోజులదాకా కుశాలరావుకు క్లాసు తీసుకోవలసిన అవసరం లేదు. రూములో ఏమి తోచదు. ఊరు కొత్త. మనుషులు కొత్త. వాతా వరణం అంతా కొత్తగా ఉంది.

నాన్నగారు ఎంతో చెప్పారు. లెక్చరర్ ఉద్యోగం వద్దని, ఆయన ఉద్దేశం. ఏ గవర్నమెంటు ఉద్యో గమో, లేక లైఫ్ ఇన్స్యూరెన్స్ లాంటి వాటిలోనో ఉద్యోగానికి ప్రయత్నం చెయ్యమని ఆయన సలహా యిచ్చారు. కాని తనకు లెక్చరర్ జీవితమే మంచి దనిపించింది. ఇన్స్యూరెన్సు కంపెనీకి అప్లయి చేశాడు. ఇంటర్వ్యూ వచ్చింది. కాని ఏదో సాకు చెప్పి తప్పించుకున్నాడు. రెండు నెలల తర్వాత ఒక నాడు అనుకోకుండా ఈ ఆర్డరు వచ్చింది. సంవత్సరం క్రితం పెట్టిన అప్లికేషన్‌కు జవాబిది.

ఆర్డరు చేతికి వచ్చినపుడు తండ్రి ఇంటి దగ్గర లేడు. తిరిగి వచ్చేటప్పటికి ఆలశ్యం కావచ్చు. అందుకని వెంటనే బయలుదేరి ఇక్కడికి వచ్చి జాయినయిం తర్వాత యింటికి ఉత్తరం వ్రాశాడు. తండ్రి సంతోషిస్తూ ఉత్తరం వ్రాశాడు. అందులో ఒక సలహా కూడా ఇచ్చాడు. ఇతరత్రా అయితే ఉన్నత పదవిలోకి వెళ్లడానికి అవకాశా లుంటాయి. అధికారం చేతిలో ఉంటుంది. చేతి కింద కావలసినంత మంది మనుష్యు లుంటారు.




## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన దర్శనుసరించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామా యున్ను వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రమే వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైనపంప బడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. Dev Dutt Shastri, Raj Jyothishi (W. P.) JULLUNDUR CITY.

## నెరసిన శిరోజాల గురించి చింతించ నక్కర్లేదు

హెయిర్ ఆయిల్‌గా లోమ మీరు వాడితే చాలు

సోల్ ఏజెంట్లు అండ్ ఎగుమతి వార్లు :
ఎమ్.ఎమ్. ఖంభట్ వాలా, అహమదాబాద్ (భారతదేశం)
ఏజెంట్లు : పి. నరోత్తమ్ అండ్ కో., బొంబాయి-2









మద్రాసు ఏజెంటు : మెసర్సు బలభాయ్ & కంపెని. మద్రాసు.
ఎగుమతి వివరాలకన్నిటికి మెసర్సు ఎం. ఎం. ఖంభట్ వాలా అహమ్మదాబాద్ వారిని సంప్రతించండి. శ్రీకాకుళం స్టాకిస్టు: శ్రీకృష్ణ మెడికల్ &జనరల్ స్టోర్సు, శ్రీకాకుళం. భీమవరం స్టాకిస్టు: మెసర్సు: గుండు అక్కిరాజు&సన్సు, భీమవరం.

# వసంతి సౌందర్య రహస్యం...

## 'నా చర్మ సౌందర్యానికి లక్స్ అనువైనది!'



మురాదే ముద్దు పదములు-వసంతి
సౌందర్యానికి మార్గ దర్శకం ... లక్స్
టాయిలెట్ సబ్బు! లక్స్ వాడండి ...
దాని సౌమ్యమైన నురగవల్ల
పెంపొందే మీ రూప లావణ్యం అపు
రూప సుందరం. లక్స్ వాడితే ...
సర్వవ్యాప్తమైన దాని పరిమళం
ప్రత్యక్షంగా మీ అంద చందాలను
విస్తరింప జేస్తుంది. లక్స్ వాడండి ...
వానవెల్లి రంగులలో, మీ ప్రియమైన
తెలుపులో దేనినైనా ఎన్నుకోండి.
మీ సౌందర్యానికి కూడా అనువైనది
కోమలమైన లక్స్.

సినీమా తారలకు
సౌందర్యమునిచ్చే శుద్ధమైన.
సౌమ్యమగు సబ్బు.




'రంగులు సుందరం...సబ్బులు మనోహరం!' అన్నది సొగసైన సినీమా తార వసంతి

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

LTS. 122-X52 TL

# మొదటి ఓటమి

లెక్చరర్ ఉద్యోగం ఎన్నాళ్ళు చేసినా ఎదుగు బొదుగు ఉండదు. ఇప్పటికయినా మించిపోయింది లేదు. ఆలోచించుకుని ఓ నిర్ణయానికి రమ్మని వ్రాశాడు. కుశాలరావు ఎం. ఏ. ఎకనమిక్స్ మెయిన్‌తో ఫస్టు క్లాసులో ప్యాసయి వచ్చాడు. అతని అభిరుచి ఎంతసేపు కాలేజి వాతావరణంలోనే సుఖం ఉందనే భావనతో నిండిపోయింది.

అందుకే గుంటూరునుంచి మూడు వందల మైళ్ల దూరం వచ్చాడు.

సాయంత్రం నాలుగయింది. పెరటిలో కుళాయి దగ్గరకు వెళ్లి ముఖం కడుక్కుని బట్టలు మార్చుకుని రూముకు తాళంవేసి బయలుదేరాడు. రోడ్డుమీద రెండడుగులు వేశాడో లేదో చేతిలో పుస్తకాల దొంతరతో వనజ ఎదురైంది!

'ఈ అమ్మాయి ఈ వీధిలోనే ఉంటున్నదన్న మాట !' అని స్వగతం పలుక్కున్నాడు. వనజ తల వంచుకుని పక్కనించి నడిచి వెళ్లిపోయింది.

పదడుగులు ముందుకువేసి మనసు నిగ్రహించుకోలేక వెనకకు తిరిగి చూశాడు. ఆశ్చర్యం ! వనజ తను ఉంటున్న ఇంటి ప్రక్క ఇంట్లోనే ఉంటున్నది. అందుకే ఆమె క్లాసులో అంత మౌనంగా ఉంటుంది. దానికి కారణం భయమే అయిఉంటుంది. ఎంత అందంగా ఉన్నది. ఇంత అందమయిన పిల్ల తనకు శిష్యురా లన్నమాట ముందు బెంచీలో కూచున్న మిగతా ఆడపిల్లల్ని చూచాడుగాని ఈమెలో ఉన్న ఆకర్షణ మిగతా వారిలో లేదు. తనకలా అనిపించింది. అయినా ఏమిటీ ఆలోచనలు ! ఏ అమ్మాయి ఎలా ఉంటే తనకెందుకు .... అందుకే బ్రహ్మచారి శతమర్కటః' అన్నారు. మనసు అతి చంచలమయినది. మనోనిగ్రహం కావాలన్నారు పెద్దవాళ్లు ప్రస్తుతానికి కాసిని కాఫీనీళ్లు పడితేకాని నిగ్రహించేట్టు లేదనుకుని పక్కన కనిపించిన హొటలులోకి నడిచాడు.

కాఫీ తాగింతర్వాత మెయిన్‌రోడ్డు పొడవు ఎంత ఉన్నదో కొలుచుకుంటూ రైలుస్టేషన్ దాకా వెళ్లాడు. చీకటి పడిందాకా ప్లాట్‌ఫారంమీద పచార్లు చేశాడు. చివరకు విసుగుపుట్టి ఇంటిదారి పట్టాడు.

దారిలో హొటల్లో భోజనం ముగించుకుని రూముకి వెళ్లేటప్పటికి తనకోసం ఎవరో గడపల్లో కూచుని ఎదురు చూస్తున్నట్టు ఉన్నది.

'ఎవరూ' అని అడిగాడు కుశాలరావు.

'నేనేనండి. ఈ పక్క ఇల్లే మాది. నాపేరు అనంతరావు. మీతోటి ఓ విషయం చెబుదామని...' అన్నాడు, మెట్లమీద కూచున్నవాడు లేచి నించుని.

కుశాలరావు రూము తాళంతీసి లోపల లైటు వేశాడు. అనంతరావుగారు కూడ లోపలికి వచ్చి చాపమీద కూచున్నాడు.

'పాపం మీరు ఈ ఊరికి కొత్తగా వచ్చారా...' అన్నారాయన.

'అవునండి. ఇటువేపు రావడం కూడ యిదే




డాక్టరు జాన్సన్సు
చవనామృతము
అందరికి టానిక్కు
బాలరక్ష
పిల్లల ఆరోగ్యముకు
ఏజంట్లు: లక్ష్మీనారాయణకంపెనీ
— కాకినాడ —

కోరు వారికి
సూచీపత్రములు
పంపుదుము.
★
స్టాకిస్టులు
కావలెను
★
లక్ష్మీనారాయణ
కంపెనీకి
వ్రాయండి.



పిల్లల ప్రపంచములో
ఎల్లప్పుడు న్యూట్రైన్ అనే మాటే

Nutrine Sweets

న్యూట్రైన్ కన్‌ఫెక్షనరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్

ఇంటిల్లిపాదికీ ఆనందం చేకూర్చే

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

తప్పక చదవండి !






హ్యూలెట్స్ మిక్చర్
వాడి వెంటనే విముక్తి పొందండి

మీ వృత్తి కూర్చున్నచోటునుండి కదలనవసరం లేనిది, శాయకష్టం లేనిది అయితే మీరు తరచు జీర్ణశక్తి కోల్పోయి బాధపడతారు. ఎందుకలా బాధపడాలి? హ్యూలెట్స్ మిక్స్చర్ వెంటనే శాశ్వతమైన నివారణ నిస్తుంది. అది జీర్ణకోశం లోపలి భాగమున సురక్షకమైన పూతగా నేర్పడి అందలి చిరాకు కల్గించు ఆమ్లసారములను విస్సారముచేసి ఆహారము సక్రమంగా జీర్ణమగుటకు తోడ్పడును.

హ్యూలెట్స్ మిక్స్చర్ వల్లని జీర్ణాశయ బాధలకు కూడా చక్కగా పనిచేస్తుంది. అధికంగా విరేచనాలవుతుంటే వల్లమందు చేర్చిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను తీసుకోండి.

హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి తోడ్పడును.

సి.జె. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్

86/A నైనియప్ప నాయకన్ వీధి, మద్రాసు-3




JWT-CJH-1928


# మొదటి ఓటమి

మొదలు' అన్నాడు కుశాలరావు.

'ఉద్యోగం కూడా కొత్తే ననుకుంటాను' అన్నాడాయన నవ్వుతూ.

'అవునండీ' అన్నాడేగాని ఆయన ఇదంతా ఎందుకు అడుగుతున్నాడో తెలీలేదు.

'నేను అనవసర విషయాలు ప్రస్తావించుతున్నా ననుకోకండి! మరేమీలేదు. మా అమ్మాయి మీ గురించి మంచి అభిప్రాయం వెలిబుచ్చింది. చాలా బాగా చెబుతారట. అసలు మా అమ్మాయికి ఎకనమిక్స్ బాగా రాదు .... మీరు చాల బాగా చెబుతారట. కాని క్లాసులో అల్లరిమూక గొడవ ఎక్కువయుందని, అందులో మీరు కొత్తవటంమూలాన్ని ఇంకా కొంచెం ఎక్కువ మోతాదులోనే అల్లరి పెడుతున్నారనీ మా వనజ చెప్పింది.'

'ఓహో అలాగా' అన్నాడు కుశాలరావు ఏమి అనకపోతే బావుండ దనుకుని. ఇప్పుడీ వనజకు ప్రయివేటుగాని చెప్పమనడు గదా అనుకున్నాడు.

'ఈ అల్లరిమూక ఆగడం మరీ మితిమీరుతోంది రోజురోజుకు. మీరలా మెత్తగా ఊరుకుంటే లాభంలేదు. గట్టిగా క్లాసులో బుద్ధి చెప్పాలి. అసలు సంగతి చెప్పడం మానేసి ఉపోద్ఘాతం చెప్పాను. రేపు మీరు క్లాసుకు వెళ్లగానే టేబిలుకింద ఆటంబాంబు పెట్టడానికి పన్నాగాలు చేసుకుంటున్నారుట. అది మా వనజ చెవిన పడింది. మీతో చెప్పమని ఇందాకటినుంచి పోరుతున్నది. మీరు మాత్రం ముందు జాగ్రత్త తీసుకోండి' అన్నారు అనంతరావుగారు చాపమీదనుంచి లేస్తూ.

'చాల థ్యాంక్సండీ' అన్నాడు కుశాలరావు నవ్వుతూ.

ఆ రాత్రంతా తీయని తలపులతో సతమతమయి సరిగా నిద్రపోలేదు కుశాలరావు. 'వనజ' ముచ్చటయిన పేరు. పేరుకు తగిన అందము, ఆకర్షణ, వినయం, విజ్ఞానం అన్నీ మూర్తీభవించిన సుకుమార సుందరే వనజ. ముందు బెంచీలో కూచుని తనవేపే చూస్తూంటుంది. 'తొలిచూపులోనే వలపు' కాదుగదా!'

అయినా తనంటే ఎందుకింత అభిమానం. తను కష్టపడితే ఆమె చూడలేదా! తనని క్లాసులో అల్లరి పెడతారనేగా ఆమె బాధ. ఆ బాధ వెనకనే దాగిఉంటుంది, మధురానుభూతి అనే రెండక్షరాల 'ప్రేమ.'

వనజ అందమయినదే. పెళ్లికూతురుకి తగిన ఆకర్షణలన్నీ ఆమెలో ఉన్నాయి. ఈ ఏటితో చదువు అయిపోతుంది. ఆ తర్వాత గృహిణి అయిపోతుంది. ఆ తరువాత మాతృమూర్తి! అబ్బబ్బ! ఏమిటీ ఆలోచనలు. అర్థం పర్థం లేకుండ ?' అని విసుక్కుని కళ్లు గట్టిగా మూసుకుని పడుకున్నాడు, బ్రహ్మచారి అయిన కుశాలరావు.

* * *

థర్డ్‌బెల్ కొట్టిన అయిదు నిముషాలకు

కుశాలరావు హుందాగా నడిచి వచ్చాడు క్లాసు రూములోకి. అప్పటిదాకా రణగొణధ్వనిగా ఉన్న క్లాసంతా నిశ్శబ్ద మయిపోయింది.

చేతిలోని పుస్తకాలు టేబుల్‌మీద ఉంచాడు. మెల్లిగా. ముందు బెంచీలో ఉన్న వనజ కళ్ళు భయాందోళనతో బెదిరిపోతున్నాయి. వెనక బెంచీలో ఆఖర్న కూచున్న ముగ్గురి ముఖాలు విదా నందంతో వెలిగిపోతున్నాయి. 'లెక్చరర్‌గారు ఏదో ఒక క్షణంలో టేబిలు అనుకోక మానరు. ఆ వత్తిడికి బల్లకింద టపాకాయ పేలకమానదు. పేలిన వెంటనే ఆయన ఎగిరి ఒక గంతేస్తాడు. క్లాసంతా గొల్లుమంటుంది. అప్పుడు విజయం మనది' ఇలా అంచనాలు వేసుకుంటున్నారు. రంగారావ్, మాధవరావ్, రామారావ్.

అరగంట గడిచింది. శాపం పెట్టినట్టు, కుశాలరావు టేబుల్ తాకనయినా తాకకుండ తన పాఠం చెప్పటంలో లీనమయి పోయాడు.

ఇక పిరియడు అయిపోవడానికి పది నిముషాలుందనగా వనజ ముఖంలో భయం కొంత తగ్గింది. ఆమె మనస్సు తేలికపడింది. కుశాలరావు క్లాసయిపోయిం తర్వాత బయటికి వెళుతూ కృతజ్ఞతాపూర్వకంగా వనజవేపు చూశాడు.

'డామిట్ పథకం పారలేదు భాయ్' అని వాపోతున్నారు "హీరోలమనుకున్న" రావు త్రయం.

కుశాలరావు పాతికేళ్ల బ్రహ్మచారి. మనసు మధుర భావాలతో తేలిపోతుంటే ఈలపాట పాడుకుంటూ ఇంటిదారి పట్టాడు. వనజ ఒక పెద్ద సమస్యగా తయారయింది. కాలేజీలో తనకు ఎటువంటి పరాభవం జరగకుండ అంగరక్షకురాలుగా వ్యవహరించ దలుచుకున్నదేమో. ఈ రొక్షీ మూకకు హిస్టరీ లెక్చరర్ మోహనరావు సపోర్టు కూడా ఉన్నట్టు ఆయన మాటలవల్ల స్పష్ట మవుతున్నది. అంత వయస్సున్నది ఆయనకు, అనుభవమున్నది. కాని వికృతమయిన మనస్తత్వ మేమిటో అలా వెర్రితలలు వేసింది. తనకు తెలిసి ఏ అపకారము చెయ్యలేదు. ఒకరిని ఏడిపించి తాము ఆనందించడం కొంతమందికి సరదా!

కుశాలరావు ఆలోచిస్తూ రూములో పడుకున్నాడు. మనసంతా చికాకుగా ఉంది. బయట ఎవరో వస్తున్నట్టు అడుగుల చప్పుడయింది. ఆ ధ్వని వెంబడే అనంతరావుగారు లోపలికి వచ్చారు.

ఆయన్ను చూస్తూనే కుశాలరావు లేచి కూచుని చిరునవ్వుతో ఆహ్వానించాడు.

'ఏమీ తోచక ఇలా వచ్చానండి. మునిసిపాలిటీలోనే నా సర్వీసంతా అయిపోయింది. రిటయిరయి సంవత్సరం అయింది. పొద్దస్తమానం యింట్లో ఉండాలంటే కష్టంగా ఉంటుందనుకోండి!' అన్నారు అనంతరావుగారు చాపమీద కూచుంటూ.

.... 'ఆ! యివ్వాళ మరేమి గొడవ జరగలేదుగద' అని మళ్లీ ఆయనే అడిగారు.

'మీ దయవల్ల ఏమీ జరగలేదు.'

'నా దయ ఏముందండీ. మా అమ్మాయి ముందుగా తెలుసుకున్న విషయాన్ని మీతో చెప్పాను అంతే! .... ఇక్కడ నీళ్లు సరిపడినట్టేనా మీకు.

'ఇంకా ఏదండీ! వచ్చి నెల కూడ అవలేదు.







'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంపకోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరి కొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

తెలుగు వారపత్రికలన్నిటిలో 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' సర్క్యులేషన్ అత్యధికమైనది. ప్రకటనలను ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వేసి మీ వ్యాపారం అభివృద్ధి చేసుకొనండి. వివరాలకు అడ్వర్టయిజ్ మెంట్ మేనేజర్ 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' 7 తంబుచెట్టివీధి, మద్రాసు-1 కి వ్రాయండి.

WANTED AGENTS All over India ON COMMISSION
For booking orders of our Artistic Offset Calendars (in various sizes) & Plastic Advt. Novelties for New Year.
Special Arrangements for Advt. Printing in different Languages.
Even Part-time Agents may easily Earn Rs. 250/- per month as comm.
For Agency Terms Apply To-day
IN ENGLISH OR HINDI...
PRATIBHA CALENDAR MFG. CO.
PROPS.- PRATIBHA PRESS, LUCKNOW (U.P.)
LATOUCHE RD., LUCKNOW (U.P.)

పుస్తక ప్రియులకు అపూర్వ అవకాశం!

ఉచిత పుస్తకాలు!

క్రింది (ఏ) తరగతి పుస్తకాల్లో మీరు ఆర్డరిచ్చే ప్రతి పుస్తకానికి (బి) తరగతి పుస్తకాల్లో మీరు కోరిన ఒక పుస్తకం ఉచితంగా పంపుతాము. ఎన్ని (ఏ) తరగతి పుస్తకాలకు ఆర్డరిస్తే అన్ని (బి) తరగతిలోని పుస్తకాలు ఉచితంగా పొందవచ్చును. ప్రతి 5 పుస్తకాల ఆర్డరుకు మరో (బి) తరగతి పుస్తకం కూడ అదనంగా ఉచితంగా పంపబడును. పోస్టేజి అదనం.

| (ఏ) | | (బి) | |
|---|---|---|---|
| పథేర్ పాంచాలీ | 7-50 | భోగీర లోయ — బాపిరాజు | 1-50 |
| జీవనలీల | 6-00 | ఇదా నాగరకత ? — రాఘవ | 1-25 |
| రక్త సింధూరం — పి. రామమూర్తి | 6-00 | సంధ్యా రాగం — వింజమూరి లక్ష్మి | 1-50 |
| డోరియన్ గ్రే — ఆస్కార్‌వైల్డ్ | 4-50 | మానవుని హక్కులు | 1-35 |
| సౌత్రామా లేఖలు (900 పుటలు) | 10-00 | మనం—మన సంసారాలు — రమాదేవి | 1-50 |
| గాంధీ దర్శనం | 10-00 | నా దివ్య స్మృతులు — ద. వెంచయ్య | 1-50 |
| మన నగరాలు — | 5 00 | నవ భారత యుగోదయం | 1-50 |
| మన చారిత్రక ప్రదేశాలు | 5-00 | మన పుణ్యక్షేత్రాలు — రెంటాల | 2-00 |
| అమ్మ — గోర్కీ | 5-00 | ఆమె నీడ — బుచ్చిబాబు | 1-25 |
| మధుర జీవనం — గొర్రెపాటి | 4-00 | చింతన — రమాదేవి | 1-50 |
| కొడుకులు — కూతుళ్లు | 4-00 | మానవుడు—దానవుడు — భరద్వాజ | 1-25 |
| వంచితులు — సుధాంశు | 4-00 | చెప్పవేమ మాటలు — కన్నడ నాటికలు | 1-25 |
| చివరకు మిగిలేది — బుచ్చిబాబు | 4-00 | అనుబంధాలు (నాటకం) | 1-50 |
| కోనంగి — అ. బాపిరాజు | 6-00 | దేవదాసు — శరత్‌బాబు | 1-50 |
| పరిమళించిన పున్నమి — రాఘవ | 4-00 | పంకజం — రమాదేవి | 1-25 |

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2.

# మొదటి ఓటమి

ఇంతవరకూ ఏ బాధ లేకుండానే వెళ్లిపోతున్నది' అన్నాడు కుశాలరావు.

'మీరూ ఈ ఊరికి కొత్త. ఏదయినా అవసరం వస్తే మొహమాట పడకుండ నాతో చెప్పండి. చేతనయిన సహాయం చేస్తాను..... అన్నట్టు మీ ఇంటిపేరేమి టన్నారు !'

ఆయన ప్రశ్నకు లోలోపలే నవ్వుకున్నాడు. కులం, శాఖ ఏమిటని, అడగలేక ఇంటిపేరు అడుగుతారు కొంతమంది.

'ఫలానా' అని చెప్పాడు.

'అయితే మా శాఖే నన్నమాట' అని తన ఆనందాశ్చర్యాలను వెలిబుచ్చారు అనంతరావుగారు. ఆ తర్వాత చాలసేపు ప్రస్తుత రాజకీయాలమీద సంభాషణ నడిచింది. కొద్దిసేపయింతర్వాత ఆయన వెళ్ళిపోయాడు.

ఆరోజు వచ్చిన పేపరు తిరగేస్తుంటే రెండో పేజీలో ఇన్సూరెన్సుకు సంబంధించిన అడ్వర్టయిజ్ మెంటు అతన్ని ఆకర్షించింది. దీనికే ఇదివరకొకసారి అప్లయి చేశాడు. ఇంటర్వ్యూ వచ్చినా అప్పుడు వెళ్ళలేదు. అందులోకూడ మంచి భవిష్యత్తు ఉంటుందని స్నేహితులు చెప్పగా విన్నాడు. అకస్మాత్తుగా ఒక నిర్ణయానికి వచ్చి ఒక అప్లికేషన్ రాసి పడేశాడు.

రోజులు గడుస్తున్నాయి. కాలేజీలో ఏదో ఒక విధంగా తనను అల్లరి పెట్టాలని ప్రయత్నం చేస్తుండటం, కాని తనదే పైచేయి కావడం మామూ లయిపోయింది.

ఒకరోజున అనంతరావుగారు కుశాలరావుని భోజనానికి పిలిచారు. వాళ్ల ఇంట్లో వ్రతం ఏదో చేసుకుంటున్నారుట. ఎన్నో సాకులు చెప్పాడు కుశాలరావు వెళ్లకుండా తప్పించుకుందామని. కాని తప్పలేదు. ఆవేళ్టికి వెళ్లి భోజనంచేసి వచ్చాడు. వనజ జాడ కనిపించలేదా ఇంట్లో. బహుశా ఏ గదిలోనయినా కూచుని చదువుకుంటున్నదేమో.

'ఆడపిల్లలను కన్న తండ్రుల బాధ ఇలాగే ఉంటుంది. అనంతరావుగారికి తనమీద ఇంత అభిమానం కలగటానికి కారణ మేముంది. ఆయనకు లోపల ఏదో ఉద్దేశ్యం ఉన్నది.' ఇదీ కుశాలరావులో కలిగిన అభిప్రాయం.

'ఆ విషయం తనతో ముఖాముఖిగా ప్రస్తావించవచ్చుగా ! ఇన్ని విషయాలు మాట్లాడుతున్న వాడు ఆ సంగతి వివరించడంలో తప్పేముంది.' అనుకున్నాడు కుశాలరావు. వనజ తనకు తగినదే. అందుకు సందేహంలేదు. వాళ్ళు చేసుకోమని అడగాలే గాని తక్షణం ఒప్పుకోడానికి సిద్ధంగా ఉన్నాడు.

ఈ ఉద్దేశ్యం మనసులో కలిగినప్పటినుంచీ క్లాసులో వనజను చూడడానికే సిగ్గుగా ఉంటున్నది. కాని ఆమె మాత్రం అతను చెప్పే పాఠాన్ని శ్రద్ధగా, తదేకదృష్టితో వింటున్నట్టు గమనిస్తున్నాడు.

తను పెట్టిన అప్లికేషన్‌కు జవాబుగా ఇంట ర్వ్యూకి రమ్మని వచ్చింది. ఆ విషయం అనంత రావుగారు తన రూముకు వస్తే చెప్పాడు కుశాల రావు.

'వచ్చే శుక్రవారంనాడు యింటర్వ్యూకు హైదరాబాదు వెళ్లాలండీ' అన్నాడు. తనకు వచ్చిన ఉత్తరం ఆయనకు అందించి.

'ఇన్స్యూరెన్సులోనే మా అల్లుడు పనిచేస్తున్నా డండీ' అన్నారు అనంతరావుగారు.

'అహా!' అన్నాడు కుశాలరావు యథాలాభంగా... కాని ఆ తర్వాత 'ఏ అల్లుడు' అని సందేహం వచ్చింది.

'ఎవరన్నారు' అని అడిగాడు.

'అదేనండి. మా వనజ మొగుడు. హైదరా బాదులోనే ఎల్. ఐ. సీ. లో పనిచేస్తున్నాడు. ఏదో పరీక్షలు కూడా ప్యాసయ్యాడు. త్వరలోనే ఆఫీస రవుతానని వ్రాశాడు .... అయితే మీకు లెక్చరర్ ఉద్యోగం వచ్చలేదా!

కుశాలరావు అదిరిపడ్డాడు. వనజకు వివాహ మయిందా! తనెంత పొరపాటు పడ్డాడు! పైగా అనంతరావుగారి సహృదయతను కూడ అపార్థం చేసుకున్నాడు.

షాక్ నుంచి తేరుకున్నాడు.

'అబ్బే! వచ్చుకేమండీ! ఏదో .... తోచీ తోచ నమ్మ ఏదో చేసినట్టు వూరికినే అప్లయి చేశాను. ఇంటర్వ్యూ వచ్చింది. వెళ్లడమా, మానడమా అని ఆలోచిస్తున్నాను.''

'మీకు కావాలంటే మా అల్లుడి అడ్రసు ఇస్తాము. అతని రూములోనే దిగండి. ఏ ఇబ్బందీ రాకుండా చూస్తాడు' అన్నారు అనంత రావుగారు.

'చాల థ్యాంక్సండి. అలాగే వెళ్లేటప్పుడు చెబుతాను' అన్నాడు కుశాలరావు బహు నీరసంగా.

ఎన్నడూ ఇంతవరకు ఓటమి అంటే ఎరు గని కుశాలరావు మొదటిసారిగా అంగీకరించవలసి వచ్చింది. 'ఎంతో తెలివిగలవాడననుకుంటున్న నీ బుద్ధి నీ విషయంలోనే ఇంత మందగించిం దేరా కుశాలరావూ' అని స్వగతంలో తిట్టుకున్నాడు. ★

## 1-వ క్రొత్తనుడికట్టుకు జవాబు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1ప | రు | 2వెం | ■ | 3రా | జా | 4శ్రీ | ■ | ■ |
| ■ | ■ | తె | ■ | ము | ■ | వ | ■ | 5చి |
| ■ | 6మొ | న | గా | డు | ■ | 7ము | య | త్ర |
| ■ | ద | ■ | ■ | ■ | 8ఏ | లు | ■ | వ |
| 9ప | లు | ■ | 10ఊ | య | ల | ■ | 11గా | థ |
| ని | ■ | 12ఆ | సు | ■ | ■ | ■ | ర | ■ |
| 13క | సు | వు | ■ | 14న | డ | 15వ | డి | ■ |
| త్రై | ■ | లిం | ■ | య | ■ | డ్ర | ■ | ■ |
| ■ | ■ | 16త | ల్ప | ము | ■ | 17న | క్ష | త్రం |


పౌడర్లలోకెల్ల మేలైనది

రాజా టాల్క్




- బహు ప్రత్యేకమైనది
- మంచి సువాసనగలది
- చాల మృదువైనది




తయారుచేయువారు:
ప్రఖ్యాత 'రాజా స్నో'
తయారుచేయువారిచే తయారుచేయబడినది
మణ్యం & కంపెనీ, బెంగుళూరు-20.
GP

క్రింది చోట్లయందు లభించును:
మెసర్సు బెజవాడ వెంకన్న & సన్సు, రాజమండ్రి.
,, పువ్వాడ పుల్లయ్య & సన్సు, విజయవాడ.
,, రామా ఏజెన్సీస్, నెల్లూరు.
,, రవి & కంపెనీ, 53, బందరు వీధి, మద్రాసు-1.

ఫిలిం స్టార్ తోలు మడమల నైలాన్ ప్లాస్టిక్ పాదరక్షలు.




స్త్రీలకు, కాలేజీ విద్యార్థినులకు వివిధ అందమైన డిజైనుల లోను, ఆకర్షణీయమైన రంగులలోను లభించును. కొలతలు పంపండి. ధర: స్పెషల్ రు 5/75. కాశ్మీర్ రు 7/25. పోస్టేజి రు 1/50 అదనం. ఏదైనా రెండు జతలు కొనువారికి పోస్టేజి ఉచితం. వి. పి. పి. ద్వారా కోరండి. లేక M. O. పంపండి. తృప్తి కరముగా లేనియెడల డబ్బు వాపసు చేయబడును. ఉత్తరాలు ఇంగ్లీషులో వ్రాయండి. వ్యాపార వివరాలకు వ్రాయండి.

ALANKAR TRADERS (APM)
Gandhi Baug, Nagpur-2.

ప్రతివారం ఆంధ్రదేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.

'ఆంధ్రసచిత్రవారపత్రిక'లో ప్రకటనలు మీవ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి.




# రాబిన్ బ్లూ

ప్రకృతి సహజమైన తెల్లదనానికి




ARBC-17 TE

అట్లాంటిస్ (ఈస్టు) లిమిటెడ్ (ఇంగ్లండులో ఇన్‌కార్పొరేట్ చేయబడింది)

# తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతోగాని, చక్కెర లేకుండగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన విషయము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈ వ్యాధి, తన బంధంలో చిక్కినవారిని అరోజుకారోజు మృత్యువుకు ఆసన్నుని చేయును. ప్రథమదశలో శారీరక, మానసిక శ్రమలకు ఇచ్చగించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడలలో తిమ్మిరి, నరముల బలహీనతతో ఈ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు నోరు యెండుట, దురదలు, కాళ్ళలో వగుళ్ళు, తూకం తగ్గడం, శరీరమంతా పొట్లు, కీళ్ళనొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యేర్పడ సంభవించవచ్చును.

"వీనస్ ఛారమ్" మాత్రలు వాడి అనేక వేలమంది తమ బాధలనుండి నివారణపొంది మృత్యు కరాళమునుండి రక్షింపబడిరి. "వీనస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులపైద ప్రాచీన యునాని వైద్య విధానం ప్రకారం అమూల్య ఔషధుల శాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. "అమిత దాహము, మూత్రంలో చక్కెర తగ్గి పలుమారు మూత్ర విసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలా భాగము నివారణ యగును. కొద్దిరోజులలోనే మీకు నిగావికిపైగా స్వస్థత చేకూరినటనిపించును. "వీనస్ ఛారమ్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేక పథ్యములేదు. నిరాహారముతోనుండే అవసరంలేదు. రోగులు పుష్టి కరమైన ఆహారము తినేందుకై ఇదివరకటికంటె ఎక్కువ రకాల ఆహార పదార్థములు తీసికొనవచ్చును. వివరములుగల ఇంగ్లీషు కరపత్రములు అడిగినవారికి ఉచితముగా పంపబడును. 50 బిళ్ళల ఖరీద రు. 6—75 న. పై. మాత్రమే. పోస్టేజి నిమిత్తం రు. 1—6 న. పై. అదనం. (ఒకేసారి రెండు) అంతకుపైగా సీసాలను తీసికొన్నచో పోస్టేజి ఉచితము.

(SELLING AGENTS)
Barrys Commercial Corporation
(A. P. W.)
27/A, Dhurumtollah Street
CALCUTTA-13.

# చిత్రభేదము

9-వ పేజీ తరువాయి

"రైట్, రేపే షూటింగ్ ప్రారంభిద్దాం" అన్నాడు నిర్మాత.

నేను నవ్వాను. "కథో—తారలో—మ్యూజిక్కో" అన్నాను.

"దాండేముందిలేవయ్యా, కతలేముచ్చి ఇప్పుడు మనకు తెలీని కథలా ఇవి! పాంగికంఐతే కిట్టుద్ది. అదూ, అదీ పేమించుకుంటారు—ఆళ్లనాన్న ఒద్దంటాడు—ఇద్దరూ లేసిపోతారు—ఆళ్లనాన్న ఎతుకుతాడు—ఇట్టాగేగా!" అన్నాడతను సాగదీస్తూ.

"ఏదేనా, రైటరుఅంటూ ఒక డుండాలిగా"

"మాదాంలేవయ్యా, ఇంకా కొత్త. మొదట్లోనే ఇయ్యన్నీ పెట్టేయక. ఆనక డబ్బులుండవు. సరే నువ్వేం తీసుకుంటా?" అని అడిగాడు.

"మీ ఇష్టం" అన్నాను.

"సరే, మూడొందలు తీసుకో—డైరక్షనంతా నీదే"

"మూడొందలా—అంటే నెలకా?" అని అడిగాను.

"ఐలేవాడివయ్యా, నెలకు మూడొందలు నీకే ఇస్తే నేనేం తినను? మొత్తానికే" అన్నాడు.

'నాకు కిట్టదు' అనబోయే సమయంలో ఫలానా వచ్చాడు. రావలసిన సమయానికి నారదు డొచ్చినట్టు.

"ఏందిసిన్నాడా—రా" అన్నాడు నిర్మాత.

"నమస్కారంసార్" అన్నాడు నావేపు తిరిగి.

"ఈయన్నెరుగుదువా చిన్నాడ" అన్నాడు నిర్మాత

"ఎరక్క? మంచి మాటన్నారు—పెద్ద డైరక్టరు గదండీ—వారే గనక మీ చిత్రానికి గనక నిజంగా గనక డైరక్టరే గనక ఐతే గనక......"

"గనకేటయ్యా—అరే!" అన్నాడు నిర్మాత.

ఫలానా ఒక్క ఎగురు ఎగిరి, 'ఛేక' అని చేక వేశాడు.

"మీ చిత్రం హిట్టే పొండి, నా సామిరంగ. శత దినోత్సవాలు ఆరేసి తక్కువదియ్య" అన్నాడు వంతోషంగా ఫలానా.

"అట్టాగా—అయితే అయిదొందలు తీసుకో, మహాశయా" అన్నాడు నిర్మాత.

"ఐదువందలు......" అని గొణిగాను.

"వొదలుకోకండి గురూ! మీకేం భయంలేదు. ఛాన్సు! పోతే మళ్లీరాదు. ఏమిస్తే అది రాసిండి. మంచి సంస్థ—మంచి ప్రొడ్యూసరు—ఆలోచించుకోండి" అన్నాడు ఫలానా.

"ఆలోచించుకొని గావాలంటే రేపొచ్చి చెప్పు" అన్నాడు నిర్మాత.

"ఇంకా రేపొచ్చి చెప్పేదేముంది? నా మాటలు వినండి. ఇట్లాగే వెనక ఒకడు, వచ్చిన ఛాన్సును పోగొట్టుకుని, నానా తిప్పలూపడ్డాక—మీకా కథ చెప్పమంటారా?" అని సమాధానంకోసం కూడా చూడక మొదలెట్టాడు ఫలానా.

"రెండేళ్లకిందట హీరోవేషాలువేసే ఒక ఆయన, తనకో బుకింగొస్తే కాలదన్నిన కథ. ఆ హీరో ఒకప్పుడు మంచి హీరో. కాలక్రమాన పిక్చర్లు తప్పిపోయినాయి. మరుగునపడ్డాడు. అట్టి సమయంలో ఒక నిర్మాతగారు, పిలిచి తక్కువ డబ్బులు కొస్తాడు గదాఅని బుక్‌చెయ్యబోయాడు. అతను ఇదివరకు తీసుకునేదానికి అయిదువేలు తగ్గించాడు. "నాకు పిక్చర్లు లేకపోతేనేం—నాకున్న పేరు నాకుంది—నా రేటుకు కనీసం వయాన్పైసాకూడా తగ్గదు" అన్నాడు హీరో. నిర్మాత చాలా చెప్పిచూశాడు, అతను లొంగలేదు. ఫ్లాప్ లక్షణాలుగల సినిమా తీశావని విడుదలైన మొదటిరోజే తెలుసుకున్న నిర్మాతలాగా ఎక్స్‌ప్రెషన్ పెట్టుకుని నిర్మాత వెళ్ళిపోయాడు. హీరో ఆలోచన ఏమిటే—ఆ నిర్మాత తిరిగి మళ్ళీవచ్చి తను కోరిన డబ్బు ఇస్తాడని. నిజానికి అతనికి ఒప్పుకోవాలనేవుంది. కాని, ఆశ! మూడురోజులదాకా చూశాడు. నిర్మాతరాలేదు. హీరోకు కంపరమెత్తింది. రాక రాక వచ్చిన పిక్చరును ఇట్లా వదులుకున్నానేం చెప్మా అని దిగులుపడి, శాడ్‌సాంగ్‌కు పెదవులు కదుపుకుని, 'హుఁ' అని బరువుగా అని, తలవెంట్రుకలు నాలుగుతీసి నుదుటిమీదకు లాక్కుని, తల వంచుకొని సోఫాలో— అది ఒకప్పుడు సోఫాలెండి— కూలబడి సారోఫ్లస్ పోధాన్‌లోపడి, అరగంటపోయాక



లేచాడు. లేచి ఉషారుగా నిర్మాత దగ్గరకు వెళ్లాడు.

"ఏం ఇలా వచ్చారు?" అన్నాడు నిర్మాత—గడ్డం గీసుకుంటూ.

'హీరో ఏం చెబుతాడూ?' "ఊరికే!" అని నవిగాడు.

"ఏ ఊరికి?" అన్నాడు నిర్మాత నవ్వుతూ. ఇతనూ శ్రుతికలిపి, ఇద్దరూ యుగళంగా నవ్వుకున్నారు. ఆతర్వాత—

"ఓగంట కూచుంటారా—నేను స్నానంచేసి, టిఫిన్‌చేసి, బట్టలు వేసుకుని వీధిలోకివెళ్లి పని చూసుకుని వస్తాను" అన్నాడు నిర్మాత, నిష్కర్షగా.

అక్కడేమనాలో హీరోకు తెలియలేదు. ఏ భావం ప్రకటించాలో కూడా తెలియలేదు. అందుకని, ప్రేమిస్తున్న హీరోయిన్, ఒక్కసారి నిరాకరిస్తే హీరోలు ఇచ్చే ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు! నిర్మాత చాప కింద నీరులా ప్రవహించి—'హుఁ హుఁ హుఁ......' అన్నాడు. అని—"నాకు తెలుసు బ్రదర్, నువ్వెందుకు వచ్చావో. కాని, నేను ఎంత బతిమాలినా బామాలినా నువ్వు విన్నావుకావు. నీ కాళ్లమీదపడి తలప్రద్దలుచేసుకుని......" అమ్మో అమ్మో" అని అరిచినట్టు అరిచి — వేడుకుంటాననుకున్నావు కాబోలు. నేనేం కథలోని హీరోయిన్‌నుకాను.

ఇంకో ఆరువేలు తగ్గింపుకే ఒక కొత్తవాడిని పెట్టుకున్నాను. ఎగ్రిమెంటుకూడా ఐపోయింది. నేనేం చెయ్యలేను—సారీ అనటం కూడా దండగ అనుకుంటాను" అన్నాడు నిక్కచ్చిగా.

ఈసారి హీరో లేచి నించున్నాడు.

"ఇది సినిమా ఇండస్ట్రీ. ఇక్కడ బిగింపులు పనికిరావు. ఎవరికీ ఒక రేటంటూ ఉండరాదు. పిండికొద్దీ రొట్టె. వచ్చిన ఛాన్సును పోగొట్టుకుంటే అంతే! ఇంకెప్పుడూ ఇటువంటి పన్ను చెయ్యకు. చేస్తివా—ఇంతే. ఇట్లాగే జరుగుతుంది! నువ్వే కావాలని నేననుకున్నప్పుడు—నువ్వు నీ ఇష్టం వచ్చినట్టు కోరవచ్చును. కాని ఆ పట్టింపు నాకు లేదు. మూలపడి ఉన్నావు కదా నిన్ను ఉద్ధరిద్దామని కాదు—నాకో నాలుగురాళ్ళు తగ్గుతాయని, నీకో నాలుగురాళ్ళు ముడతాయని అనుకుంటావని అనుకున్నాను. పెద్దతారలు బిగించుకున్నారని నువ్వూ బిగించుకోకు. పులినిచూచి నక్క వాతలు వేసుకుంటే, దాని ఒళ్లే కాలుతుంది!" అన్నాడు నిర్మాత లోపలకు నిష్క్రమిస్తూ. జాలీగా వచ్చిన హీరో జాలిగా వెళ్ళిపోయాడు!

అంచాత డైరక్టరుగారూ—ఇది ఒదులుకోకండి. ఆతర్వాత మీ ఇష్టం!" అని ముగించాడు ఫలానా.

"ఓరినీ .......... గట్టోడివేనే" అని మెచ్చుకున్నాడు నిర్మాత.

"గట్టికాక—ఏవనుకున్నారండీ—చిన్నప్పుడు చేసిన కసరత్తు ఊరికేపోతుందా?" అని అడిగాడు నిర్మాతను.

"పోదురో" అన్నాడు. నిర్మాత కనుబొమలు జుట్టుకు తగిలేట్టు ఎత్తి.

"అయ్యా—నామాట వినండి. వారూ కొత్త ప్రొడ్యూసరు. ఇదే వారికి ప్రథమం. రెండు మూడు అనుభవాలు కలిగితే, మీరు కోరినంతా ఆయన ఇవ్వొచ్చును. ఇప్పుడంతగా పట్టకండి. మీ వర్కు బాగుంటే, సంతోషించి మరో పదో, పాతికో ఆయనే ఎక్కువ యివ్వొచ్చును — పైగా, హిట్‌గాని కొంత దీసితీశారంటే—శతదినోత్సవంలో పెద్ద షీల్డొకటి




ఇస్తారు. అదొకటి కిడుతుంది......ఏమిటి మాట్లాడ రేమిటి?.........మీ పొర్సను పిపోలేదు — అసి స్టెంటు డైరక్టరు డైలాగులుతెచ్చి ఇవ్వాలి గావును... ఒప్పుకోండి" అన్నాడు ఫలానా.

నేను పైకి చూశాను. 'ఒప్పుకో' అని వినిపించింది. ఇంకో మూల చూశాను. 'ఒప్పుకో' అని వినిపించింది......ఆమూల చూశాను "ఒప్పుకో" —క్రింద చూశాను. "ఒప్పుకో ఒప్పుకో ఒప్పుకో" అని అంతటా గోల గోలగా వినిపించేశాయి.

"ఒప్పుకుంటాను. ఒప్పుకుంటాను" అన్నాను ఆవేశంగా, ఈగోల భరించలేక.

"అట్లాగొప్పుకో—" అన్నాడు నిర్మాత.

"ఆవేశపడకండి — ఆవేశపడకండి! ఆవేశాలు ఆరంభంలో అంత అచ్చిరావు" అన్నాడు ఫలానా 'సంభాషణ'గా పలుకుతూ.

"ఒరే ఒరే—నువ్వేందిరా సినిమాలో మాటాడినట్టు ఆడుతున్నావూ—నువ్వే రాసేత్తావేట్రా మన సినిమాకూ—వన్లో పని!" అన్నాడు నిర్మాత.

ఫలానా కొద్దిగా నీరసించి దిగులుగా అన్నాడు: "రాయడానికి అభ్యంతరం ఏముంటుందిలెండి—తీరా రాశాక, ఆస్క్రిప్టుని ఇంకో బరువు రచయితదగ్గరికి పంపిస్తారని భయంగాని!"

"సర్లేవయ్యా డేరట్టరూ — మరి పని మొదలెట్టూ" అన్నాడు నిర్మాత.

"కథండీ—కథ కావాలికదా! ఎవర్నయినా రైటర్ని కూడాలి—"

"మళ్లీ కతంటాడూ—కతకోసమో రైటరెందుకయ్యా — మనం లేమూ — సిన్నోడ్ని కూడా ఏసుకుందాం గావాలంటే. లేదా, మా ఊళ్లో ఎంకట్రావున్నాడు—ఆడిని పిలుద్దాం. ఆడోసారి పత్రికలో కతరాశాట్ట" అన్నాడు. తనే నిర్ఘాంతపోతూ— నిర్మాత.

"అదికాదులెండి—కథ....." అని, ఫలానా వాసేప్పు తిరిగి—"ఏవండీ ఊళ్లో ఆడుతున్న సినిమాలన్నీ నాలుగురోజుల్లో చూసివద్దామా—ఏదేనా దొరుకుతుంది — లేకపోతే ఏ బెంగాలీ కథో కొట్టేద్దాం —కొట్టేసట్టు తెలియకుండా" అన్నాడు.

"అదెట్లా?" అన్నాను.

"మన కథ మొత్తం మార్చేద్దాం. అదెంతసేపు?"

"అబ్బాయ్, అదంతా లాభంలేదు. కథకోసం మనం ఎన్ని తిప్పలన్నా పడవలసిందే. అసలు చిత్రానికి మూలం కథేనని, కథలో బలం లేకపోతే లాభం లేదనీ నా నమ్మకం. కావాలంటే ఓ కథ చెప్తాను— ఇద్దరూ వినండి. కథకు ప్రాముఖ్యం ఇవ్వకుండా, లక్షలులక్షలుపోసి తీసిన ఒక చిత్రం ఒక్కరోజులో ఎట్లా ఎగిరిపోయిందో!"

"చెప్పు చెప్పు—బాగుంటే ఈ కతే తీసుకుందాం" అన్నాడు నిర్మాత.

నేను ప్రారంభించాను. (సశేషం)



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor : S. Sambhu Prasad,




లక్మె ఫేస్ పౌడరు మీ చర్మపు సహజ సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తుంది. మీ చర్మపు ఛాయతో, అద్భుతంగా, సున్నితంగాకలిసి పోతుంది. మీ వంటి రంగుకు అది తెచ్చే ఫలితాన్ని చూసి మీరు విస్మితులౌతారు. మూడు సైజులలో ... 6 ఛాయలలో ... నేచురల్, రేషెల్, గోల్డెన్ పీచ్, రోజ్ కోరల్, సన్‌టాన్, గ్లోయింగ్ యాంబర్.

# లక్మె

ఫేస్ పౌడరు